

భారతి. సెప్టెంబరు '47.

గృహోన్ముఖుడు

— చిత్రకారుడు : శ్రీ కే. ప్రభాకరరావు. —



సంపుటము 24
సంచిక 9

# భారతి

సెప్టెంబరు 1947
సర్వజిత్తు, నిజశ్రావణము

## ఆగస్టు ౧౫

రెండుసెలలబట్టి అదేధ్యాసగా రోజులు లెక్కపెట్టుచు తహతహతో ఎదురుచూచిన రోజు రానే వచ్చింది.

పరమేశ్వరానుగ్రహమున మన కొంతంత కోరికా ఈడేరింది. కోరిన తీరులో కాకపోతే మానె— అసలు కోరిక తీరింది.

ఇన్నాళ్లుగా ఇక్కడ తిష్ఠవేసుకొని, మనలను బానిసలనుగాచేసి పాలించిన పాశ్చాత్యప్రభువులు కాలగతికి కట్టుబడి, 'తమ పిడికిటపెట్టుకొని యుండిన అధికారమును చేతులారా భారతీయులకప్పగించినారు. తమ జాతివారిని మూటముల్లెలుకట్టించి, స్వదేశమునకు తరలించుకొనిపోయినారు.

మనము స్వతంత్రులమైనాము. భారతమాతకు దాస్యపు చెర విడిపోయింది; స్వారాజ్యలక్ష్మి భారతఖండాన పాదం మోపింది.

ఆగస్టు ౧౫—అక్షరాలా అది పర్వదినం! అపరదీపావళీమహోత్సవదినం!!

మూడువందలయేండ్లుగా భారతదేశమును అలముకొనియున్న దాస్యపుచీకట్లు విచ్చిపోయినవి. స్వాతంత్ర్యపు వెలుగులు సర్వతోముఖంగా కాంతులు చిమ్మసాగినవి.

నానాయాతనలపాలై, కన్నకష్టాలూ అనుభవించి, ఆయుధాలప్రమేయం లేకుండానే అమోఘమైన పోరాటాలుసల్పి నీరసించి కొక్కిల్లిపోయిన ప్రాణాలకు ఆగస్టు ౧౫ హాయిగా అమృతసేచనంచేసి క్రొత్త ఊపిరి పోసింది. నిద్రాణమైయున్న జాతికి మేలుకొలుపులుపాడింది.

భారతీయులు ఉత్సాహానందాలతో మేల్కొన్నారు. క్రొత్తజవసత్త్వాలు వచ్చినవి. పారతంత్ర్యం పటాపంచలు కావడంతో స్వేచ్ఛాస్వాతంత్ర్యవాయువులు పీల్చసాగినారు.

అది భారతదేశచరిత్ర క్రొత్త అధ్యాయంలోనికి, క్రొన్నెలలు వేయ నారంభమైన నవవసంతోదయము.

భారతీయులపాలికి అది మహత్తమ పుణ్యదినము. మన అదృష్టరేఖలను తీర్చిదిద్దగల శుభముహూర్తము.

ఒక్క 'మన' అన్నమాటయేమిటి! యావదాసియా ఖండమునకు—కాదు కాదు, యావత్తు ప్రపంచానికి అది మహోదయము.

ప్రాచ్యలోకములో క్రొత్తతార—స్వాతంత్ర్యతార వెలసినది. క్రొంగ్రొత్త ఆశలు, ఆశయాలు రూపెత్తినవి. కలకాలముగా కలలుగాంచిన ఆకాంక్షలు క్రియారూపముదాల్చ అవకాశమిచ్చినది. ఇది చలతార కాక ధ్రువతారయేకాగలదనుట నిష్కర్ష.

ఇట్టి మహోదయ వాసరము పండుగదినము అగుటలో అతిశయమేమున్నది!

ఆనాడు భారతీయులు ఆబాలగోపాలము అన్యాదృశానందముతో, కలిమిలేములంకూడ పాటించకుండ, పండుగచేసుకొని మురిసినారు.

ఆనాటి ఉత్సవవైభవము దీపావళి ఉత్సవ వైభవమును మించిపోయింది. ఊరూరా, ఇంటింటా స్వాతంత్ర్యజ్యోతులు వెలిగినవి; భారత విజయపతాకలు ఎగిరినవి; స్వాతంత్ర్యనాదములు మారుమోగినవి; జయఘంటలు నినదించినవి.

ఎవరి మొగము చూచినను కళకళలాడుచు కనిపించినది. ఎవరి హృదయములు పరికించినను పరితోషభావము నిండి తొణికిన చిహ్నములు గోచరించినవి.

అందరును బ్రహ్మానందమున మునిగినారు. ఉత్సవములు చేసినారు. ఊరేగింపులు జరిపినారు. సభలు సలిపినారు. సమావేశములు కూర్చినారు. ఆ ఉత్సవములు, ఆ వేడుకలు చూచి దేవతలుకూడ దివ్యహర్షము చేసినారు.

కాని, ఇల్లలకగానే పండుగకాలేదన్న సామెతకూడ ఒక వంక స్ఫురణకువచ్చుచున్నది. స్వాతంత్ర్య భానూదయమయితే అయిందిగాని, నలువంకలా చాలు కలందాచుకొని కాలమేఘ మాలికలు ముంచుకొన్నవి ముంచుకొన్నట్లుగానే ఉన్నవి. ప్రజలలో జీర్ణించిపోయిన విద్వేషోద్వేగాలు సమసిపోలేదు సరిగదా, పరాయివారు తెచ్చిపెట్టిపోయిన ఆ పాతవాసనలు ఇంకను విజృంభించుచున్న జాడలు పొడగట్టుచున్నవి. ఇది నిజముగా విచారకరము.

అయితేనేమి! అదృష్టచక్రము అనుకూలగతికి తిరిగినది. కాబట్టి ఇకదానికదే దిద్ది తీర్చుకోగలదు. ప్రజలలో వ్యాపించియున్న అరిషడ్వర్గములు దాని పరిభ్రమణవేగములో అవియే పరాస్తములయిపోవును.

స్వాతంత్ర్యము సిద్ధించినది కాబట్టి, వేరుగా ఉన్న కక్షలు, ఈ అంతఃకలహములు అణగి, శాంతి చేకూరి, కోల్పోయిన వైభవము తప్పక సమకూరి తీరగలదు. ప్రజ కూడ శాంతిసౌభాగ్యసంపదలతో సుఖించియే తీరగలరు.

ఈ శుభదినమున, అన్ని విచారములను విస్మరించి, గాఢముగ అందరును ఆనాడు ఒక్కుమ్మడి ఆనందసాగరమున ఓలలాడినారు.

ఇటువంటి సంతోష సందర్భమున, ఇంతటి ఆనందసాగరమున మనలను ముంచినదెవరు? దేశములో స్వాతంత్ర్యజ్యోతిని వెలిగించిన మహాశక్తిని మనసారా స్మరించుట మనవిధి.

ఆ మహాత్ముని భారతీయులందరును సదా కృతజ్ఞులై యుండగలరు. తరతరములకును ఆయనపేరు నిలిచిపోవును.

ఆయన—

ఈ స్వాతంత్ర్యసౌధమునకు మహాశిల్పి.

మన జాతిపాలిటికి జీవనదాత.

మూర్తీభవించిన ప్రాచీనభారతీయాత్మ.

స్వాతంత్ర్య జ్యోతిని ఉద్దీపింపజేసిన జ్యోతీరూపుడు.

ఆయన పుణ్యాత్ముడు. సంకల్పసిద్ధుడైనవాడు.

ఇదివరకువలెనే ఇకముందుకూడ ఆయన ఆదేశానుసారముగా నడచుకొని శాంతిసౌఖ్యసౌభాగ్యములతో విలసిల్లుట ఇక మనవంతు.

ఈ కర్తవ్యమును భారతీయులు విస్మరింపరని ఆశించుచున్నాము.

# ఎన్నాళ్ళకు?*

శ్రీ నాయని సుబ్బారావు

కారుమబ్బుల నల్లకప్పు కేసిన నింగి
పారతంత్ర్యతమస్సు పాముకొన్న ధరిత్రి
కలికిరాయంచ రెక్కలు విప్పుకొనియెనో
తెలితమ్మి పూలరేకులు కప్పుకొనియెనో
ఎన్నాళ్ళకెన్నాళ్ళకీ మహోదయదీప్తి
కన్నారగాంచు భాగ్యము గల్గె మన కహో!

ఈ మహోదయమున నిలువెల్ల పొంగ
నమల తుంగతరంగ హస్తముల నెత్తి
పిలుచు స్వేచ్ఛాసుధాజలధి రాజు
కడిగివేయుదు దాస్యపంకమ్ము నేడు.

విశ్వస్థితిక్రియావేది పృథ్వీరాజ కరచక్రమున వింతకాంతు లీని
రసపుత్ర శౌర్య సాహసగతి బ్రహ్మ సంగ్రామసింహుని భుజాగ్రమున మెరసి
మాతృదాస్యకరాన మర్మకోవిదుడు శ్రీ శివ దేవుని లలాటసీమ వెలిగి
త్రిదశసాదృశులు మున్నదిమూడుకోట్ల సిపాయివీరుల హృదబ్జముల రగిలి.
నివురుగప్పిన స్వాతంత్ర్యవహ్ని నేటి-కిమరె మన బోసినోటి తాతయ్య వలన
శాంతిమై స్వచ్ఛమై యహింసాప్రధాన-తత్త్వదీపితమై శుభోదయము గూర్చె.

వేదఋషుల్ బోధించిన పవిత్రసనాతన ధర్మతత్త్వముకో
లేదనకుండ కాదని మలీమసవృత్తి సహంక్రియా తమ
చ్ఛాదితవక్రమార్గమున స్వార్థము నూది అనైక్యతామయో
న్మాదుల మాట దాస్యమున మగ్గి మిడుకుచున్న నాళ్ళలో.

ఒకని కొకండు హెచ్చని మరొక్కడు లొచ్చని యేమి భ్రాంతి! సాం
ఘికముగ నద్ధమ్ములు బిగించి స్వకీయుల మధ్య జాతి జా
తికి గిరిగీసి, ఐక్యము గతింప, నఖండ మహోజ్జ్వలమాతృమూ
ర్తి కిటులు ఖండరూపము విధించితి మెంతటి పాపకర్మమో!

---

* ఇదివరకు, దీని వెనువెంటనంటియుండు ఇతరకవితారచనలను అలరించినా రేడియో మద్రాసు కేంద్రము వారు ఆగస్టు 15 న 'మహోదయ' మన్న పేరుతో ప్రసారము చేసిన 'గీతాంజలి' లోనిది. దీనిని ప్రకటనకిచ్చిన వారి సౌజన్యమునకు కృతజ్ఞులము.

-

ఈ రాహుగ్రసన మహా-ఘోరమ్ము శమించి ఘాతకోటి తరింపగ
భారత జనని కఖండా-కారము పూరించు పుణ్యకర్మ మెప్పుడో!

అది, శాక్యముని చంద్రు డాత్మసాక్షాత్కార విమలతేజోరాశి, విశ్వహితము మేల్కొల్ప తొలిసారి మృగదావమున ప్రవర్తనమొనర్చిన మహాధర్మచక్ర మవిరళధర్మరాజ్య వ్యవస్థాపనాశయుడు మౌర్యాశోకచక్రవర్తి, దానిని త్రిప్పి కాదా భారతీయ సంస్కృతి నేల నాలుగు చెరగులందు వలయములు వేసుకొన గిరవాటువైచె-నీ మహోదయ పుణ్యవేళా మహత్వ మేమొ తద్వైభవశ్రీ సమృద్ధి వెలయు-నది స్వతంత్రభారతపతాకాంకమయ్యె.

కలుషదూషితమై వల్లటిలు ప్రపంచ-మునకు సుస్థిరశాంతిశోభనము గూర్ప స్వీయ విజయ ధ్వజామలచ్ఛాయ నిలిచి-ధర్మభేరి మ్రోయింపు డుదాత్తఫణితి.

ఘాతదుర్భరదాస్య దురితసంతమసమ్ము
స్వాతంత్ర్య నవయుగోద్భవ దివ్యరాగమ్ము
జనని చన్నొసల స్వేచ్ఛాపయ స్సుబికెనో
జనని కన్గొనల విశ్వశ్రేయ మొలికెనో
ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కీ మహోదయ దీప్తి
కన్నారగాంచు భాగ్యము గల్గె మన కహో!

---

# ఓం శాంతిః



శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు

తెలవారెం దెలవార, పీడకలయై త్రెళ్లెన్ బరాధీనతా
కలుషం, బాలయగోపురధ్వజములన్ ఘంటాఘణాత్కారముల్
చెలగెన్, నల్వదికోట్ల గొంతుక జయశ్రీగీతి విస్ఫార, మం
గళతూర్యమ్ములు మ్రోసె, భారతము మింటన్ దోచె మువ్వన్నియల్.

ఉపలాలించుచు, భోగభాగ్యములలో నుయ్యేల లూగించి, గా
రవు దేవింబలె నేలి, దాసిని బలెన్ రారావులం బెట్టు ధా
త్రిపులన్ రోసి, నిజప్రజన్ భరతపృథ్వీదేవి పట్టాభిషే
కపరీతం బొనరించుకొన్నది జగత్కల్యాణ సంధాయియై.

చిరకృశీభూత ధర్మరై, శిథిలదేహ-యష్టిరై, ప్రాణముల్ కన్నులందునిలిపి,
మరల 'స్వగృహే'యటంచు సంకల్పమునకు-దొసగ, నీయవ్వకుం జేవ
[యుడుగలేదు.

తంత్రిశాతముత్తాతలు తరతరమ్ము-జేసిన తపస్సు పండి నీచేతి కందె
పాడి మొదవట్లు చేపె నీభరతధాత్రి-పాలు పొంగించి, పంచరా, పాయసమ్ము.

కడుపునిండ గూడు, నొడలునిండగ గుడ్డ-ఎండ వాన సోకకుండ గీము
పాపపుణ్యములను బరికించుకొను తెల్వి-పంచుమన్న! మేలు పంచరన్న!

ఒరుల కలిమి కాసింపదు-ఒరు కష్టము దినెడి నైచ్య మొల్లదు, పరులన్
జెరపి బ్రదుకు టప్రాచ్య-మ్మరసి బ్రదుకు బాట కెత్తరన్నా దివియల్!

కర్మఫలదాతదైవమ్ము కలిమినమ్మి,-నడచుటకు మిన్న విడచుటన్ గురు తెరింగి
నడపరా, భోగసంసక్తి జెడుజగమ్ము-ధర్మచక్రసంయుక్త పథమ్మునందు.

పాడియు బంటయుం గలిగి, పాడిదొరంగక, కల్గినంతలో
వేడిన రిత్తపుచ్చక, నివేదనసేయని భుక్తినొల్ల, కె
గ్గాడక, సర్వభూతహితయై శుభశీలత స్వస్తిగీతముల్
పాడర పల్లెపల్లెలను వాడలవాడల పుణ్యగేహినుల్.

కోరను రాజ్యభోగములు, కోరను స్వర్గసుఖమ్ము, మోక్షమున్
గోరను నాకునై, వెతలగుందెడి యార్తుల దుఃఖనాశమున్
గోరెదనన్న ప్రాక్తనుల కోరికతీవల కల్లుగంబమై
భారతధర్మదీక్షితపై గుసుమార్చన క్రొత్తసల్పరా!

పరమాంసాదులు, యంత్రయంత్రితులు, సంపన్మోహమత్తుల్, తమః
పరతంత్రుల్, పరమాణుగర్భదళనోపాయజ్ఞులై మర్త్యులన్
జెఱుపంబూనిరి, ధర్మరక్షితజయంతిన్ దాల్చి చేయెత్తి, చా
ప్పర 'ఓం శాంతి' పురాణభారతధరావత్యమ్మ! స్వస్త్యస్తు తే.



పరదాస్యయుశృంఖలంబులు నిజ
ప్రాణార్పణన్ ద్రెంచుచున్,
చిరకాంక్షాపరిపూర్తి శ్లాఘ్యఫలమై
సిద్ధింప, నీ పుత్రుల
ల్లరుగో, యంబర మెక్కి పూలజడితో
వర్షించుచున్నారు, తి
య్యనరలో కార్త్యలు వెల్గ నేఁటి జయమం
దున్ గ్రప్రథం బోతురై.

పదిమూరేండ్లుగ నాఁటిలోఁ బడి మహా
ప్రారంభముల్ సేసియున్,
గడలన్, బోని స్వతంత్రతారథ మిదే
గాంధి ప్రబోధంబునన్,
గదియన్ మూఁగి బలంబుతోఁ బ్రజలు లా
గన్, మోగ్రిసుచున్, సాగుచు
న్నది నేఁ,డీ తిరునాళ్ళలో నొసఁగుఁ ద
న్నా కోయఁ గర్పూరమున్.

పరమామ్నాయపథంబు రక్షకముగా
బ్రహ్మర్షి రాజర్షి తే
ర్పులు పన్, శాశ్వతసుప్రతిష్ఠితము నీ
స్వాతంత్ర్య - మాధ్యాత్మికశ్రీ
కొరలో తద్విధవంబు నీ పతాకా
బ్బుల్ గొంత దక్కించు, నీ
కృతి కీర్తించుకొనంగ తే కరిగి రం
భా! నీక యర్పించుచున్.

వెందలేదో సతీలేని ప్రాక్తన యుగం
బుల్ తొల్లి సూర్యధ్వజం
బునిలంబై ధరలోఁ ద్వీసేఁ లెఁ, బయి నె
న్నో? చిక్కె మన్ నక్కపో,
'నిది మా కేతన' మంచు తే కరిగ నెం
తేఁ గాల మీనాటికి
ల్లడె జాతీయపతాక! భారతభవి
ష్యల్లక్ష్మికై బొల్పెడిన్.

నిగమోద్దీరిత ధర్మచక్రము త్రివ
ర్ణశ్రీ స్నిగ్ధ వర్ణత్రయిన్,
త్రిగుణాతీత మహాత్మ్యతో ధరత ధూ
దివ్యాత్మతా లక్ష్యమై
తగు జాతీయపతాక ప్రాక్తన చరి
త్రన్ జ్ఞప్తికిన్ దెచ్చి, ధ
ర్మగతిన్ భారత మయ్యశోకవిభు సా
మ్రాజ్యంబుగా జాటెడున్.

కను మిన్నాళ్లకుఁ జేతఁబడ్డ గృహ మీ
కల్యాణి! దారిద్ర్య మెం
దును నిండెన్, దొలి ధర్మకర్మగుణ నీ
తుల్ దీరె, మారెన్ బ్రత
ర్తనముల్, క్రొత్తలు సేరె, భారత మహో
ధర్మ ప్రతిష్ఠాపనం
బనుసంధింపుము దీని దిద్దికొన మ
మ్మా! దొడ్డ యిల్లాలవై.

ఒకరీతిఁ జన కన్యదేశములు, మా
రొరాపాయ దుస్తంత్ర యాం
త్రిక వైజ్ఞానిక ఘాతుకాదిక బలో
ద్వృత్తిన్ విజృంభింప, వా
నికి మాఱొడ్డుచు, నైతికాత్మబలమున్
శిక్కొల్పు శక్తిత్రయా
ధికులన్ బిడ్డల గాంచి పెంచి, చిరకాం
తిన్, నిల్పుమీ! భారతీ!

మన జాతీయపతాకకున్, స్మృత మహో
మాత్యాళికిన్, వారి పా
లన సూత్రంబులకున్, బ్రజావళికిఁ గ
ల్యాణంబు లౌఁ గాక, పం
డిన స్వాతంత్ర్యము శాశ్వతంబయి, తపో
నిష్ఠా రహోవర్ధనల్
మునులన్ సత్కృపు లిచ్చు స్వస్తివచనం
బుల్ శాంతి చేకూర్చుతన్.



చరిత్రా రీతుల చక్కఁ బెట్టుటకునై
సామర్థ్యమే లేనిచో
పరిపూర్ణంబగు సౌఖ్య ముండదు సుమీ
స్వాతంత్ర్య మే తెంచియున్.

కులతత్వ భేదంపు కుటిలత్వములు లేక
మతవిభేదంబుల మాటలేక
రాష్ట్రాభిమానంపు రగడలు లేకుండ
భాషావిభేదంపు పట్టులేక
ధనిక దరిద్రుల తారతమ్యము లేక
అధికార మోహంపు టాశ లేక
వ్యవసాయ కార్మిక వ్యత్యస్తములు లేక
స్త్రీపురుషవిభేద రీతి లేక
భారతాంబ స్వాతంత్ర్యంబు బడయుకొనుట
శాంతి సమరంబు పూర్ణమ్మై సలిపినటులె
భరత జనాభివృద్ధికై పాటుబడగ
దీక్షగొనగవలె నింక దేశ ప్రజలు.

దిగజారిపోయిన దేశ పరిశ్రమల్
తిరిగి పెంపొందెడి తెన్ను లరసి
వసివాడి క్షీణించిన వాణిజ్యము పెంచి
పరదేశములదాక ప్రాకఁజేసి
అరకొరలైయున్న ఆహార ధాన్యముల్
సర్వసమృద్ధిగా సంతరింప
ఆయురారోగ్యాల కాధారమౌ పాడి
పశుల పోషణ ప్రబలఁజేయ
మహితసేనాశక్తులు మాసనీక
దేశభక్తాగ్రగణ్యులు దీక్షతోడ
బహుళనిర్మాణ పద్ధతుల్ ప్రసరించి
చేయవలయును నిజ దేశ సేవ నిపుడు.

కొఱతలేదు నీటికి కొల్లగా పండింప
గంగాది నదులెన్నొ కలవు మనకు
తరుగులేదు మనకు ద్రవ్యంబు సమకూర్ప
కనక రత్నములిచ్చు గనులు గలవు
వెలితిలేదు మనకు విజ్ఞానమును గూర్ప
బుద్ధిసంపన్నులౌ బుధులు గలరు
చింతలేదు మనకు చేవదేరిన దేశ
భక్తాగ్రగణ్యులౌ ప్రజలు గలరు.
ధీబలంబు ధనబలము దేహ బలము
ఐక్యమొనరించి మించి సమైక్య ఫణితి
భారతాభ్యుదయమునకై పాటుబడిన
సాటిదేశాల మనభూమి మేటి గాదె!

మనదేశంబున క్షాత్రమే సతులు సా
మ్రాజ్యంబు పాలించుటల్
అనిలో పాల్గొని శత్రుసైన్యముల నా
హా వెందగావించుటల్
ఘన పాండిత్య ప్రకర్ష చే సభలలో
కౌశల్యమున్ జూపుటల్
వనితల్ చేయను నీటి బుద్ధి మది మా
వాసిన్ విసన్ నిల్పెన్.
భారతాంగన శీలసంపత్తిగరిమ
గణుతి గాంచి సుమి ఖండ ఖండములను
ప్రాణమర్పించి పోర స్వాతంత్ర్యము గను
సేకరించిన దక్షి మా స్త్రీజనంబు.

ఇరుగుపొరుగుల నిరసించి యింతవరకు
హిందుముస్లిము భేదమే రేఁగకుండ
ఒక్క తల్లి బిడ్డలై రెన్నన్న వారి
చీలదీసెను గద మన జిన్నభాయి.

పరదాస్యంబను పంక సంకలిత కూ
పారంబున్ మగ్గి దు
ర్భరమై దుఃఖము లందివార మిక నా
పాట్లుండ బోవంగదన్
పరమానందము నందుచుండ మన
పాపంబేమొ యీ లోపున్,
కరుణాలేశము లేని భ్రాతృరణలన్
గాంచంగ నయ్యెన్ కటా!
వినుడహింసాస్త్రోపాస్తి పెంపువలన
సేకరించిన స్వారాజ్య సిద్ధఫలము
కులమతద్వేషముల నెల్ల కూలఁద్రోసి
ఏకమత్యంబున భుజించు టర్హముగను.

ధర్మమే మన జీవితార్థము సుమీ యంచు
వివరించి చెప్పిన విమలభూమి
అజ్ఞానులకు కూడ మార్గముల్ గల్పించి
అమరత్వ మిచ్చిన యార్యభూమి
కామోపభోగముల్ కడముట్టఁ గూర్చియు
నీతికే ముడిపెట్టు నియమభూమి
సైతము ధర్మాలు పదనుగా నడిపేటి
మోక్షమార్గమటన్న ముక్తిభూమి
చతురపురుషార్థ సాధనా చతురులైన
పూతచరితుల గాంచిన పుణ్యభూమి
పరులు మెచ్చెడిభూమి నా భరతభూమి
వేయి కాలాలు స్వేచ్ఛమై వెలయుగాక.



# మన జాతీయ పతాక పుట్టుపూర్వోత్తరాలు



జాతీయ స్వాతంత్ర్యమునకు, జాతీయ గౌరవమునకు ముఖ్యచిహ్నము జండా.

మొదటి ప్రపంచయుద్ధపు ఫలితముగా, రక్తపాతములో, రష్యాలో ప్రజాస్వామ్యప్రభుత్వ మేర్పడినది. మన మిన్నటి లోకసంగ్రామము ముగిసిన తర్వాత విదేశపాలకులనుండి మన దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించినది.

ఈ స్వాతంత్ర్యోదయములో హిందూ-ముస్లిం కలహరూపముగా కొంత రక్తపాతపు ప్రసవబాధ కలిగినను మొత్తముమీద విదేశీయవాళము లేకుండనే మనకు స్వేచ్ఛ లభించినది. ఇది మహాత్ముడు నిర్మించిన అహింసాప్రణాళిక ఫలితము.

ఇప్పుడు రాజ్యాంగనిర్మాణము చేయు పరిషత్తువారు మన జాతీయపతాకనుగూడ స్థిరపరచినారు. మన దేశపు పూర్వచరిత్రలో విక్రమార్కుడు, చంద్రగుప్తుడు, అశోకుడు మున్నగు హిందూచక్రవర్తులు, ఆ పిమ్మట ముస్లిం సామ్రాజ్యముతో పోరిన పృథ్వీరాజు, రాణాప్రతాపుడు, శివాజీవంటి వీరనాయకులును కేసరివర్ణమునే వాడుచుండిరి. ఇది పసుపునుబోలి మంగళప్రదమని, కాషాయరూపమై త్యాగవైరాగ్యములకు సూచకమని భావమేర్పడినది.

ఈ ఇరువదియవ శతాబ్ది ఆరంభమునుండి బ్రిటిషు ఆధిపత్యమునుండి స్వాతంత్ర్యము పొందవలెనను భావమంకురించి అందులో పతాకప్రశంసయు కలిగెను. ఉత్తరభాగములో నారింజరంగు, మధ్య తెలుపు (అందులో 'వందేమాతరం' అను నాగరాక్షరాలు), అడుగున ఆకుపచ్చ-ఇట్లుగా ఒక త్రివర్ణపతాకమును యూరపులో ప్రవాసి భారతీయులు సృజించిరి; కాని, స్వదేశములో అప్పట్టి ప్రచారముకాలేదు. ౧౯౧౭ లో 'హోంరూలు' వారు యూనియను జాకు, ఎరుపు ఆకుపచ్చగీతలు, (సప్తర్షిసూచకముగా) ఏడు నక్షత్రాలు కలిపిన ఒక విచిత్ర పతాకను కల్పించిరి. కాని అదియు ప్రజాభిమానము పొందలేదు. ౧౯౨౧ సంవత్సరములో బెజవాడ సమావేశములో గాంధీమహాత్మునకు పైన తెలుపు, మధ్య ఆకుపచ్చ, అడుగున ఎరుపురంగుగల త్రివర్ణపతాకను (మధ్యను రాట్నపుచిహ్నముతో సహా) సూచించిరి. అందుపైన కొంత చర్చజరిగినది. తుదకు ౧౯౩౧ సంవత్సరములో పైన కేసరివర్ణము, మధ్య తెలుపు, అడుగున ఆకుపచ్చ రంగులు, మధ్యభాగమున రాట్నమును గల జాతీయ జండాను కాంగ్రెసువారు అంగీకరించిరి. అది అప్పటినుండి మొన్నటివరకును ప్రజాదరమునకు పాత్రమైనది.

స్వాతంత్ర్యభావోదయమునకు ఈ జండాయే ప్రతీకము. ఈ జండా రక్షణకే ౧౯౨౧-౨౨ లలో కాకినాడయందు సాంబమూర్తిగారి ద్వారాను, ౧౯౨౩ లో బజాజాగారి నాయకత్వమునను బ్రిటిషు వారిపైన సత్యాగ్రహము సాగినది. అహింసా యుద్ధములో ఈ జండా రక్షణ కెందరో త్యాగము చేసినారు. కనుక క్రొత్తరాజ్యాంగమును నిర్మించునప్పుడు ఈ జండానే ఆమోదించుట సహజము. రాట్నమునకు బదులు ధర్మచక్రమును నిర్ణయించు మార్పుమాత్రము ఈ రాజ్యాంగసమితివారు చేసినారు. దీనిని గాంధీమహాత్ముడును, కాంగ్రెసేతర పక్షాలవారుకూడ ఏకగ్రీవముగా ఆమోదించినారు. కాగా, ఇది ఒక్క కాంగ్రెసుపతాక కాక స్వతంత్రభారతపతాక అయినది.

ఇక, ఈ జండాలోని త్రివర్ణములు త్యాగము, సత్యస్ఫూర్తి, జీవశక్తి మున్నగు గుణములకును, హిందూ - ముస్లిం, తదితర సంఘాలకును సూచకములని వివరణ జరిగియున్నది. చక్రము రాట్నములో ముఖ్యాంగ మగుటేకాక కుటీర పరిశ్రమలకును, మోటార్లు, రైళ్లు, విమానాలు, ఇంజన్లు మున్నగు ఆధునిక యాంత్రిక పరిశ్రమలకును ఆవశ్యకము, ముఖ్యప్రతీకము.

మరియు ఈ చక్రము మన దేశపు చక్రవర్తులలో మిక్కిలి ధర్మపరుడు, ప్రజాహితైషి, అహింసాపరుడు నగు అశోకచక్రవర్తి తన అమూల్య సందేశప్రచారమునకై 'సారనాథు' వద్ద స్థాపించిన ౪౨ అడుగుల మహాస్తంభముపైన చెక్కించిన ధర్మచక్రమునకు నకలు. ఈ చక్రవర్తి యుద్ధములో జయమొందినను, అది హింసాకారి యను కారణమున మానుకొని ధర్మప్రచారముద్వారా భారతదేశపు చుట్టుపట్లను, అప్పటి నాగరిక లోకములో దాదాపు అంతటను ఆధ్యాత్మిక జయమొందిన లోకోత్తర చక్రవర్తి యని నేడున్నగు విశ్వవిఖ్యాతిగల విద్వాంసులచే కీర్తింపబడినాడు. కనుక ఈ ధర్మచక్రము మన ఉత్తమ సంస్కృతికిని చిహ్నము. హింసాపద్ధతిని గాక ప్రేమపద్ధతిని లోకశాంతియును, ప్రపంచసౌఖ్యమును లభించెనను విశ్వజనీనతకుగూడ ఇది సూచకము. ఈ చక్రపు మధ్యమందు సూర్యబింబమును, చక్రపు ౨౪ సంఖ్యల ఆకురూపముగా సూర్యకిరణ ప్రసారమును చిహ్నితములు. మన లోకమందలి చరాచర జీవములకు, శక్తి, మానవజాతి ఆరోగ్యవృద్ధికిగూడ సూర్యకిరణములే కారణములని పూర్వులును, ఇప్పటి వైజ్ఞానికులును అందరును స్థిరపరచినారు. అంతేకాక వైజ్ఞానికాభివృద్ధికిగూడ సూర్యతేజమే కారణమని విద్వాంసుల భావన. మరియు లోకపు సృష్టిస్థితిలయముల కును సూర్యుడే కారకుడుగదా. కనుక వాటి ప్రవర్తకులుగా బ్రహ్మవిష్ణు మహేశ్వరులను త్రిమూర్తులు సూర్యునిలో ఇమిడియున్నట్లు కూడ ఆస్తికులు అందురు. కనుకనే—

"నమః సవిత్రే జగదేకచక్షుషే
జగత్ప్రసూతి స్థితి నాశకారిణే,
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే."

అని మనవారు నేటికిని ప్రతిరోజును సూర్యధ్యానము చేసి, సూర్యోపాసన చేయుచున్నారు.

చక్రములోని ౨౪ కిరణములు ౨౪ తత్త్వములకు సంకేతమని యు, చక్రపు నీలవర్ణము విశ్వవిభూతికి సూచకమనియు విజ్ఞులు అందురు.

ఏతావతా, మన ఈ జాతీయపతాకలోని చక్రము చాల భావగర్భితమైనది. అది విశ్వచక్రపు వికాస పరిణామములకును, ప్రకృతిచక్రమునకును, కాలచక్రమునకును, ధర్మచక్రమునకును గూడ ప్రతీకము.

ఇప్పుడు ప్రపంచమందలి అన్ని దేశాల జండాల పైని మన భారతదేశపు ఈ జండాయే ఎక్కువ ఘనమై, భావోన్నతిసూచకమై "సత్యం, శివం, సుందరం" అను ఉత్తమాదర్శమును ప్రకటించుచున్నది.

కొమాండూరు శఠకోపాచార్యులు





# సంస్కృతభాష - దాని ప్రాముఖ్యం

*

— శ్రీ గరికిపాటి సత్యనారాయణ —

ప్రపంచంలో మనం రోజూ వార్తాపత్రికలవల్ల గాని, ఇతర సాధనాలవల్ల గాని వింటున్న హృదయవిదారకమైన సంఘటనలను ఒక్కమారు విస్ఫారితమనోనేత్రాలతో పర్యాలోకన చేస్తే, మానవత్వం అనేది వానిలో ఒకపాటైనా మిగిలినట్టు ఏమీ అగు కనిపించటంలేదు. కాకపోగా మానవునిలో పశుత్వం నానాటికీ వృద్ధిపొందుతోంది. పశుత్వం అంతర్లీనమైన చిహ్నాలు నాగరికత అనే పేరుతో ప్రపంచంలో చలామణిపోతున్నై. పూర్వం భారతదేశాన్ని ఒక మహా విజ్ఞాన కేంద్రంగా, సిరిసంపదలతో తులతూగిన ఒక మహాపుణ్యభూమిగా భావిస్తూ ఉండేది ప్రపంచం. కాని ఇప్పటి భారతదేశమో! మన పోమలిస్సును కనుక్కుంటే 'Ignorant, half-starved, uneducated, uncivilised' అని ఎన్నో ప్రతికూలవిశేషణాలు జతగొన్నట్టు గొప్ప వాక్యంలో వర్ణిస్తారు. ఈ అధఃపతనాన్నుంచి మానవుని రక్షించటానికి మార్గమే లేదా ?

మానవుడు తిరిగి నైతికంగా సుశిక్షితుడు కావాలి. దీనికి భాష ప్రాతిపదిక. భాష అంటే రెండక్షరాల్లో తేలిపోయే విషయం కాదు. భాషింపబడేదే భాష అంటారు కొంతమంది. కాని ఇది నిజం కాదని కాస్త ఆలోచిస్తే తెలుస్తుంది. ఎందుకంటే, "ఒరే, అబ్బాయ్, మంచినీళ్లు తీసుకురారా, దాహం వేస్తోంది" అనే వాక్యంకూడా భాషయితే ప్రపంచంలో భాష అనేదానికి అర్థమే లేదని నా అభిప్రాయం. ప్రపంచంలోని ఆయా జాతుల వివిధసంప్రదాయాలను, తాత్విక సాంఘిక రాజనీతి సిద్ధాంతాలను ప్రతిబింబించేదే నిజమైన భాషక్రిందికి లెక్కకి వస్తుంది. ఇలాంటి భాషలలో సంస్కృతభాష అగ్రగణ్యమని చెప్పవచ్చు. ఎందుకంటే ప్రపంచంలో అంతర్జాతీయ భాషగా పరిగణింపబడుతున్న ఇంగ్లీషుభాష కూడా స్వయంసంభవమైంది కాదు. అంటే దానికి ప్రత్యేకమైన సంప్రదాయాలూ, తాత్వికసిద్ధాంతాలూ లేవన్న మాట. అలౌకికమైన విషయాల్లో ముఖ్యంగా ఆ భాష గ్రీకు, రోమన్ సంప్రదాయాలను అనుసరించినట్లు కనిపిస్తుంది. అంటే అది తెలుగు, హిందీ మొదలైన వాటిలాగా సామాన్యమైన భాషే కాని స్వయంసంభవమైన, అంటే సహజమైన భాష కాదు. కాని ప్రపంచంలో దేనికీ లొంగక అప్రతిహతంగా నిలిచిందీ సంస్కృతభాషే. సంస్కృతభాషను గురించి Discovery of India లో శ్రీ జవహర్లాల్ నెహ్రూ గారు "పాణిని నిర్ణయించిన నిబంధనలను కొంచెమైనా దాటిపోకుండా కవితాకళను, భారతీయ విజ్ఞానాన్ని పోషించిందీ సంస్కృతభాషే" అన్నారు. సంస్కృత భాషారామాయణీ కటాక్షవీక్షణాలవల్లనే ఆంధ్ర భాషకన్ని వింతవింతసొబగులతో సర్వాంగసౌష్ఠవాన్ని పొందింది; రసికజనహృదయాభిరామమై వర్ధిల్లింది అని చెప్పొచ్చు. ఈ విషయం ఆంధ్రసాహిత్యలోకం ఏనాడయితే మరచిపోయిందో ఆనాడే అది సంస్కృతానికి మాతృద్రోహం చేసిందన్నమాట. అయితే ఈ మాట వినగానే 'క్విట్ ఇండియా' తీర్మానం అమల్లో పెట్టినట్లు, 'క్విట్ ఆంధ్రదేశ్' తీర్మానం అమల్లో పెట్టొచ్చునని అనిపిస్తోంది. కాని నేనుకూడా తెలుగు వాణ్ణే కాబట్టి తెలుగుకవనమన్నా, తెలుగు సంప్రదాయాలన్నా నాకూ కొంత అభిరుచి ఉన్నదనే అనుకుంటాను. కాని ఒకదాని వస్తుస్థితిని చెప్పాల్సి వచ్చినపుడు నిష్పక్షపాతంగా ఉండాలని నా ఉద్దేశ్యం. తెలుగులో ఉద్గ్రంథాలు తీసుకోండి. మహాభారతం, భాగవతం, రామాయణం, ప్రబోధచంద్రోదయం, హరివంశం, మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైనవాటిలో

ఏ పుస్తకం తీసుకున్నా సంస్కృతంలో మూలం తీసుకుని వ్రాయబడినవేగదా! సంస్కృతంలో నాటకకళ అభివృద్ధి పొందింది. ఆంగ్లవాఙ్మయంలో కూడా నాటకకళ బాగా వృద్ధిపొందింది. కాబట్టి తెలుగు పురోభివృద్ధి పొందాలన్నా, నాటకానికి సంస్కృతంతో సంబంధం వృద్ధిపొందాలిగాని తీసికట్టుగా ఉంచకూడదు. ఉదాహరణకు ఒక సంఘటనను తీసుకుందాం. మేనక విశ్వామిత్రుని మోహింపజెయ్యటానికి సర్వాంగసుందరంగా వసంతాగమపురస్సరంగా బయల్దేరుతుంది. కాని ముందు వచ్చేది వసంతాగమమే. ఈ వసంతాగమంలో అప్సరసహావభావాలూ, మనోద్రేకమూ మొదలైనవి అభివ్యక్తం కావాలి. ఈ అద్భుతమైన శిల్పాన్ని ఒట్టి తెలుగుమాటల్లో వర్ణించి రాస్తే ఆ సంఘటన ప్రాముఖ్యం పాఠకుల హృదయంలో నాటుకోవటం కష్టం. దాన్ని "మాకందతరు శాఖాకోకిలాలాప...అని" సుకుమారమైన సంస్కృత పదాలు ప్రయోగిస్తే ఎట్లా ఉంటుందో ఆలోచించండి. ఇవన్నీ ఆలోచించేగావును మన అభ్యుదయకాంక్షులు "ఈ శిల్పాలూ గొడవలూ మన కెందుకు" అని సంస్కృతంతోపాటు వీటికికూడా విడాకు లిచ్చినట్లున్నారు. అయితే ఇప్పటి అభ్యుదయకవిత్వం అనబడే ప్రజాకవిత్వాన్ని నే నెంతమాత్రమూ ద్వేషించేవాణ్ణి కాను. కవిత్వానికి రెండు మార్గాలు. ఒకటి దేశికవిత్వం; రెండోది మార్గకవిత్వం. దేశికవిత్వం తాత్కాలిక ప్రయోజనాన్ని సఫలీకృతం చెయ్యటంలో అందె వేసినచేయి. మార్గకవిత్వం జాతికి అపరిచ్ఛిన్నమైన, శాశ్వతమైన కల్యాణం కలిగిస్తుంది. కాబట్టి మార్గకవిత్వాన్ని సృష్టించేవాడు ఒక మహాపుణ్యాత్ముడై యుండాలి. లేకపోతే ఆ కవికి రససిద్ధి సిద్ధించదు.

ఇలాంటి మార్గకవిత్వాన్ని సృష్టించింది సంస్కృతభాషే. అలాంటి రససిద్ధులైన కవీశ్వరులు సంస్కృతభాషలో చాలామంది ఉన్నారు. వేదంలోనూ, ఉపనిషత్తులలోనూ ఆనంద సంధాయకమైన కవిత్వం ఉందని విజ్ఞులు చెప్తారు. కాని లౌకిక వాఙ్మయం మటుకు తక్కువ అదృష్టసంపన్నురాలా? విశ్వసాహిత్య ప్రపంచాధినేతయైన వాల్మీకి మహర్షి అమరవాణిచే పవిత్రీకృతయై, బాదరాయణుని వేదాంతవాక్సుధాధారలతో పక్వకోమలమనస్కమై, భాస, కాళిదాస, భవభూతి దిఙ్నాగాది మహాకవుల కావ్యప్రసూనాలతో సర్వాంగశోభితయై మధురాతిమధుర కాదా? "అయితే ఇంతకంటే ఇంగ్లీషులో ఎక్కువమంది కవులున్నా"రని సహేతుకంగా, సాకూతంగా నన్ను ఆక్షేపించవచ్చు. కాని నిర్గుణకవుల్ని లెక్కగడితే సంస్కృతంలో కవుల సంఖ్య ఇంగ్లీషు సామ్రాజ్యంలోని కవుల సంఖ్యకు ఏమాత్రం తీసిపోదు. కాని ఇలా తృప్తిపడటంవల్ల లాభం లేదు. ఆంగ్లసాహిత్యం ఎప్పటినుంచి వికసించిందో సరిగా అదే సమయానికి సంస్కృతభాషకు అధఃపతనం కలగటం, సమయాన్ని పొందివున్న మెకాలే లాంటి పండితులు సంస్కృతాన్ని మృతభాషగా పరిగణించటం జరిగినై. అటుతరువాత ఎవ్వరూ సంస్కృతం అభిరుచి కనబర్చక పోయారు. వివేకానందస్వామి ఆయన ధర్మమూ అంటూ సంస్కృతం నేర్చుకోమన్నాడుగాని ఆయన కార్యరంగంలోకి దిగుతాడని అనుకునేటప్పటికే నిర్యాణంగా భగవంతుడు ఆయన్ని ప్రపంచంనుంచి వేరుచేశాడు. తరువాత ఆయనంతగా ప్రపంచంవల్ల పరిగణింపబడుతూ ఉండే గాంధీమహాత్ముడు హైందవ హిందూస్థానీ ప్రచారంలో సగంలో సగమైనా చెయ్యకపోగా "వివేకానందస్వామి సంస్కృతం నేర్చుకోమన్నాడుగాని అది చాలా కష్టం" అని సెలవివ్వటం ఆయన చేస్తూవుంటున్న Himala-yan bluoders లో ఒకటి. రాజాదరణ లేదు. ప్రభుత్వాదరణ అంతకన్నా లేదు. ఇంక సంస్కృతంలో కవులు పైకి రావడానికి అవకాశ మేది? అందులో క్రొత్త బిడియపడే కవుల విషయంలో 'శీర్షమున సుభాషితం' కాక మరేముంది?

కాని ఆంగ్లవాఙ్మయం విషయం అల్లాకాదు. ఆంగ్లవాఙ్మయ వికాసానికి ప్రభుత్వం అమితంగా దోహదమిచ్చింది. ఒక చిన్న వ్యాసం కొత్త గ్రంథంగా రాస్తే దాన్ని కూడా భాషక్రిందికే లెక్కిస్తారు. అందులో వాళ్లల్లో కూడా ఇప్పుడు అభ్యుదయ రచయితలు తయారైనట్లున్నారు. ఇంకేముంది? రాజకీయ

నాయకులు కార్మికుల హక్కులకోసం ఇచ్చే ఉపన్యాసాలు కూడా భాషక్రిందికి లెక్కకి వస్తవేమో ?

ఆంగ్ల వాఙ్మయంలో ఎంతమంది రచయితలూ కవులూ ఉన్నా ఒక్క విషయం మటుకు కన్పికంగా ఒప్పుకుతీరాలి. ఆంగ్ల వాఙ్మయం యింతవరకూ ఇంకో షేక్స్పియరును సృష్టించలేదు. ఇది చెప్పంగానే కాళిదాసు ఉన్నాడుకదా అని మన రచయితలు నన్ను ఆక్షేపించవచ్చును. కాని షేక్స్పియరు ఎంత నాటకకర్తయైనా, లోకస్వరూపాన్ని ఎంత మనోజ్ఞంగా ఒప్పించినా, సాహిత్య విమర్శకులు ఈయనకు షేక్స్పియరుకు ఇచ్చిన ప్రాముఖ్యం ఇచ్చినట్టు కనబడదు. అంతేగాదు, పాశ్చాత్య సాహిత్య పరమావధికీ, సంస్కృత సాహిత్యోద్దేశానికిన్నీ హస్తిమశకాంతరం ఉంది. ధ్వన్యర్థ "కాంతాకాంత" అన్న మాటతో సంస్కృతాలంకారికుడు తృప్తి చెందడు. పైగా "పరతత్త్వసబ్రహ్మచారియైన రసానుభూతిని కలిగించటమే సాహిత్యపరమావధి" అని అంటాడు. ఇది క్రియారూపకంగా సాధించబడ్డదని భారత భాగవత రామాయణాదులు రుజువుచేస్తవి. కాబట్టి ఆంగ్ల వాఙ్మయంలో అపార పరిచయంవున్న వాళ్లుకూడా సంస్కృతాన్ని విమర్శించడానికైనా చదవాలని నా ఉద్దేశం.

ప్రపంచం ఇప్పుడు ధర్మానికి పరాఙ్ముఖంగా నడుస్తున్నది. బుద్ధికుశలులు, తార్కికులు ఏదో ఒక వాదం తీసుకొని దాన్నిబట్టి ఏదో ఒక సారాంశం తేల్చి అదే తప్ప ప్రపంచంలో అంతకంటే ధర్మం లేదనీ, అంతకు పూర్వమూ పరమూ ఉండే సనాతనమైన ధర్మాలను చారిత్రికాలని నిరూపిస్తూ ఉండటం సహజమైపోయింది. ధర్మస్వరూపం తెలియక ప్రతివారికీ సంస్కారాలు తక్కువైపోయినవి. ఇలాంటి ధార్మిక కల్లోలాలనుంచి హిందూ సంఘ మహోన్నతాన్ని నిస్సంక్షుభితం చెయ్యటానికి సంస్కృత భాషాధ్యయనం బహు సన్నిహితంగా దోహదమిస్తుంది.

ఇప్పుడు ప్రకృతిశాస్త్ర విజ్ఞానం కావాలని ఘోషిస్తున్నామా ! ప్రపంచంలో నాద్వారా విజ్ఞానం అంతా ప్రతిబింబితమౌతూందని అనుకునే ఆంగ్లభాషను చెంపకాయకొడ్తుంది సంస్కృతం. ఈ విజ్ఞానం చివరికి స్మృతులలోకి సైతం పాకి ప్రతిధర్మసూత్రానికీ ఆధారభూతం అయింది. భూగోళం అన్నమాటలోనే దాని స్వరూపస్వభావాలు Wise Greeks కు పూర్వం Wiser Hindus కు తెలుసునని చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. ప్రపంచ సృష్టిని గురించి పాశ్చాత్యులకూ భారతీయులకూ విభిన్న దృక్పథాలవల్ల చాలా తేడా ఉంది. పాశ్చాత్యులు సృష్టిని అయిదు వేలసంవత్సరాలకు ఒక్క లిప్తకూడా అవతలకి జరపరు. అయితే భారతీయులగణిత జ్యోతిష విజ్ఞానం సృష్టిజరిగి నూట తొంభై రెండు కోట్ల సంవత్సరాలయిందని రుజువుచేసింది. ఇది కవుల అతిశయోక్తి అనటం మనకు పరిపాటైపోయింది. కవికి అతిశయోక్తి ఉంటే ఉండొచ్చుగాని వైజ్ఞానికునికి అతిశయోక్తి ఉండదనుకుంటా. సర్ జేమ్స్ జీన్స్ తన Mysterious Universe లో ఇది ఒప్పుకున్నాడు. ఆయనకూడా ఏదో దస్యుడేనా ! భాస్కరాచార్యులు తన సిద్ధాంత మంజరిలో Law of Universal Gravitation ను ప్రతిపాదించినట్టు తెలుస్తున్నది. కాబట్టి సైన్సులో మంచి ప్రవేశం ఉన్న వాళ్లుకూడా ఆభాషలో ప్రతిపాదితమైన వైజ్ఞానిక సిద్ధాంతాలను విమర్శించడానికైనా సంస్కృతం చదవటం అవసరం.

సంస్కృతం చదివేవాళ్లు పచ్చి సనాతనులే కానక్కరలేదు. సనాతనధర్మాన్ని గేలిచేసే చార్వాకాన్ని సంస్కరించడానికైనా సంస్కృతం చదివితే బాగుంటుంది. మీరు నామాట విన్నా వినకపోయినా ఒక్కమాటమటుకు నిజం.

యావద్భారతవర్షం స్యాత్ యావద్వింధ్యహిమాచలౌ,
యావద్గంగా చ గోదా చ తావదేవ హి సంస్కృతం.

హిమాలయాలు పాకిస్తానంలో కలిసినా వింధ్య పర్వతాలైనా దక్కుతవేమోనని గాబోలు మధ్య వింధ్య పర్వతాలను శ్లోకకారుడు ఉదహరించి ఉంటాడు.



స్వాతంత్ర్యోత్సవ సందర్భమున విద్యుద్దీపములతో
ధగద్ధగాయమానముగా అలంకృతమైన బొంబయి
కార్పొరేషన్ భవనము.

# బ్రిటనులో ఆర్థిక విపత్తు

*

— శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ —

ఆధునిక యంత్రయుగమునకు, నాగరికతకు మూలకందమైనది ద్రవ్యసమస్య. యంత్రనిర్మాణములో వలెనే తదితర విషయములందు కూడ బ్రిటనే ప్రపంచమునకు దారి జూపినది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరమువరకు బ్రిటిష్ఆర్థిక చరిత్రయే ప్రపంచఆర్థికచరిత్రలో అతిముఖ్యఘట్టము. వర్తకవాణిజ్యములలో సర్వవిషయములలోను ప్రపంచమునకంతకూ బ్రిటన్ నాయకమణిగా వ్యవహరించినది. అతిముఖ్యమైన ద్రవ్యసమస్యలో బ్రిటనుకే నాయకత్వము లభించినది కాని ఈ ప్రపంచ నాయకత్వమును నిలబెట్టుకొనుటకు కావలసిన ఆర్థిక సౌష్ఠవము బ్రిటనుకు అమరలేదు. ఆ చిన్ని దీవులలో నివసించుచున్న దట్టమైన జనాభా తన ఆహారమునకు, ముడిపదార్థములకూ కూడ దిగుమతులపై ఆధారపడవలసి వచ్చుటయేగాక, అమెరికావంటి సహజసంపత్తి గల దేశములతో పోటీచేయుగల సహజసంపత్తి బ్రిటనుకు లేకపోవుటవలన బ్రిటన్ నాయకత్వము కొంచెము వెనుకపడినది. అయినను బ్రిటనుకు పెద్దసామ్రాజ్యం వుండుటవలన ఈ పోటీలో బ్రిటన్ త్వరలో ఓడిపోలేదు; పైగా తన స్థానమును స్థిరపరచుకొనుటకు బ్రిటన్ గట్టిప్రయత్నము చేసినది. తన సామ్రాజ్యదేశములతోను, తదితరసన్నిహిత దేశములతోను వర్తకవాణిజ్యములు వీలైనన్ని విధముల వృద్ధిపరచుకుని ప్రపంచమంతటిపైగాక, ఒక కొంత ప్రాంతముపై తన ప్రాబల్యమును స్థిరపరచుకొనజూచినది. అంతర్జాతీయవర్తకవ్యాపారములలో ముఖ్యమైనది ఒక దేశపు నాణెములను ఇంకొకదేశపు నాణెములలోనికి మార్చుట. ఈ మారకమునకు బ్రిటన్ ఆధిపత్యమువలన మొదట బ్రిటన్ నాణెమైన స్టర్లింగు, లేక పౌను చాల వీలుగా నుండెడిది. ఈ నాణెము పేరునుబట్టి తరువాత బ్రిటన్ స్థిరపడిన ప్రాంతము లన్నిటిని కలిపి స్టర్లింగుప్రాంతమని పిలువసాగినారు. ఈ స్టర్లింగుప్రాంతములోని దేశము లొకదానికొకటి డబ్బు ఇయ్యవలసివచ్చినప్పుడు స్టర్లింగురూపములో చెల్లించుచుండును. స్టర్లింగుప్రాంతములలోని దేశము స్టర్లింగుప్రాంతములో లేని దేశమునకు డబ్బు పంపవలసివచ్చినప్పుడు, తన ధనమును ముందు స్టర్లింగులోనికి మార్చి, ఆ స్టర్లింగును రెండవ దేశముయొక్క నాణెములలోనికి మార్చుచుండును. ఈ విధమైన మారకము సులువుగా జరుగుటకు వలసినంత విదేశనాణెములు లండన్‌లో బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండు నిలువయుంచెడిది. తమతమ దేశములలో విదేశనాణెములు ఎక్కువగా నిలువయుంచుకొనలేని దేశములకు ఇటువంటి ఏర్పాట్లు మిక్కిలి సౌకర్యము కలుగజేయునుకదా!

మొత్తముమీద ప్రపంచము ద్రవ్యవిషయంలో రెండు విభాగములైనది: స్టర్లింగుప్రాంతము, తదితర ప్రాంతము. ఈ ఇతరప్రాంతములో అమెరికా అతి ప్రముఖమైనది. అందువలన ఒక్కొక్కప్పుడు దీనిని డాలరుప్రాంతమని కూడ వ్యవహరింతురు.

యుద్ధమువలన ప్రథమముగా బాధకొందినది స్టర్లింగుప్రాంతము. అమెరికా యుద్ధములో చేరియుండకపోవుటవలనను, అమెరికా సహజసంపత్తి, పరిశ్రమాభివృద్ధి అనంతమైయుండుటవలనను, యుద్ధమునకు వలసిన సామగ్రిని అమెరికానుండి (డాలరుప్రాంతమునుండి) కొనవలసివచ్చినది. కాని డాలరుప్రాంతమునకు ఎగుమతిచేయుబడు సరకుల ఉత్పత్తి మాని చేయుటవలనగాని, లేక వానిని యుద్ధావసరములకు ఉపయోగించుటవలనగాని వాని ఎగుమతి తగ్గిపోయినది. అందువలన బ్రిటన్‌లోని డాలరునిలువ త్వరత్వరగా తగ్గిపోజొచ్చినది. అప్పుడు స్టర్లింగుప్రాంతములోని దేశములన్నియు యోజించి, తమతమ దేశములలో వ్యక్తిగతముగాను, ప్రభుత్వపరముగాను వున్న డాలర్లనన్నింటిని సేకరించి, వానిని ఒకనిధిగా ఏర్ప

రచి, బ్యాంక్ ఆఫ్ యింగ్లండుద్వారా యుద్ధావసరములకు మాత్రమే పొదుపుగా వాడుటకు నిశ్చయించినవి. ఈ ఏర్పాటునే 'డాలరునిధి' అంటారు. ఈ ఏర్పాటుప్రకారం ఆయా దేశములలోని డాలరు నిలువలన్నియు సమీకరింపబడి, యుద్ధావసరములకు గరిష్ఠ ప్రయోజనము సాధించునట్లు ఆయా దేశములచే ఉపయోగింపబడినవి. కాని ఆయా దేశములకు డాలరు ప్రాంతమునుండి కావలసిన ఇతరపదార్థములు కొనుటకు వీలుపడలేదు. అందువలన స్టర్లింగుప్రాంతమునందలి దేశములన్నిటిలోను, డాలర్ ప్రాంతపు సరకులు కరవైపోయి, ప్రజలకు వాటిపై మోజు హెచ్చినది. యుద్ధానంతరమైనను ఆ వస్తువులు డాలర్ ప్రాంతమునుండి కొనకతప్పదనియు, అందుకు వలసిన డాలర్ల సరఫరా చేయు బాధ్యత తనదే ననియు బ్రిటన్ గుర్తించినది. ఈ సరకు విలాసవస్తువులు, తదితర కొనుగోలుదారుల వస్తువులుగాక యుద్ధానంతర ఆర్థిక పునర్నిర్మాణమునకు అత్యవసరమగు యంత్రసామగ్రివంటి సరుకగుటవలన కొనుటకూడ లాభదాయకమేగాక వాంఛనీయముకూడనై నది. ఇందుకొరకై తగినన్ని డాలర్లు సంపాదించుటకొరకు బ్రిటన్ అమెరికా, కెనడాలవద్ద డాలర్ అప్పులు పుచ్చుకొనెను. అమెరికానుండి ౩౭౫ కోట్ల డాలర్లు, కెనడానుండి ౧౨౫ కోట్ల డాలర్లు యీ విధముగా అప్పు పుచ్చుకొనబడెను. ఈ మొత్తములను అత్యవసరమైన ఆహారపదార్థములు, ఆర్థిక పునర్నిర్మాణమునకు పనికివచ్చు యంత్రములు కొనుటకు ఉపయోగించుచు, స్టర్లింగు-డాలరు స్వేచ్ఛాపూరిత మారకము తిరిగి నెలకొల్పవలెనని ఉద్దేశింపబడినది. ఆంగ్లో-అమెరికన్ ఋణపు ఒడంబడికలోని రెండు ముఖ్యమైన నిబంధనలను గురించి మనం కొన్ని వివరములు గమనించవలెను. ఈ ఒడంబడికలోని ౮ వ నిబంధనప్రకారం ౧౯౪౭ జూలై ౧౫ వ తేదీనుండి స్టర్లింగువంతను నిర్నిబంధముగా డాలర్లలోనికి మార్చుకొనుటకు ఏదేశమునకైనను వీలుకలుగజేయుటకు బ్రిటన్ అంగీకరించినది. ౯ వ నిబంధనప్రకారం బ్రిటన్, వ్యాపార వాణిజ్య విషయములలో అమెరికాపట్ల వివేచన, వ్యత్యాసములతో ప్రవర్తింపకూడదు. ధరలు, తదితర షరతులు ఒకటిగానున్నప్పుడు బ్రిటన్ అమెరికానుండి దిగుమతులు తగ్గించుకొనుటకు, ఆ వస్తువులను యితర దేశములనుండి తెప్పించుకొనకూడదు. ఈ నిబంధనను సరిగా అమలుజరుపుటకు బ్రిటన్, అమెరికాలో కొన్ని ఆయావస్తువుల నిష్పత్తినిబట్టియే ఇతర దేశములలో ఆ వస్తువులు కొనవలెనని కూడ స్పష్టము చేయబడినది. అందువలన సామ్రాజ్యములోని యితరదేశములలో ఆ వస్తువులు దొరకుచున్నను, అమెరికానుండికూడ ఆ వస్తువులు కొనకతప్పదు.

తమ దేశములోని పరిశ్రమలను పునరుద్ధరణచేసి తద్వారా ఉత్పత్తిని అధికముచేసి స్వదేశమునకు కావలసిన వస్తువులను తయారుచేసికొనుచు, ఆ దేశములకు ఎగుమతులు చేయుచు వలసిన ఆహారపదార్థములను దిగుమతిచేసికొనవచ్చు ననే ధైర్యముతో బ్రిటిష్ప్రభుత్వము ఈ కఠిననిబంధనలకు అంగీకరించినది. యుద్ధానంతరమునుండి ఈనాటివరకుకూడ బ్రిటిష్ నాయకులు బోధించుచున్నది అధికోత్పత్తి, అధిక ఎగుమతులు కావలయు ననియే.

బ్రిటన్ యుద్ధకాలములో వివిధదేశములనుండి కొన్న సామగ్రికి అప్పటికప్పుడు డబ్బు చెల్లించక అరువుకే కొనెను. అందువలన బ్రిటన్ ఆయా దేశములకు అప్పుపడియున్నది. అవియే ఆయా దేశముల స్టర్లింగునిలువలు. ఈ నిలువల మొత్తం ౩౫౦ కోట్లపౌనుల పైగా వుండును. కొంతవరకు వాడివేయబడిన తరువాత యిప్పుడు ఈ నిలువలమొత్తములు వివిధదేశములలోను ఈ విధముగా నున్నవి: భారతదేశము ౨౦ కోట్ల స్టర్లింగు; ఈజిప్టు ౪౦ కోట్లు; నార్వే ౪ కోట్లు; బ్రెజిల్ ౬౨ కోట్లు; ఉరుగ్వే ౨ కోట్లు. ఆంగ్లో-అమెరికన్ ఋణపు ఒడంబడికలోని ౮ వ నిబంధనప్రకారం ప్రత్యేకపుఒడంబడికలు ఈలోపున ఆదేశములతో ఏర్పరచుకొనకపోతే, ౧౯౪౭ జూలై ౧౫ వ తేదీన ఈనిలువల నన్నిటిని బ్రిటన్ డాలర్లలోనికి మార్చుటకు సంసిద్ధమై యుండవలెను. అందుకు తగిన డాలరునిలువలు బ్రిటన్వద్ద లేవు. అందువలన ఆయా దేశములతో ప్రత్యేకముగా ఒడంబడికలు చేసుకుని, కొంతమొత్తము మాత్రమే డాలర్లలోనికి మార్చుటకు వీలైన విధిగాను, మిగిలిన మొత్తము స్వల్పమొత్తములలో దీర్ఘకాలములో తీర్చుకొను మొత్తముగాను విభజించి, ఈ నిలువలవలన ఏవిధ ప్రమాదము సంభవించకుండునట్లు తగు జాగ్రత్త వహించినది.

యుద్ధకాలపు అసాధారణ పరిస్థితులలో ఏర్పడిన స్టర్లింగునిలువలనుగురించి జాగ్రత్తపడుటయేగాక, దైనందినవర్తకవాణిజ్యములవల్ల వివిధదేశములకు లభించు స్టర్లింగును డాలరులోనికి మార్చుమని వత్తిడి కలుగకుండా చేయుటకుకూడ బ్రిటన్, ప్రయత్నించినది. ఇందుకొరకై ప్రత్యేకవిధానముకూడ ఏర్పరుపబడి

నది. దీనికి "స్టర్లింగు బలాయింపునిధాన"మని పేరు. అనేక దేశములతో బ్రిటన్ విడివిడిగా ద్రవ్యమారకము గురించి ఒడంబడికలు చేసుకున్నది. ఈ ఒడంబడికల ప్రకారం ఆ దేశములు యితర దేశములనుండి వర్తకవాణిజ్యములవలన రావలసిన ధనమును స్టర్లింగురూపములో పుచ్చుకొనుటకు అంగీకరించినవి. దీనివలన అనేక దేశములు ఒకదానికొకటి డబ్బుయిచ్చి పుచ్చుకొనవలసివచ్చినప్పుడు బంగారముగాని, డాలర్లుగాని యివ్వనవసరములేకుండ స్టర్లింగు చెల్లించి బాకీ తీర్చివేయుటకు వీలైనది. డాలర్లుగాని, స్టర్లింగుగాని, బంగారముగాని అంతర్జాతీయముగా యిచ్చి, పుచ్చుకొనుటకే కావలయును. ఉభయపక్షములు స్టర్లింగునే యిచ్చిపుచ్చుకొనుటకు అంగీకరించినవిగాబట్టి స్టర్లింగును డాలరులలోనికి మార్చవలెనను ఒత్తిడి రాదు. ఈ విధమైన ఒడంబడికలు స్పెయిన్, స్విట్జర్లాండు, ఇటలీ, పోలెండు, ఫ్రాన్సు, నార్వే, స్వీడన్, అర్జెంటినా, బ్రెజిల్, ఉరుగ్వే మొదలగు దేశములతో చేసికొనబడినవి. బ్రిటిష్ సామ్రాజ్యములోని దేశములగు కెనడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, భారతదేశంవంటి దేశములు బ్రిటనుకు సహాయపడుటకు ఎప్పుడూ సిద్ధమే. కాబట్టి ౧౯౪౭ జూలై ౧౫ వ తేదీన స్టర్లింగును నిర్నిబంధముగా డాలర్లలోనికి మార్చవలసిన గడువు సమీపించునప్పటికి, ఒక్కసారిగా ఎక్కువ మొత్తము స్టర్లింగును డాలర్లలోనికి మార్చుమని ఒత్తిడి చేయకుండా బ్రిటన్ జాగ్రత్తపడినది. ఈ రంగములో పరిస్థితి ఈవిధముగా చక్కబరచుకొనుచుండగానే, ఇంకొక రంగములో పరిస్థితులు విషమించినవి. బ్రిటన్ అమెరికా కెనడాలవద్ద అప్పుపుచ్చుకున్నది స్టర్లింగుమారకమును బలపరచుటకే గాక, దేశములో, ఆర్థిక పునర్నిర్మాణ జరుగుటకు అవసరమగు యంత్రసామగ్రిని దిగుమతిచేసుకొని తద్వారా అధికోత్పత్తి, ఉత్పాదము చేయుటకొరకుకూడ ననియైన చెప్పబడినది. కాని ఆశించినవిధముగా బ్రిటనులో అధికోత్పత్తి జరుగలేదు. దీనికి ముఖ్యకారణము బొగ్గుకరువు. గత సంవత్సరము చాలరోజులు అతిశీతలవాయువులు వీచుటవలన బ్రిటన్ బొగ్గు ఉత్పత్తిపని నిలిచిపోయి, దానితోపాటు అనేక పరిశ్రమలు కూడ నిలిపివేయవలసివచ్చినది. ఆ బొగ్గుకరవునుండి బ్రిటన్ యింకనూ తేరుకొనలేదు. దీనితోపాటు పరిశ్రమలకు, వ్యవసాయమునకు కలయు యంత్రసామగ్రి సరిగా లభించలేదు. బ్రిటన్ ఎగుమతులలో చాలభాగము స్టర్లింగు ప్రాంతమునకే పోవుచుండుటవలన డాలరు నిలువలు వృద్ధిచేయుటకు ఈ ఎగుమతులు ఏమాత్రము సహాయపడలేదు. ఎగుమతుల పరిస్థితి ఇంత నిరాశాజనకముగా నుండినప్పుడే, దిగుమతుల పరిస్థితి ఆందోళనకరముగా పరిణమించినది. బ్రిటన్ డాలరు ప్రాంతములనుండి చేయు దిగుమతులన్నియు అత్యవసర పదార్థములే. ముఖ్యముగా ఆహారపదార్థములు, యంత్రసామగ్రి. భారతదేశములోకూడ ఆహారధాన్యముల కొరత ఏర్పడుటవలన, భారతదేశము ఆహారధాన్యములు అమెరికానుండి దిగుమతి చేసికొనుటకు కావలసిన డాలర్లను సరఫరా చేయు బాధ్యతకూడ బ్రిటన్‌పైననే పడినది. దీనికి తోడుగా అమెరికాలో యుద్ధానంతరము ధరలు పెరుగుట మొదలిడినవి. ఆంగ్లో - అమెరికన్, ఋణపు ఒడంబడిక కుదిరినప్పటినుండి బ్రిటన్ ఆ అప్పును ఉపయోగింప మొదలిడునరకు అమెరికాలో ధరలు నూటికి ౩౦ వంతులు పెరిగెను. ఆ అప్పుమొత్తమును వాడుట మొదలిడిన తరువాత నూటికి ౨౦ వంతులు ధరలు పెరిగెను. ముఖ్యముగా ఆహారపదార్థముల ధరలు నూటికి ౧౪ నుండి ౨౪ వంతులవరకూ పెరిగినవి. ఈ విధముగా అమెరికాలో ధరలు పెరిగిపోవుటవలన బ్రిటనుకు ఆ అప్పువలన రాదగినన్ని వస్తువులు రాలేదు. ౧౦౦ డాలర్లకు కొనవచ్చునని అంచనా వేసిన వస్తువులు ౧౫౦ డాలర్లకు కొనవలసివచ్చినది. కాబట్టి ఆ ఋణపు విలువ మూడింట రెండుపాళ్ళకు తగ్గిపోయి బ్రిటనుకు అధికముగా నష్టదాయకమైనది. కాని ఆ వస్తువులు అత్యవసరమైన వగుటవలన అధికధరలైననూ కొనక తప్పినది కాదు. ఈ విధముగా ఉత్పత్తి, ఎగుమతులు ఒకవంక తగ్గిపోతూ ధరలు, దిగుమతులు వేరొకవంక పెరిగిపోతూవుండుటవలన వ్యాపారంలో చాలఎక్కువ కొరత ఏర్పడి బ్రిటన్ ఋణమును త్వరత్వరగా వాడివేయవలసివచ్చినది. ఈ వ్యాపారపు కొరతనుగురించి కొన్ని విషయములు పరిశీలింతము. ౧౯౪౭ వ సం. మొదట్లో సంవత్సరపు వర్తకము అంచనా వేయబడినప్పుడు ఎగుమతులు ౧౨౦ కోట్లపౌను లుండుననియు, దిగుమతులు ౧౪౫ కోట్ల పౌను లుండుననియు, లెక్క వేయబడినది. కాబట్టి ఈ అంచనాప్రకారము వ్యాపారములో కొరత సంవత్సరమునకు ౨౫ కోట్ల పౌనులకు మైనదే. కాని తరువాత ఈ అంచనాలు పునరాలోచింపబడి మార్చబడినవి. ఈ క్రొత్త అంచనాలప్రకారం ఎగుమతులు ౧౬౦ కోట్ల పౌనులు, దిగుమతులు ౧౩౦ కోట్ల పౌనులు వుండి, వ్యాపారపు కొరత ౪౦ కోట్ల పౌనులు వుండునని భావింపబడ

సది. ఆ అంచనాప్రకారం త్రైమాసికకాలమునకు వ్యాపారపులోటు ౧౦ కోట్లపౌనులు మాత్రమే వుండును. కాని వాస్తవముగా జరిగిన ఎగుమతి, దిగుమతులవలన గలిగిన కొరత యిందుకు భిన్నముగా నున్నది. ఈ క్రిందిపట్టిక చూడుడు.

| | | |
|---|---|---|
| తృతీయ పాదము | ౧౯౪౭ | ౮.౪ కోట్లు |
| చతుర్థ ,, | ౧౯౪౭ | ౬.౯ |
| ప్రథమ ,, | ౧౯౪౮ | ౯.౭ |
| ద్వితీయ ,, | ౧౯౪౮ | ౧౮.౧ |

ఈ పట్టికప్రకారం ౧౯౪౮ వ సం. రెండవ పాదకాలములో అంచనాకన్న ౮.౧ కోట్ల పౌనులు వ్యాపారపుకొరత ఎక్కువ వచ్చినది. దీనికి కారణములు ఎగుమతులు ౨.౭ కోట్ల పౌనులు తగ్గిపోవుట; దిగుమతులు ౩.౪ కోట్ల పౌనులు పెరుగుట. వ్యాపారమువలన గలిగిన ఈ లోటును బ్రిటన్ అమెరికన్ ఋణములోనుండి కొంత మొత్తమును వాడుకొనుటకు పుచ్చుకొని భర్తీచేసినది. ఇదేవిధముగా స్టర్లింగు ప్రాంతములోని యితర దేశముల వ్యాపారములవలన గలిగిన కొరతను భర్తీచేయవలసివచ్చినది. ఇందువలన అమెరికన్ ఋణమునుండి బ్రిటన్ ఎక్కువ మొత్తములను వాడుట మొదలుపెట్టెను. ౧౯౪౮ వ సం. ప్రథమపాదములో అమెరికన్ అప్పునుండి ౫౦ కోట్ల డాలర్లు, ద్వితీయ పాదములో ౬౫ కోట్లు వాడబడెను. ఆగస్టు నెల మొదటి మూడు వారములలోనే ౩౫ కోట్ల డాలర్లు వాడబడెను. ఈ విధముగా డాలరువాడకం పెరిగిపోవుటకు చాలకారణము లున్నవి. కెనడానుండి పుచ్చుకున్న అప్పును వాడటం మానివేసి కెనడాలో కొన్న వస్తువులకుకూడ అమెరికన్ ఋణములోని డాలర్లు యివ్వబడినవి. ఇది మొదటి కారణం. స్టర్లింగును నిర్నిబంధముగా డాలరులోనికి మార్చవలె ననునది రెండవ కారణం. ఈ నిబంధన వలన బ్రిటన్ ఏదేశమునకైనను డాలర్లు యివ్వవలసి వచ్చుటచే, ఆయాదేశములు తమతమ స్టర్లింగునంతను తొందరతొందరగా డాలర్లలోనికి మార్చుట మొదలు పెట్టినవి. జూలై ౧౫ వ తేదీ తరువాత నిర్నిబంధ మారకపు విధానము అమలులోనికి వచ్చిన తరువాత ఆ ఒత్తిడికి బ్రిటన్ తాళలేదని చాలమంది భయపడిపోయి, నిర్నిబంధమారకపు విధానము ననుసరించుటకు తగినంత డాలరు నిలువ బ్రిటన్ వద్ద లేదనీ, అందువలన త్వరలో బ్రిటన్ స్టర్లింగువిలువ పడిపోగలదనీ తమ స్టర్లింగునంతను వెంటనే డాలర్లలోనికి మార్చినారు. కాని ఈ విషయమై బ్రిటన్ ఎన్నడూ భయపడలేదు. స్టర్లింగును మరింత బలవత్తరం చేయుటకు బంగారపు నిలువలు పెంచుచూ, డాలరు నిలువలను ఏమంత లక్ష్యపెట్టలేదు బ్రిటిష్ ప్రభుత్వం. తాము ముందే చేసిన ఏర్పాట్ల ఫలితముగా స్టర్లింగుపై ఒత్తిడి రాదనే బ్రిటిష్ ప్రభుత్వం ఆశించెను. కాని స్టర్లింగులో విదేశములకు ఎక్కువ విశ్వాసం లేకపోవుటవలన బ్రిటన్ ఆశలు భగ్నమైపోయినవి. దీనికి తోడు బ్రిటిష్ ఆర్థికవిపత్తునుగూర్చి ఆగస్టు ౭ వ తేదీన పార్లమెంటులో జరిగిన చర్చలవలననూ, అమెరికన్ వార్తాపత్రికలు చేసిన విమర్శలవలననూ స్టర్లింగులో నమ్మకం పూర్తిగా నశించిపోయినది. అందువలన స్టర్లింగును డాలరులోనికి విరివిగా మార్చివేసినారు. ఆగస్టు ౧౧ మొదలు ౧౫ వ తేదీవరకు ౫ రోజులలో బ్రిటన్ ౧౮.౭ కోట్ల డాలర్లు వాడినది. ఆగస్టు ౧౬, ౧౯ వ తేదీలలో ౭.౭ కోట్ల డాలర్లు వాడబడెను. ఈ డాలరువాడకం బ్రిటన్ వ్యాపారపు కొరతను భర్తీచేయుటకుగాక, వివిధదేశముల స్టర్లింగును డాలర్లలోనికి మార్చుటకు జరిగినది. తనలో విశ్వాసము పోయిన విదేశములకు ఏదేశమైనను ఎంతకాలం సహాయపడగలదు? తానై డాలరు సంపాదించుకొనలేని ఇతరదేశముల బరువును వహిస్తూ తన ఆర్థికవ్యవస్థను బ్రిటన్ ఎంతకాలం నాశనంచేసికొనగలదు? కాబట్టి ఆగస్టు ౨౨ వ తేదీన స్టర్లింగు—డాలరు మారకం నిలుపుదలచేస్తూ బ్రిటిష్ప్రభుత్వం ఉత్తరువుచేసింది. ఈ నిలుపుదల స్టర్లింగుప్రాంతములో లేని దేశముల స్టర్లింగుమారకమునకు మాత్రమే వర్తించును. స్టర్లింగుప్రాంతములో వున్న దేశముల స్టర్లింగు ఇదివరకువలెనే డాలర్లలోనికి మార్చబడును. పరిస్థితులను ఎప్పటికప్పుడు స్టర్లింగుప్రాంతములోని అన్నిదేశములకు తెలియజేసి, ఏదేశమునకైనను అత్యవసరమైన సరాసరి కొరకు కావలసిన డాలర్లు సరఫరాచేయబడునని బ్రిటన్ చెప్పెను. కాని పరిస్థితులన్నియు తెలిసిన ఆదేశములు మర్యాదస్థులవలె, తమ డాలరు దిగుమతులు సంపూర్ణముగా తగ్గించుకొనుటకు ప్రయత్నములు చేయుచున్నవి.

స్టర్లింగు - డాలరు మారకం నిలుపుదల ఈ విధముగా జరిగినది. బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండు ఒక శాశ్వత ఉత్తర్వుద్వారా అమెరికాలో అమ్మజూపిన స్టర్లింగునంతను ౧ స్టర్లింగు = ౪.౦౨౮౫ డాలర్లచొప్పున కొనివేసి, బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండు ఖాతాను జమ చేయుటకు అమెరికన్ ఫెడరల్ రిజర్వుబ్యాం

కును అధికారం యిచ్చెను. ఆ ఉత్తరువును ఉపసంహరించుకొన్నచో అమెరికాలో స్టర్లింగు డాలర్లలోనికి మార్చుటకు వీలులేదు. పైఉత్తరువుప్రకారం ఏదేశమైననూ స్టర్లింగును డాలర్లలోనికి మార్చవచ్చును. ఈ సహాయము బ్రిటన్ విధాయనిగాక, మర్యాదయనిమాత్రమే చేయుచుండెను. అందువలన ఆ సహాయము మానివేసిన ఎవ్వరునూ ఫిర్యాదుచేయుటకు వీలులేదు.

ఈవిధముగా బ్రిటన్ స్టర్లింగు-డాలరు మారకం నిలుపుదలచేయుటతో వర్తక వాణిజ్యములకు ప్రపంచము రెండుముక్కలుగా కోసివేయబడినది. ప్రపంచమునకు కావలసిన వస్తువులు ఎక్కువగా డాలరు ప్రాంతములో ఉత్పత్తియగుచున్నవి. ఆ పదార్థములు కావలసినవారు అధికభాగము స్టర్లింగు ప్రాంతములో నున్నారు. స్టర్లింగు-డాలరు మారకమనే వంతెనద్వారా ఈ రెండుపక్షముల సమన్వయము జరిగినది. కాని ఆ వంతెన చాల దుర్బలమైపోవుటవలన దానిని తెగగొట్టివేసినారు. రెండు ప్రాంతములు వేరుపడిపోయినవి. ఇకముందు ఏదేశమైననూ డాలరు ప్రాంతమునకు ఎంతఖరీదు వస్తువులు ఎగుమతిచేయునో అంత ఖరీదు వస్తువులు మాత్రమే దిగుమతి చేసికొనవచ్చును. కాని డాలరుప్రాంతమునకు ఎగుమతిచేయగల వస్తువులు స్టర్లింగుప్రాంతములో చాల తక్కువగా ఉత్పత్తియగును. కాబట్టి డాలరుప్రాంతమునుండి దిగుమతులుకూడ ఆ తక్కువ మొత్తమునకే తగ్గించుకొనవలసియున్నది. ఇట్టి పరిస్థితులలో స్టర్లింగుప్రాంతములోని పారిశ్రామిక దేశములకు, ముఖ్యముగా బ్రిటనుకు మంచి అవకాశము లభించినది. ఇదివరకు డాలరు ప్రాంతమునుండి ఏఏదేశములు ఏయేవస్తువులు కొనుచూ వుండెనో, ఇప్పుడు మానివేసినవో, ఆ పదార్థముల ఉత్పత్తి ప్రారంభించిన దేశములకు మిక్కిలి లాభము కలుగును. స్టర్లింగుప్రాంతములో పరిశ్రమాభివృద్ధికి యిందువలన మంచి అవకాశము లభించినది. కాని పరిశ్రమలకు కావలసిన యంత్రసామగ్రి అమెరికానుండిగాని, బ్రిటన్ నుండిగాని రావలెను. అందువలన స్టర్లింగుప్రాంతములో యంత్రసాధనముల ఉత్పత్తి హెచ్చుచేయుచూ, అమెరికానుండి తగు యంత్రసామగ్రి దిగుమతి చేసికొనుటకు ప్రయత్నింపవలెను. ముఖ్యముగా బ్రిటన్ దేశములో ఉత్పత్తి ఎక్కువచేసి, తద్వారా ఎగుమతులను వృద్ధిపరచుకొని, స్టర్లింగును బలపరచుటకు స్టర్లింగు-డాలరుమారకం నిలుపుదల చాల దోహదం చేయగలదు.

స్టర్లింగు - డాలరు మారకం నిలుపుదలవలన స్టర్లింగు దుర్బలమైపోగలదని చాలమంది భయపడినారు. కాని అది అనవసరభయము. ఈనాడు స్టర్లింగు చాల బలవంతమైన నాణెముగా వున్నది. బ్రిటనుకు వున్న స్టర్లింగు అప్పులు దీర్ఘకాలిక అప్పులుగా మార్చివేయబడినవి. స్వల్పకాలపు అప్పులలో చాలభాగము ఖంగారుగా డాలర్లలోనికి మార్చబడినవి. కాబట్టి ఏదేశమునకుకూడ యిప్పుడు చేతినిండా స్టర్లింగు లేదు. కాని వారి వాణిజ్యము స్టర్లింగుప్రాంతములోనే, స్టర్లింగు ద్వారానే జరుగవలెను, కాబట్టి రద్దికాలములో స్టర్లింగుకు ఎక్కువ అవసరం కలిగి, యిదివరకు ఖంగారుగా స్టర్లింగును డాలర్లలోనికి మార్చుకున్నవారు తిరిగి స్టర్లింగులోనికి మార్చుకోగలరు. ఇందువలన బ్రిటన్ ఎగుమతులు వృద్ధియగుటయేగాక, డాలరు నిలువలుకూడ బలపడి, తిరిగి నిర్నిబంధమారకపు విధానమును అనుసరించుటకు దోహదము చేయగలదు. బ్రిటనులో వస్తువుల ఉత్పత్తి తగినంత ఎక్కువగా జరిగినచో, త్వరలో స్టర్లింగుకరువుకూడ రాగలదు.

స్టర్లింగు-డాలరుమారకం నిలుపుదలవలన ఒక దుష్ఫలితం కలిగింది. ఇంతవరకూ అన్నివిదేశములు స్టర్లింగులో విశ్వాసముంచి, దానిని బంగారముతో సమానముగా ఆదరించుచు, ఎక్కువ స్టర్లింగును నిలువచేసి, తమ నాణెములకు, స్టర్లింగుకు ఒక సంబంధం ఏర్పరచి తమ వర్తకము స్టర్లింగులో జరుపుచుండెడివి. కాని స్టర్లింగు-డాలరుమారకం నిలుపుదలచేయుటతో, స్టర్లింగులో ఆ విశ్వాసము నశించిపోయినది. ఏనాటైనా బ్రిటన్ ఈవిధముగా మారకము నిలిపివేసి, తమ నిలువలను వృథా చేయవచ్చునని, ఇకముందు దేశములన్నియు ఆందోళన చెందుచు స్టర్లింగు వాడకం తగ్గించివేయును.

అమెరికానుండి పుచ్చుకున్న ఋణం అయిపోయినంతమాత్రమున బ్రిటనుకు యితరడాలరునిలువలు లేవని భావింపరాదు. అమెరికాతరువాత ప్రపంచంలోకెల్ల పెద్దబంగారంనిలువ ఇంగ్లండులోనే వున్నది. ఈమధ్యకూడ బ్రిటన్ బంగారు కొని నిలువలు వృద్ధిపరచినది. అదిగాక బ్రిటనుకు రహస్యముగా ౨౫౦ కోట్ల డాలర్లు నిలువయున్నవి. అది ఏమాత్రమూ వాడబడలేదు. కెనడానుండి పుచ్చుకున్న ఋణములో కొంతభాగము యింకనూ మిగిలియున్నది. వీటన్నింటి సహాయముతోను యింక కొన్నాళ్ళవరకూ స్టర్లింగు-డాలరు నిర్నిబంధమారకం జరుపుటకు వీలయ్యెడిదే.

కాని ఖంగారుతో స్టర్లింగుపై ఒత్తిడి తెస్తున్న విదేశస్థులకొరకు నిలువలనన్నిటిని ఖర్చు చేసుకోవటం ఏమి సమంజసం? ఆ నిలువలను ఆధారముగా నుంచుకుని, ఆర్థిక పునరుద్ధరణ జరిపి, స్టర్లింగుపై విశ్వాసం తిరిగి ఏర్పడినతరువాతనే నిర్నిబంధమారకపు విధానము అవలంబించటం వివేకము కదా! అందువలననే బ్రిటన్ తన నిలువలనన్నిటినీ వృధాచేసికొనలేదు. వానిని గరిష్ఠ ప్రయోజనముకొరకు ఉపయోగింపవలెనని తలచుచున్నది.

స్టర్లింగుపై జరుగుచున్న ఒత్తిడిని తాత్కాలికముగా స్టర్లింగు-డాలరుమారకం నిలుపుదలవలన అరికట్టినా, శాశ్వతముగా స్టర్లింగును డాలరుతోపాటు విశ్వసనీయమైనదిగా చేయుటకు బ్రిటన్ వ్యాపారపరిస్థితి చక్కబడవలెనని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించినది. వ్యాపారపుకొరతను భర్తీచేయుటకు రెండేమార్గము లున్నవి: ఎగుమతులు వృద్ధిచేయుట, దిగుమతులు తగ్గించుట. ఎగుమతులు వృద్ధిచేయుటకు ముందు దేశములో అధికోత్పత్తి జరుగవలెను. ఎగుమతులుకూడ ఎక్కువగా డాలరుప్రాంతములకే జరుగవలెను. అంటే డాలరుప్రాంతములలో కావలసిన వస్తువుల ఉత్పత్తి అధికం కావలెను. ఉత్పత్తి జరుగుటకు ముందు బొగ్గు కావలెను. అందువలననే బొగ్గుఉత్పత్తి ఎక్కువ జరుపవలెనని ప్రభుత్వమూ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసూ విజ్ఞప్తిచేసినవి. బొగ్గుగనికార్మికులు వారమునకు ౬ రోజులు పని చేసెదమనియూ, ఈ సంవత్సరమునకు అంచనా వేయబడిన ౨౦ కోట్ల టన్నుల బొగ్గుఉత్పత్తి చేసెదమనియు వాగ్దానము చేసిరి. బ్రిటిష్ ఆక్రమిత రూర్ పరగణాలో కూడా రోజుకు ౨,౪౦,౦౦౦ టన్నుల బొగ్గు త్రవ్వబడుచున్నది. ఆగష్టు ౨౦ వ తేదీన ఉపప్రధాని మారిసన్ చేసిన ప్రకటనప్రకారం బ్రిటనులో అధికోత్పత్తికి అప్పుడే తీవ్రకృషి జరుపబడుచున్నది. జూన్ నెలలో పనిలోనున్న కార్మికుల సంఖ్య ౧,౭౩,౬౦,౦౦౦. ౧౯౩౯ వ సం॥లో వీరి సంఖ్య ౧,౬౯,౨౦,౦౦౦ మాత్రమే. వారమునకు ౪౦ లక్షల టన్నుల బొగ్గుఉత్పత్తి జరుపవలెనని నిర్ణయింపబడినది. రానున్న శీతాకాలములో ఇనుము, ఉక్కు పరిశ్రమ సంవత్సరమునకు ౧ కోటి ౩౫ లక్షల టన్నుల చొప్పున ఉత్పత్తి జరుపగలదు. సైనికుల సంఖ్యను తగ్గించి, కార్మికుల సంఖ్యను హెచ్చించుచున్నారు. వ్యవసాయపదార్థముల ఉత్పత్తి ౧౯౫౧-౫౨ నాటికి ౧౦ కోట్లపౌనులు వృద్ధిచేయుటకు పథకములు వేయబడినవి. వ్యవసాయదారులకు కావలసిన యంత్రసామగ్రి, ఎరువులు, కూలీలు సరఫరా చేయబడుదురు. ముఖ్యముగా డాలరుప్రాంతములనుండి దిగుమతి చేసుకొనుచున్న ఆహారపదార్థములు తమ దేశములోనే ఉత్పత్తి జరుపుకొనవలెనని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించినది. ముడిపదార్థములు, ఆహారపదార్థములు పండించుటకు పనికివచ్చు వలసరాజ్యములలో ఆయా పంటలు ప్రోత్సహించుటకు, తదితర పరిశ్రమలు నెలకొల్పుటకు, తద్వారా డాలరుప్రాంతముపై వీలైనంత తక్కువగా ఆధారపడియుండుటకు నిశ్చయింపబడినది. కార్మికులను ఆయా అత్యవసరపరిశ్రమలలో నిర్బంధముగా పనిచేయించుటకు కావలసినన్ని అధికారములు ప్రభుత్వమే తీసికొనబడినవి. ఇంజనీరింగ్, కెమికల్సు, వస్త్రములు, ఇనుము, ఉక్కు మొదలైన పరిశ్రమలలో కార్మికులు అధికోత్పత్తికి తోడ్పడవలెనని ప్రభుత్వము విజ్ఞప్తిచేసెను. ఏఏవిధముగా అధికోత్పత్తి జరుగవలెనో సూచించు ప్రణాళిక రెండువారములలో ప్రచురింపబడగలదు. దీనివలన మొత్తము ౪౦ కోట్లవరకూ వర్తకపుకొరత భర్తీచేయబడవలెను.

దిగుమతులను తగ్గించుటనుగూర్చి వివరములు అప్పుడే ప్రకటింపబడినవి. డాలరుప్రాంతములనుండి బ్రిటన్ తన దిగుమతులను తగ్గించుకొనుటయేగాక, సామ్రాజ్యదేశములన్నింటినీకూడ డాలరుదిగుమతులు తగ్గించుకొనవలసినదని విజ్ఞప్తి చేసినది. పైగా డాలరుప్రాంతములకు ఎగుమతి చేయవీలగు వస్తువుల దిగుమతులను కూడ తగ్గించుకొనవలసినదిగా సామ్రాజ్యదేశములను కోరినది. బ్రిటన్ డాలరుప్రాంత దిగుమతులలో ౨౨౭ కోట్ల పౌనులు వెంటనే తగ్గించుటకు నిశ్చయింపబడినది. ఇందులో ౧౪.౪ కోట్లపౌనులు ఆహారపదార్థములే. అందువలన ఆహారపదార్థముల రేషన్ కూడ తగ్గించవలసి వచ్చినది. మాంసపు రేషన్ ౧౪ ఔ. నుండి ౧౨ ఔ. లకు తగ్గింపబడినది. డాలర్ ప్రాంతములనుండి విలాసవస్తువుల దిగుమతులు పూర్తిగా నిషేధింపబడినవి.

యాత్రకాలములో వ్యక్తికి ఖర్చుకు ఇవ్వబడే మొత్తం ౧౨ నెలలకు ౭౫ పౌనుల నుండి ౧౪ నెలలకు ౫౦ పౌనులకు తగ్గింపబడినవి. వర్తకంకొరకు దినదినమూ యూరప్ పోయివచ్చేవారు ౧౦ పౌనులకన్న ఎక్కువ ఖర్చుచేయుటకు వీలులేదు. ఈ నిబంధనలవలన ౩ కోట్ల ౩౦ లక్షల పౌనులు ఆదా చేయబడును. పెట్రోల్ రేషన్ తగ్గింపబడినది. వ్యక్తిగతముగా వున్న మోటార్లకు పెట్రోల్ యివ్వటం మాని

చేస్తారు. దీనివలన కోటిపౌనుల పెట్రోలు దిగుమతి తగ్గిపోవును. సినిమాలపై పైనచెప్పిన నిబంధనవలన ౧ కోటి ౧౦ లక్షల పౌనులు ఆదా కాగలవు. కలపదిగుమతులు ౧ కోటిపౌనులు, తదితర కొనుగోలుదారుల వస్తువుల దిగుమతులు ౨ కోటిపౌనులు తగ్గించబడినవి. విదేశములలోని బ్రిటిష్ సైనికుల సంఖ్య తగ్గుటవలన సైన్య ఖర్చులో ౩ కోట్ల పౌనులు తగ్గగలవు. దిగుమతుల తగ్గింపు జయప్రదముగానే జరుగుచున్నది కాని, అధికోత్పత్తి జయప్రదముగా జరుగునా యన్నది చూడవలసియున్నది.

ఆంగ్లో-అమెరికన్ ఋణపు ఒడంబడికలోని ౯ వ నిబంధనను సవరణచేసి, ఎక్కువ పదార్థములను వలసదేశములనుండి, సామ్రాజ్యదేశములనుండి దిగుమతి చేసికొని డాలరుకరువును గడచుటకు అవకాశమివ్వాలని బ్రిటన్ అమెరికాను కోరినట్లు తెలుస్తున్నది. ఈమధ్య వాషింగ్టన్‌లో జరిగిన ఆంగ్లో-అమెరికన్ సంప్రదింపులలో ఈ నిబంధన సవరణ చేయబడినదని బ్రిటిష్ ప్రముఖులు ఆశించుచున్నారు. ఈ నిబంధన సవరణ చేయబడలేదనియు, సవరణ చేయకపోయినను బ్రిటన్ తన వలసదేశములనుండి, సామ్రాజ్యదేశములనుండి దిగుమతులు జరుపుకొనుటకు అవకాశం వున్నదనియు అమెరికన్ ప్రతినిధి ఈమధ్య చెప్పెను.

ఈ విపత్కాలములో బ్రిటనుకు తోడ్పడుటకు సామ్రాజ్యదేశములన్నియు ముందుకు వస్తున్నవి. దక్షిణాఫ్రికా ౮ కోట్లపౌనులు అప్పుయిచ్చి, పండ్లు మొదలగు ఆహారపదార్థములు ఎగుమతిచేసెదనని వాగ్దానము చేసినది. ఆస్ట్రేలియాకూడ ౪, ౫ కోట్ల పౌనులు అప్పుయిచ్చుటకు, తన డాలరు దిగుమతులు తగ్గించుకొనుటకు నిశ్చయించినది. టాస్మేనియా బ్రిటనుకు ఆహారపదార్థములు కానుకగా పంపుచున్నది. కెనడా కూడ సహాయపడుటకు సంసిద్ధత సూచించినది. ఫ్రాన్సు మొదలగు కొన్ని దేశములు తమతమ డాలరు దిగుమతులు తగ్గించుకొనుటకు నిశ్చయించినవి. డెన్మార్కు బ్రిటనుకు ఎగుమతులు మానివేసి, డాలరు ప్రాంతమునకే ఎగుమతులు చేయుదునని బెదరించినది. బ్రిటనుకు ఆహారపదార్థములు సరఫరాచేయుటకు హంగరీ ౪ ఏండ్లవరకూ ఒక ఒడంబడిక చేసికొన్నది. ఇండియన్ యూనియన్, పాకిస్థాన్‌లు తమతమ కత్యవసరమగు పదార్థములు మాత్రమే బ్రిటన్‌నుండి, డాలరు ప్రాంతమునుండి దిగుమతిచేసికొనుటకు నిశ్చయించినవి. కాని ఇండియాకు ముఖ్యముగా కావలసినది ఆహారపదార్థములగుటవలన, దిగుమతులు తగ్గించుకొనుటకు అవకాశము లేదు. బ్రిటన్ ఈ విషయమును గ్రహించెను. ఇండియాకు కావలసినన్ని డాలర్లు యిచ్చుట కంగీకరించెను.

బ్రిటన్ తనకు కావలసిన డాలర్లు సంపాదించుకొనుటకు మరి మూడు మార్గము లున్నవి. ఒకటి నూతన ఋణములు. కాని వీని డాలరు నిలువలు బ్రిటనుకు ఏమాత్రము సరిపోవు. రెండు-అమెరికన్ ఎగుమతి దిగుమతుల బ్యాంకు. ఈ బ్యాంకుకు ప్రస్తుతం గల ధనం తక్కువగా నుండుటవలన, పరిశ్రమల పునరుద్ధరణకు మాత్రమే అప్పులు యివ్వగలవని నిశ్చయింపబడినది. మూడు - అంతర్జాతీయబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి. ఆ అంతర్జాతీయబ్యాంకు స్వల్పకాలమునకు అధికవడ్డీపైనమాత్రమే అప్పుయిచ్చును. దీర్ఘకాలములకు పునరుద్ధరణకార్యములకుమాత్రమే అప్పుయిచ్చును. కాబట్టి ఇవన్నియూ బ్రిటనుకు ఏమాత్రమును సహాయము చేయలేవు. అంతర్జాతీయద్రవ్యనిధిలో బ్రిటన్ కోటా ౮౨ కోట్ల డాలర్లు. ఇది బ్రిటనుకు ఏమాత్రము సరిపోదు. కాని అంతర్జాతీయ ద్రవ్యనిధి డాలరును "అరుదునాణెము"గా ప్రకటించి బ్రిటనుకు సహాయపడవచ్చును. డాలరును "అరుదునాణెము"గా ప్రకటించుటవలన పైనచెప్పిన ౯ వ నిబంధన తనంతతానే రద్దయిపోగలదు. సెప్టెంబరు ౧౧ వ తేదీన జరుగనున్న అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశములో బహుశః ఈ విషయము చర్చించవచ్చును. (బ్రిటనుకు ఈ విపత్కాలములో తోడ్పడు మార్గముల నన్వేషించుటకు సామ్రాజ్యదేశములు లండనులో ఒకసభ జరుపనున్నవి)

ఈ విపత్కాలములో బైటపడుటకు ప్రభుత్వమునకు తోడ్పడక, ఈ అదనును తమపక్షరాజకీయ ప్రచారమునకు ఉపయోగించుకొనుచున్నారు కన్సర్వేటివులు. వీరిప్రచారం ప్రకారం బ్రిటనులో ఇప్పటి పరిస్థితి డాలరుకొరతవలన ఏర్పడింది కానే కాదు. అది సోషలిస్టువిధానమువలననే ఏర్పడినది. బ్రిటనులో ధరలు వెంటనే నూటికి ౨౦ వంతులు పెంచి, కార్మికుల జీతములు ఇంక పెరుగకుండా నిర్ణయించి, వీలైనంతవరకు తగ్గించవలెను. మోటార్లు, గుడ్డలు మొదలగు వస్తువులు ఎగుమతి చేయకూడదు. ఆదాయపు పన్ను మొదలగు పన్నులు తగ్గించవలెను. కార్మికులకు యిచ్చు ఆహారపు అలవెన్సు, తదితర సాంఘిక సౌకర్యములు, అధికవిద్యాసౌకర్యములు, సాంఘిక వ్యాయకార్యములు పూర్తిగా తగ్గించివేయవలెను.

దిగుమతులు పూర్తిగా తగ్గించి, ఎగుమతు లభివృద్ధి చేయవలెను. ప్రభుత్వఖర్చులు తగ్గించుకోవలెను. కార్మికులచే ఇంకా ఎక్కువకాలం పని చేయించవలెను—అనునవి వీరి ప్రతిపాదనలు. ధరలు పెరిగి, జీతములు తగ్గి, పన్నులు తగ్గినప్పుడు ధనవంతులకద్ద ధనరాసులు కుప్పలు పడిపోగలవు. దీనికి తోడు కార్మికులకు చూపుచున్న సౌకర్యములు తగ్గించివేయవలెనట! ఇండియా ఈ సమయమున స్టర్లింగుప్రాంతమునుండి తొలగిపోయి, బ్రిటనును మరింత బాధపెట్టరాదని ఈ రకమునకు చెందిన కొందరు పెద్దలు ప్రచారము చేయుచున్నారు.

బ్రిటనులోని ఈ ఆర్థికవిపత్తువలన భారతదేశములోని పరిస్థితులలో ఏమి మార్పులు రానున్నవన్నదే మనకు ముఖ్యప్రశ్న. ఈ ఆర్థికవిపత్తువలన స్టర్లింగు విలువ పడిపోయి మనకు నష్టము రాగలదని చాలమంది భయపడినారు. కాని అట్టిదేమియు జరుగుటకు అవకాశము లేదని తేలిపోయినది.

ఈమధ్యనే జరిగిన తాత్కాలిక ఒడంబడిక ప్రకారం మనకు వెంటనే ౬౫ కోట్లపౌనులు స్టర్లింగు నిర్బంధముగా ఏ దేశములోనికైనా మార్చుటకు బ్రిటన్ అంగీకరించినది. ఈ ఒడంబడిక స్టర్లింగు-డాలరు మారకంవలన నిలుపుదలకాలేదనికూడ స్పష్టముచేయబడినది. ఇకముందు మన దిగుమతుల మొత్తము ఎగుమతుల మొత్తముకన్న ఎక్కువగానుండుటకు వీలులేదు. కాని మనకు కావలసిన ఆహారపదార్థముల దిగుమతి మానుకొనుటకు వీలులేదు. ఇప్పుడు బ్రిటన్, నిర్బంధమారకమునకు ఒప్పుకొన్న ౬౫ కోట్ల పౌనులు అవసరవస్తువులతో ఆహారపదార్థముల దిగుమతులకు ఉపయోగించవచ్చు. ఈ ౬౫ కోట్ల పౌనులు ఈసంవత్సరాంతమువరకే గాబట్టి మన అవసరములకు సరిపోవును. అసలు ఈ మొత్తమును నిర్ణయించునప్పుడు మన ఆహారపదార్థముల అవసరములను గుర్తించియేయుండిరి. స్టర్లింగు-డాలరు మారకం నిలుపుదలవలన మనకు వెంటనే కలుగు నష్టమేదియు లేదు. మనం స్టర్లింగుప్రాంతమునుండి విడిపోయినతో ఈ ౬౫ కోట్ల పౌనులు డాలర్లలోనికి మార్చబడవు. పైగా మనము అమెరికన్ ధనికవాదమునకు ఒప్పుకుని, అమెరికావద్ద అప్పుపుచ్చుకొనవలసివచ్చును.

మన దేశమునకు డాలరుప్రాంతమునుండియు, బ్రిటనునుండియు వచ్చు దిగుమతులు తగ్గిపోవును గాబట్టి మన దేశములో ఆ వస్తువులు ఉత్పత్తిచేసికొనవలెను. అవసరముగుతో ఆయా పరిశ్రమలను వెంటనే స్థాపించుటకు తగు ఏర్పాట్లు ప్రభుత్వము పూనుకొని చేయించవలెను. ఇందువలన మన పరిశ్రమలు అభివృద్ధి కొందుటయేగాక, మన దేశములో వస్తువుల కొరత నిర్మూలించి, జీవనస్థాయి హెచ్చించుటకు అవకాశము కలుగును. స్వతంత్రభారతదేశమునకు లభించిన ఈ ప్రథమావకాశము ఊరక జారవిడువబడదని మనము ఆశింపవచ్చును.

బ్రిటన్ ఈ ఆర్థికవిపత్తునుండి జయప్రదముగా బైటపడి, తద్వారా స్టర్లింగు ప్రపంచములో మరల బలవత్తరమై, మన స్టర్లింగునిలువల విలువ పడిపోకుండ ఉండగలదనికూడ మనం ఆశించవచ్చును.



# స్వర్గంలో స్వాతంత్ర్యోత్సవం



= శ్రీ కపిల కాశీపతి =

భారత స్వాతంత్ర్య ప్రభుత్వ పదవీస్వీకార కార్యక్రమం రాత్రిఅంతా రేడియోలో విని, కాస్త వొరిగేసరికి కునుకుపట్టింది. ఆరుబయట చల్లని గాలిలో వొళ్లు తెలియలేదు. గోచరించింది ఇంతలో కళ్ల ముందు ఏదో బ్రహ్మాండమైన తేజస్సు. ప్రత్యక్షమైనాడు నారద మహాముని చేతులో వీణా, తనూ! ఆలోచిస్తున్నాను ఎల్లావర్ణించి వ్యాసం వ్రాతామా ఈ మహామహూర్తంలో నాకు కలిగిన ఈ మహానుభవం అని.

"అది మహోదయము!

"అరుణ రేఖలలో, నల్లని కొండకనుమలవలె ఏపుగా పెరిగిన దిరిసెన చెట్ల ఎత్తుపల్లాలలో, చల్లని పిల్లతెమ్మెర లుయ్యాలలూగగా, తూరుపు వేటకాని కాంతిమాత్రముల యుచ్చులలో తగుల్కొన్న కోమల శిరీష కుసుమకన్యకావళి విరహ పరిమళాలలో మహతీ వీణా గానము మానవలోకానికి మేలుకొలుపులు పాడినది. మహర్షి, బ్రహ్మమానసపుత్రుడు, నాదబ్రహ్మోపాసకుడు, బ్రహ్మచారి, చిరంజీవి, త్రిలోకసంచారి, వార్తాసేకరణనిపుణశిరోమణి శ్రీ నారద మహాముని నా ముందు సాక్షాత్కరించిన మంచివేళ!

"అది శుభోదయము.

"కడచిన రాత్రి భారతవర్షము పరాధీన. ఈ వేళ ఉదయము స్వాధీన. అర్ధరాత్రివేళ, నా మాతృదేశానికి స్వాతంత్ర్యప్రదానం చేసిన శ్వేతజాతి, అరవై సంవత్సరాలుగా స్వాతంత్ర్య యజ్ఞంలో త్యాగదీక్ష బూని సఫలమనోరథులైన నా దేశనాయకులు—వీరిలో ధన్యు లెవరు? ఇచ్చినవారు ధన్యాత్ములు, పుచ్చుకున్నవారు ధన్యులు!"

నారదమహాముని ఏకసంతగ్రాహి మాత్రమే కాదు. సర్వస్వాంతగ్రాహి. గ్రహించాడు నా వ్రాయసకాని బుర్రలో సుడిగుండాలులా గిరగిర తిరుగుతున్న పదజాలం. "సోదరా!" అన్నాడు. ఏమా మహాభాగ్యము! నారదుడివంటి తేజోమూర్తి నన్ను "సోదరా" అని సంబోధించినాడే! నాజన్మ పావనము. అవును, ఎందుకు కాకూడదు? ఆంగ్లపరిభాషలో ఆయనా, నేనూ "ఏకకపక్షులము." వార్తాప్రచార వృత్తిలో మేము సోదరులమే.

గ్రహించేశాడు అప్పుడే నారదమహాముని. "సరే, వ్రాసుకో" అన్నాడు. అసలు నారదుడికి కూడా తెనుగువొచ్చునని నాకు ఇదివరలో తెలియదు. వొక వేళ తెనుగువాడే యేమో! నేనుమాత్రం అడగలేదు. ఒకవేళ తెనుగొచ్చిన తమిళసోదరుడై నామీద అనుమాన పడతాడని. ఏమైనా "దేశభాషలందు తెనుగు లెస్స" అనడాని కిది మరో ఉదాహరణ. "ఎరుగవే భాషాకి ఎల్లఋషులు గొలువ."

నారదుడికి కాలునిలవడంలేదు. "వ్రాసుకో వేమి" అన్నాడు. రాత్రి పక్కనే పెట్టుకున్నాగావును, కలం, కాగితం తీశాను. ప్రారంభించాను వ్రాయడం.

"శ్రీమన్మహీమండలమండనాయమానంబైన భరతవర్షంబునందు" అని ప్రారంభించాడు. నాకు వొళ్లు మండింది. ఈ భాష ఎవడు వ్రాస్తాడు! నారదు డడేది, గీరదుడడేది!

"అయితే, ఏ భాష కావాలి? హిందీలోనా, ఇంగ్లీషులోనా?" అన్నాడు.

"తెనుగువాడవై యుండి అదేమిటయ్యా, హిందీ వల్ల తెనుక్కి జరుగుతున్న అపకారం తెలియదా! నువ్వు బ్రహ్మమానసపుత్రుడివని విన్నానుగాని, ఆంగ్ల

మానసపుత్రుడివని వినలేదే? ఇక వుండబట్టలేకపోయాను. ఋషి అయితేనేం, ఋషిఅయితేనేం! తరవాత సంభాషణ అంతా ఏకవచనంలోనే జరిగింది. ఆయనకి కోపం వచ్చినట్టు మాత్రం లేదు.

"పదహారణాల ఆంధ్రుడివిరా నాయనా. ఏ భాషలో వ్రాస్తావు చెప్పు?"

"శిష్టులు మాట్లాడే తేటతెల్లమైన నా తెనుగు భాషలో."

"ఎవరా శిష్టులు?"

"అడ్డదిడ్డంవాదనే చెయ్యొద్దు. నీవంటివారు శిష్టులని నేను అంగీకరిస్తాను. కాని జాతీయం విడిచిపెడితే శిష్టులుకూడా పనికిరారు. నువ్వు పారిజాతాపహరణ సమయంలో రుక్మిణితోటీ, సత్యభామతోటీ ఏభాష మాట్లాడివున్నావో ఆ భాష చాలు. స్త్రీలలో ఇంకా జాతీయం చావలేదు. వారిదగ్గిర మనం నేర్చుకోవలిసింది చాలా వుంది."

"అళినీలాలక నీవు నీ పతి రహ
స్య క్రీడ నర్తించు వే
ళ లతాంతాయుధ సంగరంబునకు ను
ల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమజనా
సంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలగింపగా సురటినై
రంజిల్లు నిచ్ఛాగతిన్."

వీడి తస్సాదియ్యా! ఈ నారదుడు మహా పెద్ద పాటగాడండీ! ఎంత చక్కగా చదివినాడు ఆ పద్యం. వినివుంటే కామేశ్వరరావుగారు "పద్యం పాడకూడదు" అనే తమ వాదన మార్చుకుని వుందురు. ఇంకా పాడమందా మనుకున్నాను, ముక్కు తిమ్మనముద్దుపద్యాలు —నానా సూనవితాన, జలజాతాసన, ఈగునబుట్టి, వామలోచన, ఇటువంటివి. ఆయనకూడా మాంచి మూడ్‌లో మాంచిపద్యం ఎత్తుకున్నాడు. బ్రహ్మచారి గదా, వీడికి రంజాలన్నీ ఎల్లా తెలుసునో!

నవ్వుతున్నాడు నారదుడు. బుర్రలో బుద్ధి పుట్టేసరికే గ్రహించేస్తున్నాడు. వీడితో చిక్కే. అయితే లొంగకూడదు.

"అది ముక్కు తిమ్మన్నగారి భామండీ పండితోత్తమా."

"భలే మంచి చౌకబేరము, ఇది సమయము,
మించినన్ దొరకదు"

అమ్మకొయ్యా! రామపాకశాస్త్రి ఎందుకు? వన్సుమోర్ అనేవాణ్ణే. కాని సంగీతచర్చ అప్రస్తుతం అనుకున్నాను.

"అది ముత్తరాజా సుబ్బారావుగారి భాషో, మరి ఎవరి భాషో. శిష్టులభాష మాత్రం కాదు."

"నిన్నో విషయం అడుగుతాను చెప్పు. నీ కంటే నేను గొప్పవాణ్ణి కాకపోయినా, నీ కంటే వయస్సు నాకు ఎక్కువవుందని ఒప్పుకుంటావా?"

"తాటిచెట్టుకి లేవూ?"

"తాటిచెట్టు కంటే ఎక్కువ వయస్సుందా లేదా?"

"సరే, ఈ పాయింటు నీకిచ్చేశాను."

"భాష అనేది మనుషులతో పాటే మారుతూ వుంటుంది. సంస్కృతం మారలేదూ! ఎప్పుడు మారడం మానేసిందో అప్పుడే పోయింది లోకంలోంచి. ఒకనాటి శిష్టులు మరోనాడు భ్రష్టులౌతారు. "యథా రాజా తథా ప్రజా" అన్నారు. అసలు భాష అనేది ఒకర్ని ఒకరు అర్థం చేసుకోడానికి. సంభాషణకే కాక సాహిత్యానికీ, సంగీతానికీ వేరే వేరే భాషలు వుండవలసిన అవసరం ప్రతిదేశంలోనూ మనం చూస్తున్నాం. సాహిత్యానికి కాస్త సంస్కరించబడిన భాష అవసరం. సంస్కృతం అని పిలవబడే భాష వోనాడు తప్పుల తక్కెడగా వుంటేనే, పండితులంతా దాన్ని సంస్కరించి వోస్థాయిలో స్వరూపం ఏర్పాటు చేశారు. అల్లా సంస్కరించబడిన భాషే సంస్కృతం. అదే విధంగా తెనుగులో పద్యకావ్య భాష నన్నయభట్టూ, వచనకావ్యభాష వీరేశలింగమూ సంస్కరించారు."

"అయితే ఏమంటావ్?"

"ఏ రొండకా గొడుగు పట్టుకోవాలంటాను"

"అంటే!"

"ఒకేరకమైన భాష వ్రాస్తానని మంకుపట్టు పట్టుకుని కూచోక నీ అవసరాన్ని అనుసరించి భాష అనే పనిముట్టు వుపయోగించుకోమని అర్థం. కట్టెలు కొట్టడానికి మంగలికత్తి ఉపయోగిస్తావా? పెన్సిలు చెక్కడానికి వుపయోగించినా, కత్తిపీటతో గోళ్లు తీసుకోవుగదా? అదేవిధంగా భాష అనే పనిముట్టులో రకాలున్నాయి. నీకు ప్రస్తుతం కావలసినభాష పత్రికలలో రిపోర్టు చెయ్యడానికి పనికొచ్చేది."

"ఎందుకని?"

"వో రిపోర్టువ్రాయాలిగనక"

"ఇదోటా పైగా! నన్ను నిద్దరలేపి, నాతో వాదనవేసుకుని, పైగా రిపోర్టు వ్రాయమంటున్నావు. రేపురోజంతా ఎల్లాగావుంది రగడ"

"సోదరా!"

మళ్ళీ నా వొళ్లు పరవశమైపోయింది. ఆయన అల్లా బతిమాలుతోంటే ఎల్లా? పైగా తనూ, నేనూ వో వృత్తిలోనే వున్నాం. నాకష్టాలలాటివే ఆయనకీ వుంటాయి వృత్తిలో.

"నిజం సుమా. గజేంద్రమోక్షం అప్పుడేమైంది?" అన్నాడు నారదుడు.

"సిరికిం జెప్పడు, శంఖచక్రయుగమున్ చేదోయి సంధింపడు."

"ఆయనసంగతి సరేనోయ్. తక్కినవాళ్లసంగతేమిటి? హాహేహా యేలినవారి సమక్షంలో వుండవలసినవాళ్లం, విషయం ప్రకటించవలసిన నేనూ..."

"తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరో
ధవ్రాతము, దానివె
న్కను బక్షీంద్రుడు, వాని పొంతను ధనుః
కౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు
... ... ..."

అవును మరిచేపోయాను. పాపం. అర్థరాత్రి వేళ. బ్రహ్మచారిప్రాణాన్ని...

"అల్లాగే ఇప్పుడూ జరిగింది. కనక నేనో రిపోర్టు చెబుతాను, వ్రాసుకో."

"అసలు భాషవిషయం తేలందే?"

"చెప్పానుగా, నీ ఇష్టం వొచ్చినభాషలో వ్రాసుకుని, అందరికీ అర్థం అయేటట్టు వ్రాయించు"

"ఓ. కే."

"సర్వజిత్తునామ సంవత్సర అధికశ్రావణ బహుళ త్రయోదశీ గురువారం రాహుయుత వృషభలగ్నమందు, భారతవర్షంబున ఇంద్రప్రస్థ నగరమునందు, శ్వేతద్వీప వాసులు కాంగ్రెసు నాయకులికి అధికార ప్రదానం చేస్తున్నారన్నవిషయం తెలుసుకుని, స్వర్గంలోకూడా, కీర్తిశేషులైన భారతీయులు, ఈ సందర్భంలో ఏదో కార్యక్రమం నడిపితీర్తారనే నమ్మకం కలిగి అక్కడికి వెళ్లితిని. స్వర్గద్వారంలోనే కోలాహలం వినబడింది. చూడగా జనంమాత్రం నేను అనుకున్నంతమంది లేరు."

"కారణం?"

"కనుక్కోగా తెలిసిందేమిటీ అంటే, భూలోకంలో కీర్తిశేషులైన నాయకులంతా కొద్దిరోజుల క్రితం వరకూ స్వర్గంలోనే వున్నారనీ, బ్రిటిషుపార్లమెంటులో ఇండియాబిల్లు ఆమోదించబడిననాడే మూటా ముల్లే కట్టుకుని ఊర్ధ్వలోకాలికి వెళ్లిపోయారనీ తెలిసింది."

"అదేమిటి?"

"భూలోకంలోంచి, అస్తమించే కాలంలో, వ్యక్తులికి ఏవైనా తీరని కోరికలు వుంటే, ఆ కోరికలు తీరేదాకా మొదటి మకాం అయిన స్వర్గలోకంలోనే వుంటారు. అవితీరిపోగానే తక్కిన లోకాలికి పోతారు. ఈవిధంగా ఏడుమెట్లు వున్నాయి. అవే ఊర్ధ్వలోకాలు."

"ఇదివరదాకా వీరికి వుండుకున్నటువంటి కోరికలు ఏమిటి, ఇప్పుడు తీరినవి ఏమిటి?"

"భారత స్వాతంత్ర్యం!"

"ఆర్థికస్వాతంత్ర్య మను కాంక్షతోడ నేగ గోపాలకృష్ణ గోఖలుండు.

—ఆ ఆర్థిక స్వాతంత్ర్యం వొచ్చిందా?"

"రాలేదు. కనకనే ఆయన ఇన్నాళ్లుగా స్వర్గంలోనే వుండిపోయాడు. ఇంకా వున్నాడు. సభకు వచ్చిన పెద్దలలో ఆయన వొకడు."

"ఇంకా ఎవరెవరున్నారు?"

"వాళ్లందరి పేర్లూ నేను చెప్పగలనా? నీకు కావలసినవాళ్ళ పేర్లు అడుగు, వున్నారో లేరో చెబుతాను."

"పూజనీయులైన పండిత మదనమోహన మాలవీయులున్నారా?"

"ఏం, ఎవరికీ లేని గౌరవం ఆయనకి చూపిస్తున్నావు! పోయాడనా?"

"మా కులపతి. గంగాతీరమందు కాశీక్షేత్రంలో పూజనీయులవద్ద నేర్చుకొన్న రెండుమాటలే నా చెవులలో మారుమోగుతూ వుంటాయి."

"ఏమి టవి?"

"నీకు తెలియనివి కావు. సత్యం వద, ధర్మం చర."

"ఆ సత్యం, ఆ ధర్మం ఈనాడు అమలులో లేవనే కొండంతబరువుతో పోయాడు. ఆబరువు మోస్తా నడుంవొంగిపోయి, స్వర్గసీమలో పిచ్చివాడులా సంచరిస్తున్నాడు."

"ఇంక చెప్పకు, నాకు ఏడుపొస్తుంది. ఇంకా ఎవరున్నారు?"

"అడుగూ?"

"మోతీలాల్ నెహ్రూ వున్నాడా?"

"కొడుకు గాంధీకి వారసుడయాడని వినగానే వెళ్లిపోయాడు."

"ఆ సందర్భంలో మా కులపతి కోరికతీరలేదు."

"నాలుగోకొడుకు నేపాళ ప్రయాణంతో కాస్త ఆత్మశాంతి కలుగుతుంది లే."

"ఇంక దేవుడు చాలా మేలుచేస్తే, బాలగంగాధరతిలక్ వున్నాడా"

"ఆయన కర్మయోగి. పిచ్చిపిచ్చి కోరికలు లేకుండా ఆధ్యాత్మికంలో పడి ఆయన అప్పుడే వెళ్లిపోయాడు."

"తర్వాత, బెంగాలీ నాయకులూ?"

"ఆహా! అంతా వున్నారు. సురేంద్రనాథ్ బెనర్జీ మొదలు సుభాష్చంద్రబోస్ దాకా."

"బోసు బతికుంటే స్వర్గంలో వున్నాడంటారేం?"

"అక్కడా అనుమానంగానే వుంది. అసలు బోసా, నకలుబోసా అని. ఇంకా ఏమీ నిర్ధారణ కాలేదు."

"బెంగాలీనాయకు లేమంటారు?"

"వాళ్లు వేరే ప్రత్యేకసభ చేసుకున్నారు. ఎందుకోసమైతే భారతస్వాతంత్ర్యసమరం ప్రారంభం అయిందో, ఆవిషయంలోనే కాంగ్రెసు వోడిపోయిందన్నారు."

"అంటే?"

"బెంగాలు విభజనచేస్తానని లార్డు కర్జన్ అన్నప్పుడు ప్రారంభించిన వందేమాతరం ఉద్యమం ఈ సమరానికి అంకురార్పణం అంటారు. చివరికి బెంగాలు రెండుముక్కలై కర్జన్‌మాటే నెగ్గిందంటున్నారు. అందులో బిపిన్‌చంద్రపాల్ మరీనూ. దుమ్మెత్తి పోస్తున్నాడు నాలికకొరుక్కుంటూనూ."

"అవును పాపం. మరి మావాళ్ల సంగతేమిటి? వందేమాతరంలో మేమూ గంతులేశాంగా?"

"మీవాళ్ల సంగతి చెప్పడానికే వొచ్చాను. వీళ్లు కూడా వో ప్రత్యేకసభ చేశారు."

"ఎందుకూ?"

"భారతదేశానికి స్వాతంత్ర్యం వొచ్చినా ఆంధ్ర రాష్ట్రం రాలేదని."

"తప్పంటావా?"

"అన్నానా?"

"మరి?"

"విషయం నీతో చెబుదామని వొస్తే నామీద విరుచుకుపడతావేమిటి?"

"పడతానా, మరీ పడతానా? ఆంధ్రదేశమంటే అందరికీ తేలాకోళంగా వుంది. ఇంతవరకూ మాకు కాంగ్రెసు అధ్యక్షపదవి లేకపోగా, స్వాతంత్ర్యప్రభుత్వంలో స్థానం లేకపోగా, ఆఖరికి వోగవర్నరు పదవి కూడా మాకు లేకుండా చేశారు. విరుచుకుపడనూ!"

"అసలైన ఆంధ్రుడివిరా బాబూ, నువ్వు."

"కాకపోతే. చెప్పు. ఏం జరిగిందో. సర్వలోక ఆంధ్రవాసుల మహాసభ! ఆత్మశాంతిలేని ఆంధ్ర

నాయకుల అకుంఠిత దేశభక్తి! స్వర్గంలో మా ప్రత్యేక విశేషరి! అంటే చాలా, పేరయ్యమన్నావా?"

"పేరెందుకులే?"

"సరే, సభలో వీరేశలింగంవున్నాడా?"

"ఆయనకాలంలో ఆంధ్రరాష్ట్రవాంఛ లేదు' సంఘసంస్కారి గనుక, ఏనాడు వితంతువివాహాలూ, జాత్యంతరవివాహాలూ ప్రారంభం అయాయో ఆనాడే ఆయనకి ఆత్మశాంతి. కాని వో విషయం చాలా బాధ పెట్టేది ఆయన్ని."

"ఏమిటది?"

"ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం పోవడానికి బదులు ఎక్కువ అవుతోందే అని."

"ఆయన విచారపడేంలాభం? మనిషి! ఈ కక్కుర్తి పెట్టిన నీ అబ్బ వనాలి. 'బ్రహ్మకైనను బుట్టు రిమ్మతెగులు' అన్నారు."

"అంతా ఆయన్ని తిట్టేవాళే!"

"తిట్టరూ, బుద్ధితక్కువపనులు చేస్తొంటేనూ? అయితే మీ నాయన బాగా ముసలివాడై పోయాడనీ, చిత్తచాంచల్యం ప్రారంభించిందనీ అంటారు నిజమేనా?"

"ఆ చాంచల్యానికే సృష్టి ప్రభావంఆపాదిస్తుంది. నువ్వు రిపోర్టు వ్రాసుకుంటావా, వ్రాసుకోవా?"

"సరేచెప్పు. వెంకటరత్నం నాయుడు గారున్నారా?"

"కాంగ్రెసేతరులకి స్వాతంత్ర్యసమరంలోగాని, తత్ఫలితాలలోగాని సంబంధం లేదు. వెంకటరత్నం నాయుడు కాకినాడలో అసహాయోద్యమ ప్రతికూల మహాసభకిఅధ్యక్షతవహించిన సంగతిమరిచిపోయావా?"

"అవును నిజమే. నాన్.కాంగ్రెస్ వాళ్లపేర్లు ఎత్తొద్దంటావు."

"అన్నమాటే."

"చచ్చిపోయిన ఆంధ్రకాంగ్రెసు నాయకులసభ అందూ?"

"అల్లా అనడానికి వీలులేదు. ప్రభుత్వోద్యోగాలూ అవీ చేసినవారు కూడా అక్కడున్నారు. దేశభక్తి వో కాంగ్రెసు సొమ్మేనా?

"నువ్వేగా అన్నావు! అయితే మా గురజాడ వున్నాడా?

'దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని, యేదైనాను వకమేల్
కూర్చి జనులకు చూపవోయ్! !"

"ఆయన లేకపోతే ఎల్లాగ గురజాడా, గిడుగూ జయంతివారితో భాషావాదం చేస్తున్నారు నీకు మల్లేనే. ప్రజలంతా మా పక్షం అంటారు గురజాడా, గిడుగూనూ. ప్రభుత్వం నాదీ అంటాడు జయంతి"

"స్వర్గానికెళ్లినా సవితిపోరు తప్పలేదన్నట్టుంది. అసలు గిడుగు పిడుగు కాదంటే? పర్లాకిమిడి ఒరిస్సాలో కలిపితే లేచి వొచ్చేశాడు. ఆంధ్రాభిమానం అంటే ఆయనదే. అటువంటి సభకి ఆయన్నే అధ్యక్షుడుగా పెట్టవలసింది!"

"అది రాజకీయసభ అని మరిచిపోకు."

"అయితే ఈ పండితులెందుకు?"

"ఆంధ్రరాష్ట్రం వొచ్చేదాకా వీరి కోరికలు తీరవు. కొమర్రాజు లక్ష్మణరావుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, వంగూరి సుబ్బారావుగారు, నడింపల్లి జగన్నాథరావు గారు, కోడాలి సుబ్బారావుగారు ఇత్యాదులు చాలామంది సదస్యులలోవున్నారు. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పూర్తికాలేదని వొకరూ, అసలు ఆంధ్ర దేశచరిత్రే లేదని కొందరూ, అనేకవిధాల బాధపడుతున్నారు. ఇవన్నీ రాష్ట్రం వొస్తే తీర్తాయని వారి ఆశ."

"తర్వాత?"

"స్వర్గంలో ప్రత్యేకాంధ్ర నగరంలో ఆంధ్ర నాయకుల సభ ప్రారంభం అయింది. అసలు దేశభక్తి అనేది నవీనసాహిత్యంలో తీసుకొచ్చినవారు గనక, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్ని పద్యాలతో సభ ప్రారంభం చెయ్యమన్నారు. సభలో ఎవరో ఆయన చిన్నప్పుడు వ్రాసినపద్యాలే చదవమన్నారు. లక్ష్మీనరసింహంగారు బరువుగా లేచి, చెన్నాప్రగడ భానుమూర్తిగార్ని ఆసరా చేసుకుని మెల్లిగా వేదికమీదికి వొచ్చారు."

"నువ్వెక్కడున్నావు?"

"పత్రికావిలేఖర్ల స్థానంలో"

"ఓ. కే. అక్కడెవరెవరున్నారు?"

"యమలోకంనించి ప్రతినిధిగా వొచ్చిన చిత్రగుప్తుడున్నాడు."

"మావాళ్లోరు?"

"చిరావూరి చింతామణిగారు, చిరావూరి సోమయాజులు గారు, ముట్నూరి కృష్ణరావుగారు, మున్నంగి శర్మ గారు, చల్లా శేషగిరిరావుగారు, పులిగుర్తి లక్ష్మీనరసమాంబగారు ఇత్యాదులు"

"మరి నాగేశ్వరరావుగారూ?"

"ఆయన్ని సభకి అధ్యక్షత వహించమన్నారు. ఆయన అంగీకరించలేదు. చివర నాలుగుమాటలు చెబుతా మన్నారు. భగవద్గీత చేతులో పెట్టుకుని పారాయణ చేస్తున్నారు. ఆయన పక్కనే బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారూ, వెలిదండ్ల హనుమంతరావుగారూ వున్నారు. ఆ పక్కని వరహగిరి జోగయ్యగారూ ఇత్యాదులు."

"చిలకమర్తివారు ఏ పద్యాలు చదివారు? 'భరతఖండంబు చక్కని పాడియావు' చదివారా?"

"కాదు, ఈ పద్యం:

నేలదున్నుదమన్న చాలతరము పన్ను
నీరు కావలెనన్న నీటిపన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడికి పన్ను
సరుకు లమ్మెదమన్న సంతపన్ను
కర్ర లమ్మెదమన్న కలప కింకొకపన్ను
పట్టణంబుల మునిస్పాలుపన్ను
పారిపోవుదమన్న బండిహాసీల్ పన్ను
కొంపమ్ముకొన్నచో స్టాంపుపన్ను
ఉన్నమట్టుకు తినకుండ నుప్పుపన్ను
వసెడు పన్నులు దిగదీసె జనులనెల్ల
కటకటా యెట్టులున్నదో కాపురదశ
సుగుణధనులార జనులార చూడరయ్య!"

"అయితే, స్వరాజ్యంలో పన్ను లుండకనా ఈయన అభిప్రాయం?"

"అదే ఆడిగారుసభలో. తర్వాత భానుమూర్తిగారు గాంధీకంటే పూర్వం అసహాయోద్యమం ఎల్లా ప్రచారంచేశారో ఆ పద్యం చదవమన్నారు. అదేమిటంటే:

"దురుసుదనమున దీర దీ గడుసుదనము
గాన తాపులు పోటులు కార్య మనక
లేగలన్నిటి నేక మాలా గొవర్చి
నేర్పుతో తల్లి యొంగజేప సెరవలయు"

"అంతేనేం. నాన్‌వైలెన్స్ అప్పారావుగారు ప్రచారం చెయ్యలేదూ? "కత్తివైరం కాల్చవోయ్" అన్నాడు!"

"ఈ విషయమే సభాధ్యక్షుడు చెప్పాడు."

"ఆయనెవరు?"

"చీరాల రామదాసు"

"ఆయన్ని ఎవరు అధ్యక్షుణ్ణి చేశారు?"

"ఒకరు చేసేదేమిటి? ఆయనే స్వయంగా పీఠం అలంకరించాడు.

నాగేశ్వరరావుగారు రానంటే వెంటనే గద్దె ఎక్కి:

మహాజనులారా, ఆంగ్రనాయకత్వం స్వర్గంలో కూడా మన పాలే బడింది. మహానందిలో కూడా ఇంతే. ఈనాడు భూలోకంలో భారతీయులంతా కోలాహలంగా స్వాతంత్ర్యోత్సవాలు చేస్తున్నారు. ఏడవాలో నవ్వాలో నాకు తెలియడంలేదు."

సభలో—"ఏడవలేక నవ్వాలి."

"చెయ్యగలిగితే ఎంతటి పనే చెయ్యొచ్చు తమ్ముడా. నా అభ్యంతరంలేదు. కొంచెం దూరంగా వెళ్లి మాత్రం కానీ"

"ఒక్కమాటే ఎద్దుగ చేస్తే ఎల్లా!"

"మహాజనులారా, రామాయణంలో ఇదో చిన్న పిడకలవేట్లాట. ఈనాడు భారతదేశానికి తెల్లవాడు వో అతుకుల బొంత వియ్యపరాలు రవిక ఇచ్చేసరికి అది కాస్తా వియ్యంకుల బిడ్డగా తొడుక్కుని మురుస్తున్నారు. వోమాటు చిత్తరంజన్ దాసు మా గుంటూరు వొచ్చాడు."

జొన్నవిత్తుల జగన్నాథం: "ఆ గుంటూరు మాది కూడాను"

"మన గుంటూరు వొచ్చినప్పుడు ఆయన ఇంగ్లీషులో ఉపన్యాసం చెయ్యడం, నేను తర్జుమా చెయ్యడమూనూ. దాసుగారన్నారు: బెంగాలు భారతదేశంలో ప్రప్రథమంగా స్వాతంత్ర్యదీక్ష వహించిందన్నాడు. నేను తర్జుమా చేశాను. 'మహాజనులారా! దాసుగారేదో కూస్తున్నాడు. వంగదేశం దూసం

కప్పుకోకుండా అడవుల్లో తిరిగే రోజుల్లో ఆంధ్రదేశం మీసాలకి సంపెంగనూనె రాసినసంగతి ఈయన ఎరగడు.' సభవారంతా ఘొల్లున నవ్వారు. దానికి ఇది అర్థంకాలేదు. చెప్పొచ్చేదేమంటే, అసహాయోద్యమం, అహింసా అనే రెండు భావాలూ భారతదేశాని కిచ్చిన వారు ఆంధ్రులు."

"కాలేజీగోడలు దూకడంకూడా."

"ఉట్టి కెగరలేనమ్మ స్వర్గానికెల్లా ఎగురుతుంది! గోడలు దూకితేనేగాని యుద్ధంలో కొండలు దూకడం రాదు. వీటిల్లో తరీఖీయదు చెయ్యడానికే నేను రామనగరంలో రామదండు స్థాపించింది. మళ్లీ దీక్షా సంఘాలు స్థాపించి, ఏకైకనాయకుడి శ్రీముఖంకింద ఆంధ్రులంతా పనిచేస్తే తప్ప ఆంధ్రరాష్ట్రం రాదు. మన్ని శంకరకొండడని ధిక్కరించిన కొక్కిరాయిలంతా ఈనాడు ఏం చేశారు? ఇద్దరు గుజరాతీవాళ్లు దేశాన్ని నాశనం చేశారు: గాంధీ, జిన్నా. ఈ సమరంలో గెలుపొందినది ఎవరు? ముందు బ్రిటిషువారు, తరువాత జిన్నా. అప్రయత్నంగా జిన్నాకి స్వాతంత్ర్యం, సంస్థానాలకి స్వాతంత్ర్యం వొచ్చింది. మొన్నటిదాకా తమతో వూరేగిన సంస్థానప్రజలకి కాంగ్రెసువారిచ్చే సమాధానం ఏమిటి? తాము కడుపులో చల్లకదలకుండా కూచుని, వాళ్ళని యుద్ధం చెయ్యమనడము ద్రోహము! ద్రోహము! కడుపుచించుకుంటే కాళ్ళమీద పడుతుంది. అసలు ఆంధ్రరాష్ట్రం ఇంతవరకూ ఎందుకు రాలేదో అనే విషయంమీద మన ఈడుపుగంటి రాఘవేంద్రరావుగార్ని మాట్లాడమని కోరుతున్నాను."

రాఘవేంద్రరావుగారు చిక్కిపోయి జబ్బుతో వున్నా వారి కంఠస్వరం గంభీరంగా వుంది.

"స్నేహితులారా! నేను ఆంధ్రదేశం విడిచిపెట్టి, మహారాష్ట్రదేశంలో జీవితం గడిపి, ఆ రాష్ట్రానికి సేవచేసే సందర్భంలో కాంగ్రెస్‌తో వివాదానికి వొచ్చినా, నాలో ఆంధ్రాభిమానం చచ్చిపోలేదు. కాంగ్రెసుకి అధికారంలేని రోజులలో గాంధీ టోపీతో గవర్నరు పదవి స్వీకరించిన భారతీయుణ్ణి నేను వొక్కణ్ణే. నా మర్యాదకి లోటు అని తోచినప్పుడు, నా ఆత్మస్వాతంత్ర్యం, నా దేశగౌరవం భంగపడేకాలం వొచ్చిందనుకున్నప్పుడు నా మంత్రి పదవికి నేను ఇరవైనాలుగుగంటలలో రాజీనామా ఇచ్చాను. నేను ఇండియా సెక్రటరీ సలహాదారుగా ఇంగ్లండు వెళ్లేటప్పుడు మద్రాసులో ఆంధ్రమహాసభ వారు నాకు సన్మానంచేశారు. ఆనాడే చెప్పాను— ఆంధ్రోద్యమం నడకలో లోపాలు వున్నాయని. ఆ లోపాలు ఇంగ్లండు వెళ్ళినతర్వాత నాకు మరీ స్పష్టంగా కనబడ్డాయి. అసలు బ్రిటిషు ప్రభుత్వం ముందు ఆంధ్రులసమస్య లేనేలేదు. వెళ్లిన ఒకటి రెండు రాయబారవర్గాలవారూ ఏ ద్వారపాలకుల్నో చూసి వొచ్చేశారు. కొందరు ఆంధ్రమహాసభని ఆశ్రయించి పెద్దపదవులు సాధించి తెనుగుతల్లిని విడిచిపెట్టేశారు. మద్రాసులో మొదటి కాంగ్రెసు మంత్రివర్గం వొచ్చినప్పుడే ఆంధ్రరాష్ట్రం మనకు కూత సమీపంలోకి వొచ్చింది. కాని ఆ తరుణం జారిపోయింది. దానికి కారణం మీ అందరికీ తెలుసును. ఆ కారణం విషయమై విశాఖపట్నం సభలో తర్కవితర్కాలు, పత్రికలలో చర్చలూకూడా మీకు తెలిసిన విషయమే. ఈ విషయం ఎవరు బయటపెట్టేశారా అనే సంగతి చాలామందిని బాధించింది. ఎవరెవరిమీదో అనుమానపడి, ఎవరెవరిచేతో వుత్తరాలు వ్రాయించారు. ఆ సంగతి బయటపెట్టింది నేను. కళ్లారా చూచివున్న సంగతిగనక ఇండియా రాజ్యాంగ ప్రణాళిక తిరగ వ్రాయడానికి ఇండియా కార్యదర్శి ఆఫీసులో వో నివేదిక తయారైంది. ఆ సంఘానికి నేనే అధ్యక్షుణ్ణి. అందులో ఇతర రాష్ట్రాలతోపాటు ఆంధ్రరాష్ట్రంకూడా రావాలని వ్రాయించాను. నాకు చూసేగా భారతీయసమస్య ఇకమీద భాషాసమస్యగా మారుతుంది. ముఖ్యంగా, మద్రాసు, బొంబాయి, మధ్యరాష్ట్రాలలో ఈ సమస్య తీవరిస్తుంది. ఇకనైనా ఆంధ్రులంతా ఏకమై ప్రయత్నిస్తే తప్ప ఇప్పుడు కూడా రాష్ట్రసాధన సామాన్యంకాదు. ఒరిస్సా ప్రజలు, కాంగ్రెసుతో పనిచేసినా, సైమనుకమీషను వొచ్చినప్పుడు తమ కేసు చెప్పుకున్నారు. ఇండియా ఆఫీసుని టెలిగ్రాములతో వూదరకొట్టి, తమ ఆశయం నెరవేర్చుకున్నారు. మరి మనమో? అధికారంలోకి వెళ్ళగానే రాష్ట్రంసంగతి మరిచిపోయాం. మంత్రులైనవారికి ఈ చిన్న రాష్ట్రం ఎందు కనిపిస్తుంది. ఈ సంకుచితభావాలవల్ల, స్వార్థంవల్ల, కాంగ్రెసుకి మనం వూడిగం చెయ్యడంవల్ల ఆంధ్రరాష్ట్రం ఈనాటికీకూడా రాలేదు. ఈ భావాలే నిలిస్తే ఇక ముందూ రాదు."

సభలో : షేం! షేం!

ఇంతలో సర్ బయ్యా నరసింహేశ్వర శర్మగారు లేచి నుంచున్నారు.

"మహాజనులారా, బాపట్లలో జరిగిన ఆంధ్ర మహాసభలో ప్రప్రథమంగా ఆంధ్రరాష్ట్ర తీర్మానం ఆమోదించబడింది. ఈ సభకి అధ్యక్షత వహించే మహాభాగ్యం నాకు లభించింది. ఆనాటి నా వాంఛ, ఇన్నాళ్లుగా నా మాతృదేశపు వాంఛ ఇంకా తీరని కోరికగానే వుండిపోయింది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంలో పెద్దలంతా తమ బిరుదావళి విడిచిపెడుతున్నారు. వారితో నేను ఏకీభవించి నా బిరుదావళి కూడా ఇంతటితో వొదిలేస్తున్నాను."

సర్ చిర్రావూరి చింతామణిగారు, రావు బహద్దరు తాడిపత్రి రాఘవాచార్యులవారు, రావు సాహెబు గిడుగు రామమూర్తిగారు, ఇత్యాదులు చాలామంది తమ తమ బిరుదావళి విడిచిపెట్టేశారు.

అప్పుడు జొన్నవిత్తుల జగన్నాథంగారి ముతా లేచి "ఈ సభలో ఆంధ్రరాష్ట్ర తీర్మానం ప్రతిపాదించి ఆమోదించా"లన్నారు.

ఆ సమయంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు లేచి నుంచున్నారు. సభవారంతా నిశ్శబ్దంగా వున్నారు.

"ఆర్యులారా! మనంఅంతా ఆంధ్రులం అన్న విషయం మరిచిపోలేకపోవడం సహజమే. మానవ ప్రకృతి పూర్వజన్మ పరిపాకముమీదనే ఆధారపడుచున్నది. కాని, మనము భారతీయులము కూడ నన్న విషయము మరచిపోరానిది. తత్కారణముగా ఈ సభవారు ఆమోదించబోవు తీర్మానము వర్తమానకాల పరిస్థితులకు అనుగుణ్యముగా నుండవలెనను సంగతి సభవారు మరచి పోరానిది. భారతదేశస్వాతంత్ర్యము మనకు ముదావహ కారణ మనువిషయము ఈ సభా సమావేశమునందే గోచర మగుచున్నది. మహాత్ముని నాయకత్వముక్రింద యావదాంధ్రభూమి కూడి దేశ చరిత్రలో స్వర్ణపత్రము నలంకరించినది. అటువంటి చరిత్ర ఈనాడు మనము కళంకపరచరా దనువిషయము విబుధులకు విదితమే. సత్వరాంధ్రరాష్ట్ర సాక్షాత్కారము కాకపోవుట యావదాంధ్రులకూ విచారకరమైన విషయము. దీనికి లోటుపాట్లు మనలో లేక పోలేదు. కాని, భారత స్వాతంత్ర్య సమరములో నెటువంటి దీక్షతో ఆంధ్ర వీరులు ప్రవర్తించినారో, అట్టిదీక్షతోనే ఇకమీదఆంధ్రరాష్ట్రసాధనకొరకు ప్రయత్నించినచో ఆంధ్రరాష్ట్రము సాక్షాత్కారము కాగలదు. కాని, ఏది సాధించవలసినను, ప్రజ అర్హత సాధించవలసియున్నది. ఆ అర్హత మన స్వభావములో పరిణామము కలిగినప్పుడే రాగలదు. ఆంధ్రదేశ స్వభావము, ఆంధ్రప్రజ స్వభావమూ, ఆంధ్రనాయక స్వభావము మారవలసియున్నది. కేవల భౌతికదృష్టితో రాజకీయ విషయములు పరిశీలించినచో నిందులోనిసూక్ష్మము గ్రహింపరానిది. నైతిక దృష్టితో, లోకకల్యాణము కొరకు సాధనచేయు ప్రజానాయకులూ, ప్రజలే ధన్యాత్ములు. తాము చేయుకార్యములో స్వార్థచింతలేక, సంపూర్ణ విశ్వాసముతో పనిచేయువారికే కార్యసాఫల్యము కలుగును. వ్యక్తికివలెనే దేశమునకుకూడ ఈ నైతికదృష్టి యవసరమను విషయము వర్తమానకాల పరిస్థితులవలన విశదమగుచున్నది. ప్రజాస్వభావము మారినప్పుడే దేశ స్వభావము మారుట ప్రకృతిధర్మము. ప్రజకు నైతిక దృష్టి యలవడిననాడే ఆత్మ సాక్షాత్కారమగును. ఆంధ్రప్రజకు, ఆంధ్రదేశమునకూకూడ ఆత్మ సాక్షాత్కారమగును గాక!"

ముట్నూరి ఆదినారాయణయ్యగారు: "ఆర్యులారా, నేను దేశోద్ధారకులవాదన బలపరుస్తున్నాను. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినందుకు మనకు సంతోషమే. కాని ఆంధ్రరాష్ట్రము రానందుకు విచారము. ఈ రెండు అంశములూ విశద పరుస్తూ, సభవారు తీర్మానం ఆమోదించవలెనని నా ప్రార్థన. బాపట్ల మహాసభలో తీర్మానం ప్రతిపాదించింది నేను. ఇక్కడ కూడా మీ అనుమతితో ఈ తీర్మానం ప్రతిపాదిస్తున్నాను—

'స్వర్గలోకవాసులైన ఆంధ్రులు శాలి వాహన శక సర్వజిత్తునామ సంవత్సర చతుర్దశి శుక్రవారం ఉదయం సమావేశమై భారతదేశానికి స్వాతంత్ర్యం లభించినందుకు వారి ఆనందం వెల్లడిచేయుచూ, పరమేశ్వరుడికి ధన్యవాదాలు అర్పిస్తున్నారు.

భారతదేశ స్వాతంత్ర్యంతో పాటుగానే ఆంధ్ర రాష్ట్రంకూడా రానందుకు సభవారు విచారము తెలియచేయుచున్నారు.

ఈ సందర్భంలో ఆంధ్రనాయకులన్నీ, భారతీయ నాయకులన్నీ సత్వరాంధ్ర రాష్ట్రనిర్మాణము కొరకు సహాయపడవలసినదని కోరుతున్నారు.'

రాజా కొచ్చెర్లకోట వెంకటకృష్ణరావుగారు తీర్మానంబలపరిచారు. ఇతరులెందరో ఉపన్యసించిన తర్వాతతీర్మానం సభవారు ఏకగ్రీవంగా ఆమోదించారు."

అంటూనే నారదుడు వీణవాయించుకుంటూ ఎగిరి పోయాడు.

కళ్లు తెరిచేసరికి సూర్యుడు సూటిగా పొడుస్తున్నాడు.

# కళాపూర్ణోదయము : కృష్ణరాయలు

*

= శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ =

కవులు తమ కావ్యములలోని కథానాయకులయందు తమ కృతిపతులను ప్రతిఫలింపజేయుట యొక యాచారము. ఇది నన్నయనాటినుండి యనుక్రమముగా వచ్చుచున్నదే గాని నేడు క్రొత్తగా వెలసినది కాదు. ఆస్తీకుడు సర్పయాగనివారణమునకు జనమేజయుని స్తుతించిన పద్యములు కొంచె మించుమించుగా రాజరాజనరేంద్రునకు నన్వయించును. ఇక్కడనే కాదు, భారతమున నన్నయ యేరాజును వర్ణించినను రాజరాజతని దృష్టిని దాటిపోలేదు. అందుకనియే యాతడాతని "నాదిరాజనిభు"డని చెప్పినాడు. ధర్మరాజు రాజ్యము చేయుచుండగా నర్జునుడు తీర్థయాత్ర కేగెను. అతడు వేంగీదేశమును దర్శించినట్లు మూలమున లేకున్నను నన్నయ కల్పించినాడు. ఆ వేంగీదేశ సౌభాగ్యవర్ణనము రాజరాజపరిపాలనావిశేషమును ప్రధానముచేసికొని చేసినదియే. ఇట్టిపనిని తిక్కనయు జేసినాడు. రాజరాజు చంద్రవంశజుడని నన్నయ చెప్పగా, మనుమసిద్ధి శ్రీరామవంశ్యుడని నిర్వచనోత్తర రామాయణమున తిక్కన చెప్పుటలో గల విశేష మిట్టిదని గ్రహింపవచ్చును. ఇట్లు కృతిపతులు కావ్యనాయకులందు ప్రతిఫలించుట సమగ్రము కానక్కఱలేదు. మీఁదుమిక్కిలి యది రసాభాసముకూడ నగును. కావ్యమునకు వ్యంగ్యమే ప్రాణము కావున నాయకకథలచే, వర్ణనలచే కృతిపతుల చరిత్రలు సూచితములగుట విరుద్ధము కాదు. అది మిక్కిలి రసావహము.

ఇక తిమ్మకవి పారిజాతాపహరణములోని సత్యాకృష్ణుల ప్రణయకలహకథాప్రపంచము తిరుమలదేవీకృష్ణరాయల ప్రణయకలహము దిద్దుటకు వెలసిన దను జనశ్రుతి ప్రసిద్ధము. మనుచరిత్రకథయందుగూడ రాయల చరితము కొంత స్ఫురించుచున్నది. "హితుడు, చతుర వచోనిధి, అతులపురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుడు" నగు నాంధ్రకవితాపితామహుని కావ్యమున నిట్లు కృతిపతిచరిత్ర కొంత సూచితమగుటలో నాశ్చర్యము కాని, విరోధము కాని పొసగదు. అది సహజమై రమణీయమగుచున్నది. స్వరోచి వేశ్యానందనుడు. రాక్షసరూపమున దన పుత్రికను బీడించుచున్న గంధర్వరాజును జయించి వాని రాక్షసత్వమును దొలగించి వాని ప్రార్థనమున నతని కుమారికం బెండ్లియాడెను. రాయలును వేశ్యానందను డను ప్రతీతి కలదుగదా. అతడును గజపతిని జయించి యతని కూతురగు నన్నపూర్ణాదేవిని బెండ్లియాడెను. ఇందు స్వరోచి వేటయంతయు రాయల వేటయే. రాయలతోగూడ నేగి తాను స్వయముగా జూచినదానినే పెద్దన యట్లు వర్ణించినాడు. రాయలు పెద్దనను అతులపురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుడ వని చెప్పుటలోనే యీ విశేషము సూచితమగుచున్నది. విజయవిలాసమున వేంకటకవి కృతిపతి, తన ప్రభువు నగు రఘునాథరాయల నెట్లు స్మరింపజేసినాడో చదువరులు తెలియుదురు. వేయేల, యీ యాచారము మిక్కిలి ముదురుటచేతనే కేవల శృంగారరసలోలులు కావ్యపతులను కావ్యములు కేవలానుకరణములని, రసహీనములని విమర్శలకు దావొసగినవి.

ప్రకృతము కళాపూర్ణోదయమున కవియు, కృతిభర్తయు నెంతవఱకు ప్రతిఫలించిరో పరిశీలింతము. దీనిని పూర్వకథ, యుత్తరకథ యని రెండుగా గ్రహింపవలెను. పూర్వకథ మణికంధరచరిత్రము. ఉత్తరకథ

కళాపూర్ణ చరిత్రము. ఈ కళాపూర్ణ మహారాజు పూర్వము మణికంధరుడను గంధర్వనందనుడు. ఇతడు సరోజ్ఞయాళవనములో సుముఖాసత్తిరూపమున నున్న మణిస్తంభమున కుదయించెను. మదాళసుడను రాజును జయించి వాని కూతురు మధురలాలస నితడు పెండ్లియాడెను. ఆ రాజునొద్ద ప్రథమాగమాగులు నలువురు పండితులు గలరు. వారు మదాళసుని చిత్రశ్లేషకవితచే మెప్పించి యతనికి పురోహితులు, ప్రధానపండితులు నయిరి. వారు తమ రాజుతోపాటు కళాపూర్ణు నాశ్రయించిరి. కళాపూర్ణుడు వారి పాండిత్యవిశేషమును, కవితావిశేషమును విని యచ్చెరువుపడి యంతటితో దృప్తిపడక రసజ్ఞుడగు నారాజు సముచితరీతి గారవించి యాపండితులను "ఇట్టి విచిత్రకవితా మీమాంసకులకు విపుణులతో చూతాము" యని పలికిన వారిలో బ్రథముడు వెంటనే యనులోమవిలోమ క్రమముల నాంధ్రసంస్కృతభాషామయమైన యొక పద్యమును బ్రకృతార్థమును సమన్వయించుచు పాడెను. రాజు వారిని మిక్కిలి గౌరవించెను.

రాఘవపాండవీయకృతి స్వీకర్తయగు నాకుబీటి తిమ్మభూపాలునకు, నంద్యాల కృష్ణరాయలకు గల సంబంధ మెట్టిదో తెలియదు. అది చరిత్రకారులు నిర్ణయింపవలసినదే. కాని వారిరువురును గర్నూలుమండలములో నివాసులే. సూరన యాకుబీటి తిమ్మరాజుచే సత్కృతుడై చిత్రశ్లేషబంధురము రాఘవపాండవీయమును రచించెను. తరువాత కృష్ణరాయల యాస్థానకవియై కళాపూర్ణోదయమును రచించెను. ఇందు కళాపూర్ణునకు, పండితులకు జరిగిన సంవాదము కృష్ణరాయలకును సూరనకును జరిగినట్లుగనే తోచుచున్నది. సరస్వతీచతుర్ముఖుల శృంగారకథ శ్లేషమూలమయ్యు నది కేవలము సంస్కృతపదములతో నిండినది. రాఘవపాండవీయ మట్టిది కాదు. ఇందును మొదటిపద్య మొక యర్థమున నచ్చతెనుగును, వేఱొక యర్థమున శుద్ధసంస్కృతము నయియున్నది. రెండవది యనులోమమున దెనుగును, విలోమమున సంస్కృతమును గా రచింపబడినది. కావున నీ కవిప్రభువుల యీ సంవాదము సంభావ్యము, రసావహము ననుట సాహసము గాదు.

జన్మజనకముల కభేదము ప్రసిద్ధము. కవికి, కవితకు నటులనే భేదము లేదు. కవి తాను కావ్యరూపమున గోచరు డగుచున్నాడు. అనగా కావ్యము కవిస్వరూపమే యన్నమాట. కొన్ని కావ్యములు కవినామముచేతనే వ్యవహరింపబడుచున్నవి. భారవి, మురారి మున్నగున విందులకు నిదర్శనములు. బ్రహ్మలోకమున నున్న కవి(చిలుక) కలభాషిణియై జనించెను. ఈ కవి సామాన్యమైనది గాదు. సృష్టికర్తల ప్రణయకథల లోతుపాతులను మూలముట్టుగ నెఱిగినది. సరస్వతి పెంపగా పెరిగి యామెవలన సకలవిద్యల నారితేరినది. ఒకప్పు డామె శాపమునకు గురియైనను లోకపితామహుని యనుగ్రహమున, నా శపింపబడుటయు దీనికి పంభోయి పూలవాన్వ బడినట్లయినది. ఈ కవియే (చిలుక) కలభాషిణియై, చివరకు మధురలాలసయైనది. సూరన దన కవిత్వమును గలభాషిణి, మధురలాలస యని యిట్లు విశదపఱచినాడు. ఈ మధురలాలస తన పెనిమిటియగు కళాపూర్ణునకు నతడు మణికంధరుడుగా నున్నప్పుడు చెప్పిన లక్ష్మీనారాయణ సంవాదము నతని కోరికపై మణిప్రభావమున విశదముగా వినుపించి చివరకు (కళా. ౮ ఆ. ౨౫౬ పద్య) "అధవ దీనిపూర్వజన్మ విరచిత లక్ష్మీనారాయణ సంవాద కథాప్రకారంబు దేవరప్రశ్న నిమిత్తంబున నిశ్శ్రేయస సులభోపాయంబు దొరకె నేడు సుదినంబయ్యె మదీయ జన్మంబు సఫలంబయ్యె"నని పలికినది. ఈ మాటలను కవితానాయిక, లేక కవి కృతిపతియగు కృష్ణరాయలతో నన్నట్లు గ్రహింపవలెను. సూరన తన కృతిపతియగు రాయల యభీష్టమునకై యారవ యాశ్వాసమున మధురలాలసయావనప్రాప్తి మొదలుగా గ్రంథమును పెంచినాడు. కొందఱు విమర్శకు లిది నీరసమని వెక్కిరించిరి. కాని కవికి కృతిపతిపరాక్రమాదివర్ణనములతో పాటు శృంగారాదివర్ణనము నిట గొంత చేయక తప్పినది గాదు. రాయలకోరికపై నుత్తరకథను నిర్మింపవలసి యది రమణీయముగ నుండుటకై యుత్తరకథానాయకుని పూర్వజన్మవృత్త మగునట్లుగ సూరన పూర్వకథ నపూర్వాద్భుతవృత్తములతో సరసముగ, సహజముగ నుండునట్లు నిర్మించినాడు. ఇట్టి యభిప్రాయ ముండుటచేతనే

సూరన, యెప్పుడో జరిగి యెచ్చటనో చెప్పవలసిన లక్ష్మీనారాయణసంవాదమును గ్రంథాంతమున చేర్చినాడు. దీనికి గ్రంథపీఠికయు కొంత దోడ్పడుచున్నది. రాయలు సూరకవిని రప్పించి యతని ప్రశంసించుచు నిట్లని నాడు:

"నీచే నొక్క మహాప్రబంధము కడు
న్నిర్నిద్రరసారసశ్రీ
లాచిత్రమ్ముగ గాని నోయనఘ వా
లాయమ్ము చేయించుకో
మాచిత్తమ్మున వేడ్క యున్నయది నీ
మాధుర్యస్ఫూర్తి సోర్యరువా
గై వ్రచ్చిలిన్ సఫలమ్ము సేయుము సుధీ
వర్గమ్ము లోహో యనన్"

"ఇట ముం ద్దారదసంహితాదికృతుల్
వింపొందగా నెక్కన
ర్చుట విస్తారము చెప్పనేల యవి సం
స్తుత్యోక్తియశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి క
ర్తృత్వమ్మే రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీక చెల్లె నది భా
షా కావ్యమున్ జేయుగా."

నీవు నాకు నొక కావ్యము నంకితముసేయుమనక, నీచేత కావ్యము చేయించుకో వేడ్కయున్నదను కృతిపతిమాటలోని సారస్య మూహించినచో పయినిపద్య మంతయు యథార్థమని తోపకమానదు.





స్వ రా జ్య నాం ది

ఆగస్టు 15.వ తేదీ శుభఘడియల్లో, స్వతంత్ర భారత ప్రథమ ప్రధానియైన పండిత నెహ్రూగారు స్వరాజ్య నాందిగా, గవర్నరు జనరల్ మౌంటుబాటన్ సమక్షంలో ప్రమాణ స్వీకారం చేసినప్పటి చారిత్రక దృశ్యము.

# సూర్యుడు - సూర్యకాంతి - - -
# - - కాంతి కిరణముల యురువడి



— శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు —



"ఈ నాటి వైజ్ఞానికులకు తెలిసిన వైజ్ఞానిక విషయము లనేకములు మన పూర్వులకు తెలిసియున్నవి—అను నీయంశమునుగూర్చి మీరు తలుచుగా వ్రాయుచున్నారు. స్థూలసూక్ష్మమూలములైన కొలతలు కుశలతముగా చేసి శాస్త్రీయమైన మానముల పద్ధతిని (Scientific measurements) పరిమాణములు నిర్ణయింపగలిగినగాని మన పూర్వుల వ్రాతలు 'Scientific' వైజ్ఞానిక శాస్త్రసమ్మతము లనుటకు వీలులేదు. అట్టి మానములతో కొలిచి సాధించిన యంకెలు మన పూర్వగ్రంథములందు కలవా ? కలవని ఋజువుచేయగలరా ?" అని ఒకానొక ఉన్నతోద్యోగి మా ప్రసంగములో నన్ను సవాలుచేసెను. "ఆహా ! కలవు, నిస్సంశయముగా కలవు. ఏలాగు సాధించిరో వివరములు మనవిచేయజాలనుకాని, మన పూర్వులు పురాణాదులలో తెలుపు అంకెలు, పరిమాణములు శాస్త్రమానములతో కొలిచి నిరూపించి నిర్దుష్టముగా ప్రకటించినవేగాని కేవలకల్పితములు కా"వని విన్నవించితిని. ఈ వ్యాసములో సూర్యగోళపరిమాణమును గూర్చియు, సూర్యకాంతినిగూర్చియు, ఆ కాంతికిరణములు ఏ యురువడిలో, ఏ వేగముతో విశ్వమున వ్యాపించుచున్నవో ఆ వేగనిర్ణయమునుగూర్చియు, దేశకాలముల అవినాభావ సంబంధమునుగూర్చియు సంగ్రహముగా ప్రస్తావింతము.

## యోజనము

ఏ రేని రెండు ప్రదేశములకున్యగా ఇన్ని యోజనముల దూరము గలదని సాధారణముగా మన పురాణములలో నుటంకింపబడుచున్నది. యోజన మనగా నాలుగు క్రోసులు. క్రోసనగా రెండువేల బారలు. బార అనగా ఆరడుగులు. దీనినే ఇంగ్లీషులో Fathom అందురు. 'ఫాదొ'మనునది ఇంగ్లీషు నావికాలెక్కలలోను, ఇతర లెక్కలలోనుకూడ ఆరడుగుల మేర; రెండు గజముల నిడివి. ఇదే మన బార. ఎన్ని ఇంగ్లీషుమైళ్ళ దూరము మన పూర్వుల యోజన మగునో మనమిప్పుడు నిర్ణయించుకోవలెను. బార రెండు గజములు. ౧౭౬౦ గజములు మైలు. ఒకయోజన మనగా నాలుగు క్రోసులు. క్రోసు నాలుగువేల గజములు. కాబట్టి గణితరీత్యా యోజనమనగా $\frac{౪౦౦౦ \times ౪}{౧౭౬౦} = ౯\frac{౧}{౧౧}$ మైళ్ళు. అనగా తొమ్మిది ఇంగ్లీషుమైళ్ళ ౧౬౦ గజములు మన పూర్వుల యోజనమునకు సరియగును.

## సూర్యగోళపు వ్యాసము
## (Diameter of the Sun)

శ్రీనాథుడు తెనిగించిన కాశీఖండము తృతీయాశ్వాసము ౧౬౨ పద్యములో భానుబింబము యొక్క వ్యాసము సరిగా నిట్లు వర్ణింపబడినది.

"ఆకాశమధ్యస్థమగు భానుబింబంబు
విను లక్షయోజన విస్తృతంబు."

ఇది సందేహముల కాస్పదము కాదగని స్పష్టమయిన సంఖ్య. ఈ సంఖ్యను $౯\frac{౧}{౧౧}$ చే గుణించగా ఇంగ్లీషులో సూర్యవ్యాసవిస్తీర్ణము విస్పష్టమగుచున్నది. అట్లు చేయగా తొమ్మిదిలక్షల తొమ్మిదివేల తొంభయిమైళ్ళగుచున్నది. పాశ్చాత్యుల లెక్కలవల్ల

కూడ సూర్యమండలవ్యాసము ఇంచుమించుగా తొమ్మిది లక్షల మైళ్ళనియే తెలియుచున్నది.

### శనిగ్రహవ్యాసము

విశేషించి శని సూర్యపుత్రుడు. అనగా సూర్య గోళములో కొంతభాగము తీసివేయగా అట్లు ప్రత్యేకింపబడిన భాగము శనిగ్రహ మయ్యెనని జ్యోతిశ్శాస్త్రిగము. ఈ తీసివేయబడినది అష్టాంశమని విష్ణుపురాణము; ద్వాదశాంశమని మార్కండేయ పురాణము. ఏది నిజము ? వేరు వేరు దృష్టులతో చూచినయెడల రెండును నిజమే. ఏమనగా శనిగ్రహముచుట్టును బండిచక్రము వంటి పెద్ద యుంగరము చుట్టుకొనియున్నది. ఇట్టి విచిత్రపరివేష్టనము గల గ్రహముగాని, నక్షత్రముగాని ఖగోళమంతటిలో మరొకటి కానరాదు. ఈ చక్రములో సహా శనివ్యాసము లక్షపదివేలమైళ్ళకు మించును. అప్పుడు శని సూర్యునిలో అష్టాంశ మనవచ్చును. ఈ చక్రమును మినహాయించిపైచిన పక్షమున కేవల శని గోళవ్యాసము డెబ్బదిరైదువేల మైళ్ళు. ఇది సూర్య మండలవ్యాసములో సరిగా ద్వాదశాంశ మగుచున్నది. పైసెన్నో కవికల్పన లున్నను, అసలు కథ గణితము పైనే ఆధారపడియున్నదని తెలిసికోవలెను.

### భూగోళము-సూర్యగోళము

భూగోళపు చుట్టుకొలత ఇరువదిరైదువేల మైళ్లు. సూర్యగోళపు చుట్టుకొలత (వ్యాసమునకు మూడురెట్లు పైగా నుండును.) ఇరువదిరైదులక్షల పైమాట. గణిత రీత్యా పదమూడులక్షల భూగోళములైనగాని సూర్య గోళపరిమాణమునకు సరిరావు. ఇటువంటి మహనీయ పరిమాణముతో వెలుగొందు సూర్యుడు మన భూమి చుట్టు తిరుగుచున్నాడా ? లేదు. భూమియే సూర్యుని చుట్టు తిరుగుచున్నది. అయినను సూర్యుడే ఉదయించి అస్తమించి భూప్రదక్షిణము చేయుచున్నట్లు మనకు కనబడుచున్నాడు. ఇట్లగపడుట యొక భ్రమ. రైలు బండిలో కూర్చుని, తలుపులు వేసికొని యుండియుండి ఒకమారు తలుపుతెరచిచూడగా రోడ్డుప్రక్క మనుష్యులు, పసువులు, చెట్లు, చేమలు, స్టేషనులు లోనగు దృశ్యములన్నియు నఖండత్వరతో పారిపోవుచున్నట్లు కనబడును. రైలులో మనము ప్రయాణము చేయుచున్నాముకాని చెట్లు, చేమలు, స్టేషనులు కదలుటలేదు. అవి కదలిపోవుచున్న వనుట ఎట్టి భ్రమ యగునో సూర్యుడు భూమిచుట్టు తిరుగుటకూడ అట్టి భ్రమయే. కష్టగ్రాహ్యములైన యిట్టి శాస్త్రాంశములలో జన సామాన్యమును కలవరపెట్టుట మన పూర్వుల పద్ధతి కాదు. కనుకనే గణితపు గొడవల జోలికి పోక చంద్రునికి ఇరువదియేడుగురు భార్యలని, ఒక్కొక్క రాత్రి ఒక్కొక్క భార్యతో నతడు గడుపుచుండునని జన సామాన్యమునకు సులభముగా తెలియజెప్పినారు. ఈ వేళ రోహిణీనక్షత్రము, అనగా ఈరాత్రి చంద్రుడు రోహిణిచెంత కనబడునన్న మాట. సూర్యగోళవిషయములో సూర్యునిచుట్టు తిరుగునది భూమియేయైనను, భూమిని మధ్యస్థము చేసి సూర్యుడే భూమిచుట్టు తిరుగుననుట యథార్థము కాకపోయినను సామాన్యజనుల గ్రహణసౌలభ్యముకొఱకు సూర్యుడే భూప్రదక్షిణము చేయుచున్నట్లు చెప్పుట పౌరాణిక సంప్రదాయ సిద్ధమైనది. ఈ శాస్త్రవిషయములను చక్కగా సంగ్రహించి చమత్కరించి చెప్పుట కవిసంప్రదాయమై యున్నది. భోజమహారాజును సందర్శింపవచ్చిన కవి కుటుంబములో వృద్ధకవయిత్రి "క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే" అను సమస్యను ఎంత చక్కగా సూర్యపరముగా చెప్పి సమస్యాపూర్తి చేసినదో ఈ సందర్భమున మనము స్మరించుట మన యీ వ్యాసమునకు మిక్కిలి అవసరమైయున్నది.

" రథస్యైకం చక్రం
భుజగయమితా స్సప్త తురగాః
నిరాలంబో మార్గః
చరణవికల స్సారథి రపి,
రవి ర్యాత్యేవాంతం
ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధి స్సత్త్వే
భవతి మహతాం నోపకరణే"

—"సూర్యుని రథమునకు చక్రము ఒకటే. గుఱ్ఱములు ఏడు: ఈగుఱ్ఱములు పాములచే రథమునకు కట్టబడినవి. మార్గము మెటల్ రోడ్డు కాదు. కేవలము

నిరాధారమైనది. సారథి అనూరుడు—తొడలు, కాళ్లు లేనివాడు. అయినా ఒక్కక్షణమైనా ఆగకుండా, ఇటువంటి (పనికిమాలిన) సజ్జుతోనే సూర్యుడు ప్రతి దినమూ అపారాకాశంమీద తన ప్రయాణం సాగిస్తూనే ఉన్నాడు. మహాత్ములైనవారు ఉన్న సాధనములనే చేర్పుగా వాడుకొని కార్యసిద్ధి పొందుతారు. (చేతకాని వాళ్లు "అబ్బే! యిది బాగులేదు, అది బాగులేదు" అని రొంచుకుంటూ సణుగుగొణుగులతో కార్యహాని చేస్తారు)" అని భావము.

ఇందులో ప్రతిమాటకు గంభీరమైన శాస్త్రార్థము ఉన్నది. నేటి వైజ్ఞానికులకు ఈ భావములు శిరోధార్యములు. ఒక్కొక్కటే పరిశీలింతము.

## రథస్యైకం చక్రం

సూర్యుని రథము సంవత్సరాత్మకమైన ఒకటే చక్రముకలది. దీనికి ఉత్తరాయణ దక్షిణాయనములను అయనభేదములు రెండు. ఆరు ఋతువులు. పండ్రెండు రాసులు. ౩౬౦ పగళ్లు. ౩౬౦ రాత్రులు. ఒక పగలు, ఒకరాత్రి కలిసి ఒకదినము. సంవత్సరములో మున్నూట అరువది దినములు. దినమునకు ఒక డిగ్రీ—ఒక భాగ చొప్పున ఈ చక్రమునకు మున్నూటఅరువది డిగ్రీలు. ఈ చక్రము ననుసరించియే తక్కిన చక్ర (Circles) ములకు రేఖాగణితరీత్యాకూడా మున్నూటఅరువది డిగ్రీలు ఏర్పడినవి. ఈ చక్రములో రెండు వ్యాసములు ఒకనిదానిపై నొకటి సమకోణములుగా నిలిచినపుడు చక్రమధ్యమున (Centre) నాభిస్థానమునందు నాలుగు సరికోణములు ఏర్పడుచున్నవి. వీటిని పడమటివారు Right Angles అనుచున్నారు. ఒక్కొక్క సరికోణములో తొంబదిడిగ్రీలు. ఇటువంటి రేఖాగణిత, గణితశాస్త్రముల యభివృద్ధికి మొదట భిక్ష పెట్టిన మహనీయుడు దీర్ఘతము డను వేదఋషి. ఇతడు ఋగ్వేదములో నొంపిదియవమండలమునందలి నూటఅరువదినాలుగవ సూక్తములో తెలిపిన శాస్త్రీ జ్యోతిశ్శాస్త్రవిషయములు సరిగా అర్థము చేసికొనుటకు కొన్ని సంవత్సరముల జిజ్ఞాస అవసరము.

సౌరమాన చాంద్రమానములలో ఈ ౩౬౦ దినముల సంవత్సరమునకు చేయవలసిన సవరణలు అధికమాస క్షయమాసాదులైన సాధనములవలన జరుగుచున్నవి.

## సప్త తురగములు

సూర్యుని రథమునకు ఏడు గుఱ్ఱములు: ఇవి (Symbolic) సంజ్ఞికములుగాని నిజముగా గుఱ్ఱములు గావు. సూర్యుని కిరణములే అతని గుఱ్ఱములు. అవియే సూర్యకాంతిని ప్రతిలోటికిని గొనిపోయి జగద్వ్యాప్తి గావించుచున్నవి. సూర్యకాంతి మామూలుగా తెల్లగా కనబడుచున్నను, అందులో కనీసము ఏడురంగులు ప్రత్యేకింపదగినవి కలవు. గాజుపట్టకము ద్వారా సూర్యకాంతి వెడలినపుడు ఈ రంగులు విభజింపబడి స్వస్వరూపములతో పైకి వెడలుచున్నవి. 'హరివిల్లు' అనబడు ఇంద్రధనుస్సు పొడిచినపుడీ యేడు రంగులను మనము ఆకాశమున స్పష్టముగా చూడగలము. ఈ కారణముచేతనే వేదమునందును, ఆదిత్య హృదయాదిస్తోత్రములందును సూర్యుడు 'సప్తసప్తి' అని చెప్పబడుచున్నాడు.

## భుజగబంధనము

ఈ గుఱ్ఱములు ఇష్టమువచ్చినట్లు పోకుండ పాములచే సూర్యరథమునకు కట్టబడినవి. పాములచే కట్టబడుటలో గొప్ప విశేష మున్నది. పాము సూటిగా సరళరేఖామార్గమున (Straight line) సాగిపోదు. మెలికలు తిరిగిపోవుట పాములక్షణము. మొన్న మొన్నటివరకు సూర్యకిరణములు సరళరేఖామార్గమున పోవునని (Light travels in straight lines) చదువుకొంటిమి. ఇపు డాచదువులు మారినవి. శబ్దము వలెనే వెలుగు, విద్యుత్తుకూడ "తరంగమార్గమున పోవును గాని తిన్నగా సరళరేఖామార్గమున పోవు" అని ఇటీవల నిర్ధారణ కాబడినది. ఆయాతరంగముల కెరటపు నిడివినిబట్టి ఎన్నెన్నో ప్రయోజనములు సాధింపబడుచున్నవి. కెరటపు నిడివిని పడమటివారు Wave-length ('వేవ్-లెంగ్త్')అని వ్యవహరించుచున్నారు. రెండు కెరటముల శిఖరముల మధ్య దూరము కెరటపు నిడివి యగును. రేడియో కెరటముల నందుకొనుటలో ఈ నిడివి సరిగా తెలిసికొని యంత్రము నాయత్తము చేసికొనినగాని అడంగునుండి వెడలు తరంగములను గ్రహించుట సాధ్యముగాదు. రేడియో విద్యుత్తరంగ

ములను, కాంతితరంగములను ఒకటే స్వభావము కలవని యిటీవల వైజ్ఞానికులు స్పష్టముగా నిర్ధారణ చేసినారు. ఈ విధముగా నిన్న మొన్నటివరకు మన మెరుగజాలకపోయిన తరంగగమన విశేషము సూర్యకిరణములకు కలదని మన పూర్వులేనాడో యెరుగుదురు. ఎటేగియుండి పాము మెలికలచే కట్టబడినవని వానికి సూర్యునితో సంబంధ మేర్పఱచినారు. అంతవఱకు కేవలము Nonsense గా పరిహసింపబడిన భుజగబంధనసంజ్ఞికమైన తరంగగమనము ఇప్పుడు చక్కని Sense గలదై (Symbolic) సంజ్ఞికముగా నేటి భౌతికశాస్త్రజ్ఞుల తరంగగమన విశేషములకు మార్గదర్శకమై నీటి విశిష్టత బహుకాలముక్రిందనే సూచింపజాలియుండెను. పూర్వగ్రంథములను సమర్థులగువారు తఱచినకొలది ఇంకనెన్నెన్ని విషయములు కాలగర్భమునుండి బయల్పడగలవో గదా ?

## అనూరుడు

వినతపుత్రుడు. వినత పక్షులకు తల్లి. ఈమెకు రెండు గ్రుడ్లు జన్మించినవి. ఏనాటికిని గ్రుడ్లు బ్రద్దలై పిల్లలు పైకి రామికి చింతించి, ఆమె నిదానములేక మొదటి గ్రుడ్డును బలవంతముగా బ్రద్దలుచేయగా, తొడలు, కాళ్ళు లేక ఇతడుద్భవించినాడని పురాణగాథ. కాబట్టి అనూరుడైనాడు. మరెందుకును పనికిరాక సూర్యరథసారథ్యమునకు నియోజితుడైనాడు. మనకు ఎదురుగా వచ్చు రథములో రథికునికంటె సారథి ముందగపడుట సహజము. అనూరుడు కనబడుట సూర్యోదయమునకుముందు 'Line clear'—ఇదుగో రైలుబండి రాగలదన్నట్లు 'ఇదుగో సూర్యుడు ఉదయింపనైయున్నా'డని సారథిని చూడగానే మనము నిశ్చయించుకోగలము. సూర్యుడు ఉదయింపక ముందు తూర్పున నెఱ్ఱని రంగు కనబడును. అదే అరుణోదయము. అరుణోదయము సూర్యసారథియైన అనూరూదయమే. వర్ణనచమత్కారము !

---

* ద్రవ్యశేశార్థములో నుపయోగించు పరమాణుపదము కాలశేశార్థములో కూడ సాభిప్రాయముగా ప్రయోగింపబడినది. భాగవతకర్త అట్లు వ్రాయుటలో గొప్ప విశేషమున్నది. అది ఈ వ్యాసాంతమున చర్చింతును.

## సూర్యుని రథము

ఇట్లు చరణవికలుడైన సారథి భుజగనమితములైన సప్తతురగములను తోలుచు ప్రతిదినమును సూర్యుని రథమును నిరాలంబమైన అపారాకాశమార్గమున చుఱుకుగా తోలుచున్నట్లు పైశ్లోకములో రమ్యముగా వర్ణింపబడినది. అంతే.

కాని ఈ తురగముల సంజ్ఞచే వర్ణితములైన సూర్యకిరణములు ఎంత వడిగా పోవుచున్నవో, ఎంతటి వేగముతో (Velocity) ముందుకు సాగిపోగలుగుచున్నవో ఈ చాటువు తెలుపుటలేదు.

కాంతికిరణముల గమనవేగము స్కాందపురాణాంతర్గతమైన కాశీఖండములో స్పష్టముగా తెలుపబడినది. చూ. ౩-౧౭౬. శ్రీనాథుని తెనుగుకాశీఖండము. "నిమేషార్ధమాత్రంబున రెండువేల రెండువందల రెండు యోజనములు"అని అందు ఖండించి వ్రాయబడినది. ఇక్కడ నిమేషమనగా చాలమంది ఇంగ్లీషు (Minute) మినిట్ శబ్దమునకు పర్యాయపదముగా వాడుచున్నారు. అది చాల తప్పు. గొప్ప పొరపాటు. నిమేష మనగా ఇంగ్లీషుమినిట్ కాదు. అయితే నిమేషమనగా ఎంత ప్రమాణము గల కాలమో నిర్ధారణచేసికొనుటకు భాగవతతృతీయస్కంధములో విదురమైత్రేయసంవాదఘట్టమునకు మన మొక్కసారి పోయిరావలెను. చూ. ఆంధ్రభాగవతము ౩-౩౮౫. * ౨ పరమాణువులు ౧ అణువు; ౩ అణువులు ఒక త్రసరేణువు; ౩ త్రసరేణువులు=౧ త్రుటి ; ౧౦౦ త్రుటులు=౧ వేధ; ౩ వేధలు=౧ లవము; ౩ లవములు=౧ నిమేషము. కాబట్టి ౧౬౨౦౦ పరమాణువుల కాలము ఒక నిమేషము. పిమ్మట మార్కండేయపురాణము ౪-౧౫ చూడవలసియున్నది.

౧౫ నిమేషములు ఒక కాష్ఠ;

౩౦ కాష్ఠలు=ఒకకళ

౩౦ కళలు=ఒక ముహూర్తము.

౩౦ ముహూర్తములు=ఒక అహోరాత్రము. ఇంగ్లీషువారి లెక్కను ఒక అహోరాత్రము ౨౪ గంటలు; గంటకు ౬౦ మినిట్లు; మినిటుకు ౬౦

సెకెండ్లు. కాబట్టి, అహోరాత్రము అనగా మొత్తము దినప్రమాణము వారికి, మనకు ఒక్కటేగనుక గణిత రీత్యా—

౩౦ × [illegible] × ౩౦ × ౧౫ నిమేషములు = ౨౪ × ౬౦ × [illegible] సెకెండ్లు. ఒక నిమేషము = ౨౪×౬౦×౬౦ / ౩౦×౩౦×౩౦×౧౫ = ౧౬/౭౫ సెకెండ్లభాగము.

మన పూర్వుల నిమేషకాలము ఇప్పటి ఇంగ్లీషు వారి సెకెండుయొక్క డెబ్బదియైదుపాళ్ళలో ౧౬ పాళ్లుమాత్రమే అగుచున్నది. నిమేషార్ధమనగా పైని చెప్పబడిన ౧౬ పాళ్ళలో సగమే. అనగా ఇంగ్లీషు సెకెండు ౭౫ పాళ్లలో నిమేషార్ధము ఎనిమిది పాళ్లే యగును.

౮ సెకెండ్లకాలములో సూర్యుని కిరణములు ౨౨౦౨ యోజనములు పోవును.

౧ సెకెండు కాలములో సూర్యుని కిరణములు ౨౨౦౨/౮ × ౭౫ యోజనములు.

ఒక యోజన మనగా ౯ ౧/౧౧ ఇంగ్లీషు మైళ్ళని పైని తెలిసికొన్నాముకాబట్టి గణితరీత్యా, ఒక ఇంగ్లీషు సెకెండులో సూర్యకాంతి ౨౨౦౨/౮ × ౭౫/౧౧ × ౧౦౦ = ౨౨౦౨ × ౭౫ × ౨౫/౧౧ = ౧,౮౭,౬౬౮ చిల్లర ఇంగ్లీషు మైళ్ళు గడిచిపోవుచున్నది. ఇందువలన ఏమి తేలుచున్నదనగా, ఇక ఇంగ్లీషు సెకెండులో కాళీఖండములో చెప్పబడిన ప్రకారము లెక్కించగా సూర్యకాంతి ఒకలక్ష ఎనభయి ఏడు వేల ఆరువందల అరవై ఎనిమిదిమైళ్ల త్వరతో వ్యాపించుచున్నదని మన పూర్వులు నిర్ణయించిరి. ఈనాటి ఇంగ్లీషులెక్కల ప్రకారము కాంతికిరణములు ౧,౮౬,౩౨౪ (ఒకలక్ష ఎనభయిఆరువేల మున్నూట ఇరువది నాలుగు) మైళ్ళ చొప్పున వెడలుచున్నదని నిశ్చయించిరి. వెయ్యింటనొక మైలుకు తక్కువ తేడాతో ఆనాడు మన పూర్వులు కాంతికిరణముల యురువడిని సరిగా నిశ్చయింపగలిగిరనుట ఆశ్చర్యకారణము.

## కాలమునకు ద్రవ్యదేశములతో గల అవినాభావ సంబంధము

ఏదేని ఒకవస్తువు (దానినే ద్రవ్యమని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు.) ఉండుటకు కొంత స్థలము కావలయును. అది యాక్రమించు స్థలమును చోటు, ప్రదేశము మొదలగు పదములచే తెలుపుచుందురు. ప్రదేశమునే దేశమని కూడ వ్యవహరింతురు. ద్రవ్యదేశకాలము లొండొంటి నాశ్రయించియున్నవి. దేశము వినా ద్రవ్యము లేదు. కాలము వినా దేశము లేదు. దేశకాలములకు గల అన్యోన్యసంబంధము ఎడతెగనిది-కాబట్టి పామరవ్యవహారములో కూడ దేశకాలములను జమిలిచేసి ప్రశంసించుట సంప్రదాయమైనది. ఇటీవల కొన్ని మొదలైన వైజ్ఞానికోత్తములు భౌతిక గణితాదులలో దేశకాలముల యన్యోన్యసంబంధములను శాస్త్రరీత్యా గమనించి **Space-time factor** లనబడువాని నవినాభావదృష్టితోనే సమన్వయించుకొనుచున్నారు. పాశ్చాత్యులీనాడు గమనించిన యీ దేశకాలముల అన్యోన్యఅవినాభావ సంబంధమును మన పూర్వులు బహుకాలముక్రిందటనే ఎరుగుదురు. ఇందుకు ఉపపత్తి పైని ఉదహరింపబడినది. దేశము వినా ద్రవ్యము లేదు గదా? ద్రవ్యకాలములకు కూడ సంబంధ మవినాభావమే. కాబట్టియే భాగవతకారుడు అప్పటికి కాలములో నూహింపతగినంత సూక్ష్మాంశమును 'పరమాణువు' అని తెల్పినాడు. ద్రవ్యములో కూడ ఊహింప తగినంత సూక్ష్మాంశమును, అనగా ద్రవ్యలేశమును కూడ ఆ 'పరమాణువు' అనియే తెల్పినాడు. ప్రాచీనములోనే కాలలేశమును, ద్రవ్యలేశమును కూడ పరమాణు శబ్దప్రయోగముచేతనే వ్యక్తముచేయుట వానికి గల అవినాభావసంబంధము గుర్తించుటకావున వైజ్ఞానికముగా ఇందొక విశిష్టత గలదని గమనింతము.



# స్వాతంత్ర్య దినము

= శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు =

స్వాతంత్ర్యమధురభావనలోని సౌకుమార్యమ్ము వాసంతచిత్రగతి చూపి
ఎగురు త్రివర్ణమ్ము నీక్షించినంత యుద్రేకమ్ము గ్రీష్మర్తురీతి నడపి
ఆనందవారివాహవ్రాత ప్రౌఢభావేచ్ఛ నవాంభోద ఋతువునట్లు
ప్రతియాహ శోభాతరంగ పౌష్కల్య మేచికొని శరత్కాలచిహ్న మగుచు
మహితకళ్యాణభ్రాంతి హేమంతమగుచు - జీర్ణదాస్యంబుపట్ల శైశిరము నగుచు
సర్వకాల మాంగళ్యశిఖాప్రకాశ-తరుణమయి వచ్చె మాకు! స్వాతంత్ర్యదినము!

వనవాసమున కేగి పదునాలుగేండ్లకు సాగివచ్చిన రామచంద్రునట్లు
బృందావనమ్ముపై నిచ్ఛతో ద్వారవతి వదలి వచ్చు నుపేంద్రునట్లు
మహిత 'నిర్వాణ' సంగ్రహిత నూత్నమతకర్త యగుచు గౌతము రాకవోలె
అవురంగజేబు కారాగారమును దాటివచ్చు ఛత్రపతి శివాజీవోలె
'ఓరుగల్లు' రాజ్యము తారుమారుగాగ - నాంధ్రజనముల రక్షింప నరుగుదెంచు
నుపనిషద్వేది భావనాయోగమట్లు - ధరణిపై నరుదెంచె! స్వాతంత్ర్యదినము!

తొలియీతజున్నుగడ్డల మాధురీరస తీవ్రగతికి కామధేను వగుచు
ప్రత్యూషకాలసౌరభ సన్నిపాత ప్రసాధనమ్మున పారిజాతమగుచు
ప్రత్యగ్రత్యాగ ప్రవర్త్యమాన విచిత్రకృత్యమగుట కల్పవృక్షమగుచు
అధికవిదగ్ధ పుణ్యాంగనాలాలిత్యశ్రీవ్యాలబ్ధగు మాతృదేవి యగుచు
వితతతేజోలతాదీపవిశదసుంద - రాంబరోపేతమగుట సుధాంశువగుచు
సర్వజనులకు నాహ్లాదసమ్మతముగ - ధర్మముద్రల వచ్చె స్వాతంత్ర్యదినము!

'సర్వే జనా స్సుఖ' స్వస్తి బల్కుచు శత్రునైన బూజించు నీయవని యందు
'ఆత్మవ త్సర్వభూతాని' యన్న పరమకరుణాప్త మిట్టి భూఖండమందు
ఉపనిషన్మాధురీ స్నపిత కేదారలక్ష్మీసనాథమగు నీ క్షేత్రమందు
ధర్మమ్ముకై యవతారములు యుగయుగమ్ముల బుట్టు దేశమ్మునందు
'తత్త్వమసి' గాఢవేదాంత ధర్మలలితు - లైన పరమహంసల గన్నయట్టి భూమి
నిత్యహోమప్రసిద్ధ మీ నేలయందు - తరలివచ్చె నిప్పటికి! స్వాతంత్ర్యదినము!

# కళ - మతం

— శ్రీ ఆమంచర్ల గోపాలరావు —

మానవప్రపంచాన వెలసిన చిత్రకళయందు సృష్టి వైచిత్ర్యం అనేకవిధాలు. ఆయావిధాల ఆద్యంతములు, కల్పనారీతులు, శిల్పపద్ధతులు, స్వభావ భావములు ఎంతగా చర్చించినప్పటికీ కళానిజస్వరూపావగాహన దుర్లభంగానే ఉంటుంది. ఎందుకనగా, ఆయావిధానాంతర్య దర్పవ్యూహములందు నడచిన కొలదీ అంతులేని న్యాయములూ, సిద్ధాంతములూ మన కెదురౌతాయి. ఈ సిద్ధాంతన్యాయముల సమన్వయం అనేకసమస్యలకు దారితీసి, చివరకి అంతులేని చర్చలలో మరల దిగడం సంభవిస్తుంది. అయినప్పటికీ ఆధ్యాత్మికదృష్టి, తత్సంబంధితవిజ్ఞానం, తదనుసారిత సంప్రదాయ విశేషాలూ ఎరుక లేకుండా ఆయాప్రాంతములందు వెలసిన చిత్రకళయందలి నిశ్చితగతీ, భావనల నైజం, కల్పనాపరిణతి యందలి పరిభాష తెలిసికొనడం అసాధ్యం. నిజంగా మానవునికి ఆధ్యాత్మిక దృష్టి యతని అంతరాత్మ ఉద్దేశ్యస్వభావాన్ని అనుసరించి యేర్పడుతుంది. సరిగా ఆలోచిస్తే కళకూడ ఆ అంతరాత్మ ఉద్దేశ్యమందే బీజ మందుకొంటుందని స్పష్ట మవుతుంది. నిశ్చయంగా కళ, మతం ఈ రెండూ ఒకే తరుశాఖలే అని చెప్పవచ్చు. ఈ రెండూ ఆంతరంగిక మనఃప్రపంచంనుంచే పోషణ నందుకొంటవి కాని, బాహ్యభౌతిక ప్రపంచంనుంచి ఏమాత్రమూ కాదు.

అందుచేత చిత్రకళయందు రచనావిధానమందలి ఉత్తీర్ణతే పర్యవసానంగా కాని, ప్రకృతియనుకరణ ననుసరించో, లేక షడంగవికాసము ననుసరించో మాత్రమే విమర్శించినయెడల మనం, ఆ చిత్రరచనాంశములనే చర్చించి వర్ణించడ మవుతుంది. అంతేకాని ఆ చిత్తరువుయొక్క అంతరార్థం గమనించి, ఆత్మ విచారం చేయం. కళ కొక మనోహరత నిచ్చి, మహోన్నత కలిగించు నిగూఢరహస్యమును మనం కనుగొనలేము. అపైన ఈ మాయాప్రకృతి కతీతమై కళాకర్త నావరించిన భావభావనల అమరజ్యోతుల నెన్నింటినో మనం వీక్షింపజాలక కోల్పోదుము. అప్పుడు ఉత్తమ కళాకోవిదుని సిద్ధకల్పనలకూ, మూఢవిరచిత వర్ణరేఖల సంకలనములకూ భేదం అట్టే కాంచలేముకూడ. అయినప్పటికీ సౌందర్యోపాసనేచ్ఛ గల విజ్ఞానసంపన్నులెందరో ప్రకృతి భౌతికరీతుల ననుకరించు గతులనే చిత్రకళవిమర్శ లనేకములు సాగించారు. ఇక సామాన్యజనం బాహ్యప్రకృతియనుకరణే చిత్రకళయందు ప్రధానాంశమని భావించి, తదనుసారంగానే చిత్రరచనలను ఆదరించడంలో ఏ విశేషమూ లేదు.

కళకూ, ప్రకృతికీ గల సంబంధబాంధవ్యం ఇదివరకే చాలావరకు చర్చించడమయింది. దీని ఆద్యంతములు సమగ్రంగా అవగాహనం చేసుకోవడం మన పరిశీలనావిమర్శనాశక్తులు, విజ్ఞానపరిమితులమీద చాలవరకు ఆధారపడిఉంటుంది. ఈనాడు మనం చాలవరకు ప్రకృతి బాహ్యరూపములకే అలవాటుపడి, భావనాప్రపంచస్థితినే మరచిపోయినాము. స్థూలదృష్టి గణింపగలిగిన రూపాలనే ఎక్కువగా లెక్కచేసి, కళకూడ ఆధ్యాత్మిక జీవితవిధానంవలె మహదాంతర్య స్వభావానుభావమని పూర్తిగా మరచిపోయినాము. నిజంగా కళగనక మహదాంతర్యవికాసమే కానియెడల, ప్రకృతి బాహ్యసుఖమందు మనం ఎన్నడూ కాంచలేని మహోన్నత సౌందర్యముల నీను అనేకసిద్ధకల్పనలు మన ప్రాచీన చిత్రకళయందు ఉత్పన్నమవుట నిజంగా

అసాధ్యం. ఆ శిల్పము లనేకములు అనేకమైన రూపస్థ భావములను సారూప్యంగా, సజీవంగా, రసవంతంగా ప్రదర్శిస్తూ, భౌతికప్రపంచాతీతమయిన ఆధ్యాత్మిక సంపదలతో విరాజిల్లుతూ నేటికీ నిలిచిఉన్నాయి. వాటి ప్రతిభ నాటికీ నేటికీకూడ అద్వితీయమే అని చెప్పవచ్చు. ఆ శిల్పాల్లో ప్రతిఅంశమునందును అనుభావితమయిన శిల్పవిశేషమంతయు పట్టి అలంకారయుతమో, లేక పట్టి వర్ణనాపరిణతిమాత్రమో గాక, నిజఅంతర్నైజములను తెల్పు ఒక కల్పనేచ్ఛను సూచిస్తుంటుంది. ఈ అమరశిల్పములందు ఒకవేళ కళాకర్త యొక్క నేర్పరితనం చాలకపోయినప్పటికీ ఆ చిత్రతత్వం ఏమాత్రమూ మరుగుపడదు. కాని ఒక్కొక్కప్పుడు కళాకర్త ప్రకృతియనుకరణకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి, తన శిల్పరచనా విధానమందలి ఉత్తీర్ణత ప్రదర్శనమునకే ఎక్కువ స్థానం ఇచ్చినపుడు అంతరార్థం మరుగుపడడంకూడ తటస్థిస్తుంది.

నిజంగా ఉత్తమకళాకోవిదునకూ, మహాభక్తుడికీ, యోగికీ, సిద్ధపురుషునికీ ఈ స్థూలప్రకృతి పట్టి హేతుమాత్రంగానే ఉంటుంది. భావనాప్రపంచమందు ఉన్నత ఆవేశములను ఆలంబనమొనర్పుటకే వాళ్ళకీ ప్రకృతి వినియోగం. ఆ ఆవేశసంభితరూపములను కల్పనమొనర్చి చిత్రించుటే చిత్రకళాపరిణతి.

ఈ ఆవేశస్వరూపనైజములు అనేకరకాలుగా ఉండవచ్చు. ఒకప్రక్క సంపూర్ణయోగసమాధి దివ్యానందరూపమున ఆ ఆవేశం జరగవచ్చు. మరోప్రక్క పరిపూర్ణభోగలాలస చిత్తవృత్తుల ననుకరించు అనేక రూపరూపముల ఈ ఆవేశం వెలయవచ్చు. అందుచేత చిత్రకళయందుకూడ భావనాపరిణతి ఉన్నత యోగసమాధినుంచి ఇంద్రియభోగలాలస ప్రవృత్తులవరకూ అనేకరూపాల నందికొనవచ్చు.

ఈ న్యాయము ననుసరించే కళయందూ, మతావేశమందూకూడ, ఉన్నతపథాన సంచరించు మహాయోగరీతులవలెనే, అతి బీభత్సప్రణాళికలుకూడ సమానంగానే గమనగతుల నందుకొంటాయి. దక్షిణామూర్తి విగ్రహశిల్పమందును, మహాకాళీ చిత్రరచనమందును మహాయోగి యనదగు కళాకర్త సంకల్పించినదాది భావాంకురంనుంచి రచనవరకూ, అనగా భావన, కల్పన, రచన అన్నీ ఏకరీతినే నడుస్తాయి. సంకల్ప పర్యవసానమయిన ఈ శిల్పద్వయమందలి భేదం అంకురంలోనే ఉంది. కళాకర్తల మహదాంతర్య ఉద్దేశ్య స్వభావమే వేరగుటచేసి, ఆ అంకురమందు భావ భావనాయోగ్యముల వెలుగుల వర్ణములు వేరుగా పరిణమించాయి. అంతేకాని యీ యోగ్యములు ఆ కళాకర్త యొక్క ఉద్దేశ్యప్రాబల్యత ననుసరించిన సంపూర్ణ తేజము నెల్లప్పుడూ కలిగిఉంటవి.

నిశ్చయంగా ప్రకృతి నావరించిన మాయావరణమును భేదించి ప్రకృతి నిజఅంతర్యమునకు కొంతవరకైనా దారిచూపగలిగినవి మతమో, లేక కళో అయి ఉన్నవి. అందుచేతనే ఈ రెండూ ఒక అంతరార్థము ననుసరించిన అనుభావముల పర్యేక్షణంగానే ప్రకృతిని వీక్షిస్తాయి. కళయందూ, మతమందూ కూడ సత్యస్వరూపమయిన ఈ అంతరార్థమే సంకల్పేచ్ఛకూ, సృష్టికల్పనలకూ మూలమవుతుంది. ఉత్తమకళాకల్పనలకూ, నిజఆధ్యాత్మికచింతకూ ఈ సూత్రం తప్పక అన్వయిస్తుంది. అందుచేత ఈ రెంటి నైజము నెరుంగుటకు ఈ సూత్ర సంపూర్ణావగాహన అత్యవసరం. కళావాహినులా, మతవాహినులా గతుల సామ్యం ఈ సూత్రం సంపూర్ణంగా నిర్దేశిస్తుంది.

అనేకప్రాంతాల్లో, అనేక కాలములందు అనేక మతాలు, మతతత్వాలు వెలిసినై. మానవజీవిత విధానానికే రూపకల్పనల నిచ్చింది మతతత్వం. అంతేకాక కళయందు భావభావనలకుకూడ ఈ మతతత్వం ఒక నిశ్చితస్వరూపాన్ని ఒసగింది. కాని కళాస్వరూప జ్ఞానానికి ఈ వివిధమతతత్వములనూ, తత్సంప్రదాయములనూ గణింపక, అసలు అంకురస్థానమయిన అంతర్య నైజమును గుర్తించవలసివుంటుంది.

అందుచేత మతంలోనుంచి కళ ఉద్భవించిందనడం చాలా పొరబాటు. వేదమతంనుంచి హిందూ కళ ఉత్పన్నముకాలేదు. అలాగే బౌద్ధమతంలో కాదు బౌద్ధకళ అంకురం. క్రైస్తవమతం క్రైస్తవకళకు కారణభూతం కాదు. కాని మానవుని ఆధ్యాత్మికచింతాస్వరూపముల ననుసరించి కళయందు ఆయా మతము

లకు చెందిన సంప్రదాయములు, కల్పనారీతులు ఆయా ప్రాంతీయ శిల్పములందు వెలసినవనుట సత్యం.

కాలము గడచినకొలదీ, ఆధ్యాత్మికవిజ్ఞానం పెరుగుటంచేత, సంప్రదాయము లెన్నో కళయం దొక స్థానం వహించి, శిల్పమం దొక నిశ్చితగతి ఏర్పడి, కళకే ఒక నిశ్చితస్వరూపాన్ని ఇవ్వగలిగాయి. అంతకుమున్నెన్నడూ ఎరుగని అనేకనూతన ఆశయము లెన్నో మానవజీవితమునం దిమిడి, తదనుసారంగా అనేకనూతన లయగతులకు కళ ఆలవాలమయింది. తదనుసారంగానే మానవమానసిక ప్రపంచంలో సృష్టికల్పనేచ్ఛలు అనేక విధాలుగా వికాసమందుకొన్నాయి. ఎన్నడూ ఎరుగని దివ్యస్వరూపాలకు కళ కాలము గడచినకొలదీ ఆలవాలమయింది.

యోగంవలె, భక్తివలె, మహదాంతర్య ఇచ్ఛలలో కళకూడ ఒకటని అన్నాము. కాని కాలము గడచినకొలదీ, మహాయోగులూ, సిద్ధులూ, భక్తులూ చూపిన పంథాల ఆయాప్రదేశములందు ఆధ్యాత్మిక చింతావాహిను లెన్నో బయలుదేరి, ఒక మహాజ్ఞాన సాగరం సమకూడింది. సంప్రదాయము లెన్నో ఏర్పడి, సామాన్యజనులకు ఆధ్యాత్మిక జీవితవిధానముకొరకై నిశ్చితపంథా లెన్నో ఏర్పడినాయి. ఈ పంథాల ననుసరించే మహాభక్తులై ముక్తినందిన మహాపురుషు లెందరో కలరు. కాని ఆ మహాపురుషుల అంతర్వ్యాపారమందు కల్పనేచ్ఛ లేదు. అప్పటికే సృష్టియై సంచరించుచున్న మహాజ్యోతులనే వారు వీక్షించి ముగ్ధులై యావెలుగులనే స్వీకరించి ఉత్తీర్ణులైనారు. అప్పుడు వారి భక్తి కాని, యోగంకాని, తంత్రంకాని మతానుసారితమయిన అంతరాత్మ ఉద్దేశ్యమున కొక అనుభావమే అయింది. కల్పనాభావ మిందు లేదు.

అదేరీతినే కళయందుకూడ మహాయోగులైన ఉత్తమకళాకోవిదుల భావనలు సజీవమగుటంచేసి దేశమంతా విచ్చలవిడిగా సంచారము నందుకొన్నవి. దీని పరిణామం, సంప్రదాయశ్రేణి యొకటి యేర్పడడమే గాక, కళయం దొక నూతన ప్రపంచమే సంఘటిల్లింది. తగిన సంస్కారము లేక, ప్రకృతియంతర్వ్యాపారము వీక్షింపజాలు తీక్ష్ణసూక్ష్మదృష్టి లేక, యంతర్వ్యాపారమందు కల్పనేచ్ఛ లేక, తత్పూర్వమే సృష్టియై వెలుగుచున్న మహాజ్యోతులనే స్వీకరించి ఉత్తీర్ణత గాంచుటకు ఎందరో ఆభావనాస్వరూపములనే స్వీకరించారు. ఆ భావనాస్వరూపములను స్వీకరించి, భక్తిమార్గం అనుష్ఠించో, లేక తంత్రమార్గం అనుష్ఠించో, ఉత్తీర్ణత గాంచగల్గిన మహాపురుషు లెందరో కలరు.

అలాగే ఆ శ్రేణికి చెందిన కళాకోవిదులుకూడ అనేకు లుత్పన్నమవడంలో ఏ విశేషమూ లేదు. అప్పటికే సంప్రదాయపరమై, ప్రచారములో ఉన్న మహాకల్పనలు సత్యములుగా వారు స్వీకరించి, తదనుసారిత కల్పనల నెన్నో సృష్టించి, ఉత్తమచిత్రముల నెన్నింటినో వారు చిత్రించారు. అప్పుడు వారిచేతియందు ద్వితీయశ్రేణికి చెందిన మతావేశపరులయందు భక్తి, యోగ, తంత్రములవలెనే కళకూడ మతమున కొక అనుభావమైనది.

మతమున కనుభావికమయిన చిత్రకళా, శిల్పములందు ఎక్కువ ప్రాధాన్యత వహించినవి సంప్రదాయ విశేషములూ, రూపనిర్దేశము. ఎందుకనగా మత సంబంధమయిన ఇతిహాసవర్ణన ఇందులో కొక ముఖ్యభాగమయింది. అప్పటికే ప్రచారంలో ఉన్న భావనా జ్యోతుల సహాయఅవసరత సంప్రదాయ ప్రధానతను దాటిపోయింది. వర్ణనాభాగమందు రూపనిర్దేశమునకు తప్పనిసరిగా ప్రాధాన్య మబ్బింది. అందుచేత కళలో బాహ్యప్రకృతి రూపములకు ఒక స్థానంకలిగి, కళ కొంతవరకూ పై మాయాప్రకృతి ననుకరింపకతప్పింది కాదు. వర్ణనాప్రమాణములకూ, తదనుసారంగా శిల్పచాతుర్యమునకూ కూడ ప్రాధాన్యం ఈ కళావిధానంలో నిశ్చితమయింది. అందుచేత మతఅనుభావికమయిన కళయందు రేఖా ప్రాముఖ్యత కంత అవసరం లేక, రూపప్రాముఖ్యతే ఎక్కువగా కానవస్తుంది. నిజంగా ప్రకృతియంతర్ధమును తానే స్వయంగా వీక్షించిన మహాయోగుల కళాకల్పనలందలి శిల్పమునకు, మతానుభావమయిన కట్టి వర్ణనాచిత్రములందలి శిల్పరీతికి భేదం ఇక్కడే కానవస్తుంది. ప్రథమసృష్టులైన ఆ ఆది కల్పనలందు రేఖాప్రాముఖ్యత తప్పదు.

బౌద్ధశిల్పమందు అమరావతీ అజంతాలయందు వెలసిన ఆంధ్రశిల్పపరిణతి ఔన్నత్యము ఇక్కడే కాన

వస్తుంది. ఈ శిల్పరీతియందలి విశిష్టతే రేఖ. ఈ శిల్పం చాలవరకు మతానుభావితమే అయినప్పటికీ రేఖ ప్రాముఖ్యంగా కానవస్తుంది. కాని ఈ రేఖాప్రాముఖ్యత రచనావిధానమందు చిత్రశిల్ప కళల రీతుల రెంటినీ కలిగి ఉన్న కారణముననే గాక, మహదాంతర్యమున అంకురమైంది, నిజఆధ్యాత్మికచింతనవలనే, ఈ అమరశిల్ప కల్పనమంతయు నిజాంతర్యమున ఉద్భవించి అనేక రీతుల మాయాప్రకృతి కతీతమయిన భావభావనా శక్తుల ననుసరించిన కల్పనాకారణమువలనకూడ అయి ఉన్నది. నిజముగా నిజాంతర్యమున ఉద్భవించి ప్రకృతి కతీతమయిన భావనాశక్తుల వలననే, చిత్రకళరచనా విధానంలో శిల్పచిత్రములరీతులు అవహించి రేఖా ప్రాముఖ్యత కలుగుతుందని చెప్పవలసియున్నది.

నిజంగా, అమరావతీ, అజంతాలయందు వెలసిన శిల్పమునం దెక్కువభాగం బౌద్ధమతానికి అనుభావితమే అయి ఉన్నది. అందుచేత బౌద్ధమతసంబంధమయిన ఐతిహాసిక వర్ణనయం దెక్కువ ఆ కళావాహిని ప్రవహించింది. ఈ కారణంవలన ఆ చిత్ర రచనా విధానమందు రూపనిర్దేశంకూడ ప్రాధాన్యత వహించి, తదనుసారితమయిన వర్తనాశయవృద్ధుల నిర్దేశిత మందలి ఉత్తీర్ణత ప్రకటనలకుకూడ ఆ చిత్రకళ ఆలవాలమయింది. అయినప్పటికీ ఆ శిల్పాల సంపూర్ణ బహిర్గ ఆధ్యాత్మిక జీవన మంతయు ఆ మతమునకే వప్పజెప్పినకారణంచేత ఆ చిత్రవాహినికి అంకురం నిజఆంతర్యమందే ఏర్పడింది. అందుచేత ఆ కళాకోవిదు లొక్కొక్కతరి ఆ మతానికే అతీతులయి, ద్వితీయశ్రేణికి చెందిన వట్టి వర్ణనాపరమైన చిత్రములేకాక మహదాంతర్యకల్పనేచ్ఛలను సూచించు అత్యుత్తమశిల్పముల నెన్నో రచించి అనేకనూతనలయగతులను సూచించారు. దీని పర్యవసానం ఆంధ్రదేశమందు ప్రబలిన బౌద్ధసిద్ధాంతములయందు బాగా కానవస్తుంది. ఎలాగనగా, ఆదిన బౌద్ధమతమందలి మాధ్యమిక సిద్ధాంతమును ప్రవేశపెట్టిన మహాపురుషుడు నాగార్జునుడు ఆంధ్రగర్భమందు నాగార్జునకొండవాసి. ఈ మాధ్యమిక సిద్ధాంతమే త్వరలో యోగాచారమునకు, తదుపరి బౌద్ధమతమందు అనేక బీభత్స ప్రణాళికలకూ, భోగలాలసప్రవృత్తులకూ దారితీసింది. కానీ ఇవన్నీ ఎక్కువగా ఉత్తరమునందే ప్రబలి వృద్ధి చెందినవి. ఆంధ్రదేశమునందు బౌద్ధము చివరవరకూ శాంతియుతమై, శాంతికేచ్ఛల కతీతమయి స్వచ్ఛంగానే నిలిచింది. దీనికంతటికీ చాలవరకు ఆంధ్రమందు వెలసిన మహాశిల్పాలు, వారి శిల్పములేనని తప్పక చెప్పవచ్చు. కాబట్టి అమరావతీ, అజంతాలల్లో వెలసిన ఆంధ్రశిల్పమునందలి రేఖావిన్యాసం వట్టి శిల్పరచనావిధానమునకే చెందక, మహదాంతర్యమునం దుద్భవమైన కల్పనయందే యోగభాగమయింది.

ఇదేరీతిన బౌద్ధమతానుభావితమయిన గాంధారశిల్పమునుకూడ కొంతవరకు గమనింపవలసియుంటుంది. ఈశిల్పమందు ప్రాముఖ్యత వహించిన విశేషమే వర్ణనాపరము. అనగా బౌద్ధమత సంబంధిత ఇతిహాసవర్ణనకే ఈ చిత్ర కళావాహిని ఆలవాలమయింది. అందుచేత రూపనిర్దేశమునకే ఎక్కువ ప్రాముఖ్యత ఈశిల్పవాహినియందు కలిగి, శిల్పచాతుర్యమందలి ఉత్తీర్ణతే అత్యంతగా పరిణమించింది. యవనులచే ప్రవేశపెట్టబడిన ఈ శిల్పవిధానమందు అంగసౌష్ఠవం కలిగిన సహజ మానవాకృతులకే ఎక్కువ ప్రాముఖ్యత కలిగింది. ఈ శిల్పమందు వెలసిన ఇతరఅంశములన్నీ ఈ రూపనిర్దేశములకే అంగభాగములై, వట్టి అలంకారయుతంగానే పరిణమించినవి. శిల్పమందు ఉత్తీర్ణత కలిగిఉండటంచేత, ఈ శిల్పమం దనేకచిత్రములు లక్షుప్రదమై, సజీవములే అయినప్పటికీ, ఆ యా లక్షణగతులన్నీ స్థూలప్రకృతికి సంబంధించినవే అయి, మనలో నిశ్చితమయిన నాడీగతుల నంకరించియున్నవి. ఈ కళావాహిని పర్యవసానం ఉత్తరమందు బోధిసత్వసిద్ధాంతం ప్రబలి, బుద్ధుని దైవముగా పూజించుటాది, బౌద్ధం అనేక శాక్త, భోగ, బీభత్సప్రణాళికలకు ఆలవాలమయి, నిజబౌద్ధమతమునకే ఒక నూతనరూపం కలిగింది.

ఆధ్యాత్మికదృష్టినలె కళకూడ అంతరాత్మ ఉద్దేశ్యమందే అంకురితమవటంచేసి, కళ, మతం ఈరెండూ సమానంగానే ఒకదానిప్రక్క ఇంకొకటి నడుస్తుంటాయని చెప్పవచ్చు. ఒక్కొక్కప్పుడు కళ మత ప్రేరేపితమవుతుంది. మరొకప్పుడు కళే మతానికి ప్రేరేపితం అవుతుంది.

దీని కంతటికీ కారణం ఒకటే. ఉత్తమకళాకర్త ఎల్లప్పుడూ ఒక మహాయోగి. మహాయోగికివలెనే ప్రకృతి అతనికి హేతుమాత్రమే. ఇంతేకాక ప్రకృతి కతీతుడై దివ్యపీఠ మధిష్ఠించిన యా మహాయోగికి ప్రకృతి యాంతర్యమంతయు తన అపారఆంతర్యమునం దొక చిన్న భాగంగానే తోస్తుంది. అందుచేత ప్రకృతి చేష్టానుభావములన్నీ అతనికి ఒక పసిపాపలీలలవలె తోస్తవి. తప్పదు. పసిపాప ఏడ్చినను, నవ్వినను, మారాం పెట్టినప్పటికీ తలితండ్రులకు ముద్దే. అదేలాగు ప్రకృతిలీలలన్నీ మహాయోగికి ముద్దులగానే కన్పడి అతనికి అపరిమితానందమును సమకూరుస్తాయి.

అతనికి శరచ్చంద్రికలోని నల్లని కలువవికాసమందును, ప్రకృతియంతయు ఏకముఖంగా సంక్షోభిత మొనర్చు గొప్ప తుఫానుల విజృంభణమందును అందము ఏకరీతినే కానవస్తుంది. రతీదేవి వదనంలోను, మహాకాళీముఖమందును లావణ్యగతి సమానంగానే అతడు వీక్షిస్తాడు. సచ్చిదానందస్వరూపుడైన ఆ కళాకర్త ఆంతర్యమున భయానికి తావొకింతయులేదు. ఏగతి ననుకరించినప్పటికిన్నీ ప్రకృతిలీలలన్నీ ఆనందమయంగానే సుస్వరూపముల నందికొని అతని భావనా ప్రపంచంలో తాండవిస్తాయి. సంకల్పించి, కల్పించి ఆ లయలన్నీ సాక్షాత్కరించేలాగ ఆ మహాయోగి రసవంతంగా చిత్రిస్తాడు. ఇదే నిజకళాగతి.

ప్రకృతి లీలాస్వరూపము లనంతములు. అందుచేత మహాయోగిసంకల్పము ననుకరించి ఎన్నడెరుగని స్వరూపము లొక్కొక్కప్పుడు ఉద్భవిస్తాయి. ఈ స్వరూపా లొక్కొక్కప్పుడు ఆధ్యాత్మికంగా ఎన్నడెరుగని ఒక నూతనపంథాను సూచిస్తాయి. అప్పుడు ఆ స్వరూపాలే ఒక క్రొత్తమతమునకు దారి తీయగలవు. మన దేశమతముల చరిత్ర పరిశోధించిన అనేక మతములు ఈ విధంగా ఉత్పన్నమైన వనుట స్పష్టము కాగలదు.

ఇంతేకాని ప్రకృతిలోని సృష్టిభావాన్ని, వినాశభావాన్ని రెండువిధాలుగా ఆ మహాయోగి ఎప్పుడూ చూడడు. యోగమూ, మహాయోగి ఆంతర్యమూ ఎరుగని పాశ్చాత్యులు ఈ రెంటినీ రెండుగా విభజించి, హైందవకళనే విభజించారు. సంహారరూపములు బీభత్సములనీ, ఈ రూపకల్పనలు మన కళను కొంత వక్రీకరించినవనీకూడ కొంతవరకు అభిప్రాయాన్ని సూచించారు. కాని ఇది సత్యం కాదు. మహాయోగమూర్తులైన సమాధిబుద్ధుడూ, దక్షిణామూర్తి శిల్పములందు మన కళ ఎంత ఉన్నతపథమందు నడిచిందో, అంత ఉన్నతపథాననే సంహారరూప కల్పనలందుకూడ సంచరించింది. దీనికి ప్రబలతార్కాణాలుగా అనేకమహాశిల్పాలు నేటికీ నిలిచియున్నవి.

వేదములాదిగా, ఎప్పటికప్పుడు అదొక నూతనగతిని సూచింపగల్గు అనేక మహాయోగు లుద్భవించినది మన దివ్యభూమి. కొందరందులో కళాకర్తలై నూతన మతములకు దారిచూపించారు. కొందరు వేదాంత చర్చల మూలంగా నూతనమతముల కాదిపురుషులైనారు.

అది మతనైజం ఇక్కడే కళావాహిని గతిని చాలవరకూ నిర్ణయిస్తుంది. ఎలాగనగా, కొన్ని మతములందు అదివఱకే ఆధ్యాత్మికజీవితవిధానాన్ని ఒకేసారిగా నిర్ణయించడ మవుతుంది. ఆమతానుసారిత జీవికి ఆధ్యాత్మికదృష్టి పలంగతుల స్వేచ్ఛను విహరించుటకు వీలులేదు. రైలుబండి పట్టాల ననుకరించినట్లు ఆ సిద్ధాంతముల ననుసరించే అతని ఆంతరంగిక జీవితమంతయు ఒకేనిర్ణయపథాన నడపవలసి యుంటుంది. అతని అంతరాత్మ ఉద్దేశ్యం ప్రబలమై, ఆధ్యాత్మిక దృష్టి కొంత స్వేచ్ఛనందుకొనినపుడెల్ల అతడు మతాంతరుడే అవడం తటస్థిస్తుంది. అట్టి జీవి కల్పిత కళాసృష్టి మతసంబంధమైనది కాదని నిర్ణయింపబడడమేగాక, అతివితండంగా సామాన్యులకు తోచి రసోత్పత్తి కేమాత్రం హేతువు కాదు. అందుచేత సామాన్యంగా అట్టిదేశములందు ఉద్భవించిన కళాకోవిదులందరూ మతానుసారితకళకే కర్తలవటం సంభవిస్తుంది.

కాని అనేకనూతనమతములకు దారితీయగల్గు కళాస్వరూపాలకు ఆలవాలమవగల్గినది మన దేశం. అందుచేతనే మన దేశమందు కళావాహిని అనేక ఉపవాహినులతో, ఆది అంతు లేని యొక అపారతను వహించింది. ఈ వాహిని సర్వస్వము నెరుంగుటకు ఒకజీవితం చాలకపోవచ్చును. అందుచేత ఈ వాహినీగతులను మాత్రమే కొంతవరకు మనం పరిశీలింప గలుగుదాము.

---

# ఖేదనాటకము

✺

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఏమి మహాప్రభూ! ఇటు విధించితి వీ పరవాసవేదనా
స్తోమకథాప్రవృత్తి; విధిదూషితబుద్ధుని ఖేదనాటకం
బే మనసయ్యెనే కనగ? ఇంక నటింపగలేను చిత్తమం
దేమొ విచారపుంబరువు నిండె, నికన్ తెరదింపు మో విభూ!

౨

- ఏమిటి జీవనంబిది - ఇసీ! నవనాగరికంపు కంపు, జ
వామృతమంచు త్రోపులిడి అంజలి జుబ్బన జారగ్రోల నం
తా మతి జారి వత్తురు; శతాంధులు కూపము జొచ్చిరన్న వా
ర్తామలసత్య మింతట కరామలకం బయిపోయె నీశ్వరా!

౩

రంగుల కాగితంపు పువురా! నగరాయతవాసవాసనా
రంగము; ఒక్కటేని యధరమ్మున, గుండెను, తావి, తేనె, లే
దింగలరాశిలో బ్రదుకు నీడ్చు నయోమయ సుందరాకృతుల్
పొంగెద రెందుకో - రజత ముద్రికలా నరలోకమాధురుల్?

౪

నా పాపమ్ముల కేది దండన మటన్నన్ తృప్తితో శీర్ష మే
నూపంజాలుదుగాని - పట్టణమహావ్యూహాంతరాబద్ధ నా
నాఽపాంక్తేయ సహాసనాశనవిహారాయత్త ధన్యత్వ మే
నోపంజాల - విధింపు మన్యము మదంహోదండనార్థమ్ముగా.

౫

పట్టిన దెల్ల కాంచనము పండ దలంపగ లేదుగాని - నే
ముట్టిన కృష్ణమృత్తికయిపోయెను సర్వ మదేమొ-నిన్ను చే
పట్టిన దీనమానవుల భాగ్యము? సాగరకన్య పాదముల్
పట్టెద; తల్లికంటికొనసై నటియించును లెమ్ము పెన్నిధుల్.

---

# తిరోగమనము

[కథానిక]



— శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి —

ఎందుకోగాని అప్రయత్నంగా ఆ వీథిలోకి వెళ్ళాడు వెంకట్రావు. ఏమీ పనిలేదు. పొద్దు గడవాలి. పొద్దుగూకితే నిద్రాదేవి నాహ్వానించవచ్చు. తలవంచుకొని వెళ్ళే స్వభావముమటుకు కాదు. దారిలో ఎన్ని ఇళ్ళుంటాయో అన్నింటినీ పరీక్ష చేస్తూ పోవాలిసిందే. ఇంత బాగా చూస్తున్నా అతని దృష్టి ఎప్పుడూ పూలచెట్లమీదనే ఉంటుంది. మనుష్యులున్నా కనబడరు. పూలచెట్లంటే సరదా. వాళ్ళ ఇంట్లోకూడా ఎన్నో మొక్కలను పెంచుతాడు. ఊరంతా పూసినా, అవిమాత్రం సకృత్తుగానే పూస్తూ ఉంటవి. కారణం తెలీదు.

సుమారు సాయంత్రం నాలుగుగంట లవుతుంది. అకస్మాత్తుగా మేఘా లాకాశాన్ని కమ్మివేసినై. వర్ష చిహ్నాలన్నీ బాగా కనబడుతున్నై. ఐనా భరవసా. ఇదేం చేస్తుందిలే అని బయలుదేరాడు. ఒక వందగజాలు నడవగానే సన్నచినుకు బయలుదేరింది. నిర్లక్ష్యంగా ముందుకు సాగిపోతున్నాడు. క్రమేణా వర్షం పెద్దదైంది. ఏపంచనైనా చేరి వాన వెలిసేదాక పోవచ్చు. కాని చాలా బిడియస్తుడు. చాలావరకు తడిసిపోతున్నాడు. గాలికూడా ఎక్కువైంది. పక్కయింట్లో ఎవరో నవ్వారు. తన్నుచూచే నవ్వారని తిరిగిచూశాడు. ఎవరో అమ్మాయి కనబడ్డది. కోపం వచ్చింది. ముందుకు వెళ్లి అక్కడొక ఇంట్లో ప్రవేశించాడు. వసారాలో నుంచొని చూచేసరికి ఇల్లు తాళంపెట్టిఉన్నది. ఇక ఫరవాలేదని చొక్కా, ఉత్తరీయం తీసి పిడిచి, ఉత్తరీయం కట్టుకొని, ధోవతి పిడిచి ఆరవేశాడు. ఒక మూల కదలకుండా, మెదలకుండా కూర్చున్నాడు.

వర్షం ఎంతసేపటికీ తగ్గుముఖం చూపలేదు. పోనుపోను ఎక్కువౌతున్నది. మనస్సులో రెండే ఆలోచనలు. ఇంటికి ఎలా చేరటమా, ఆ అమ్మాయి తనను చూసే నవ్విందా ? అని. చీకటి కమ్ముతున్నది. ఏమీ తోచలేదు. అది దయ్యాల మేడని అతనికి జ్ఞాపకం వచ్చింది. వెంటనే లేచి, తడిస్తే తడిశానులే అని ఇంటిదారి పట్టాడు. దారిలో మళ్ళీ ఆ అమ్మాయి నవ్వుతుందేమో చూడాలని పరికించాడు. అదేఇంట్లో అదే అమ్మాయి మళ్ళానవ్వింది. అతని కర్థంకాలేదు. కోపం వేసింది. కాని ఏమంటాడు ? రేపు విచారిద్దాములే అని ఇంటికి తడిసి ముద్దయి వెళ్ళాడు.

మర్నాడు వెంకట్రావుకు జ్వరం వచ్చింది. శైత్యభారంకూడాను. ఆవూరికి కొత్తగా లేడీడాక్టరు వచ్చిందని విన్నాడు. ఆవిడహస్తవాసి మంచిదని ఊళ్ళో పేరుపుట్టింది. కాని ఆవిడఇల్లెక్కడో, ఆస్పత్రీ ఇల్లూ ఒకే చోట ఉన్నవో, లేవో ఏమీ అతనికి తెలియదు. ఐనా నోట్లో నాలిక ఉంటే కనుక్కోలేకపోతానా అని బయలుదేరి తిరిగి తిరిగి చివరకు కనుక్కొన్నాడు. క్రిందటిరోజు ఆ అమ్మాయి నవ్విన ఇంట్లోనే ఆ లేడీడాక్టరుంటున్నదని కనుక్కొన్నాడు. ఇక ఆ ఇంట్లోకి వెళ్ళి "డాక్టరుగారూ" అని పిలిచాడు, అమ్మాయే బయటకు వచ్చి, ఇతణ్ణి

చూచి మళ్ళా నవ్వింది. కోపమూ, సిగ్గూ వచ్చినవి. అదంతా అణచుకొని "డాక్టరుగారున్నారా"అని అడిగాడు.

"ఉన్నారు. ఏంపని ?"

"కొంచెం చెయ్యిచూచి, మందివ్వాలి"

"ఎవరికి ? మీకేనా ?"

"ఆ. వారిని పిలవండి "

"నేనేనండీ " అని అంటూ మళ్ళా నవ్వింది. ఇదంతా నిజమో అబద్ధమో అతనికి తెలియలేదు. ఆవిడను ఎగాదిగా చూచాడు. తన్ను చూచి ఇలా నవ్వడ మెందుకు ? అసలావిడ డాక్టరవునో కాదో ? కాక పోతే తనను ఇంకా వెర్రివాడికింద కట్టేస్తుంది. ఐతే ఇలా రోగులనుచూచి నవ్వడమేనా మర్యాదాలక్షణము ! ఐతే ఐందని తనకు శైత్యభారం చేసిందనీ, అన్నహితవు లేదనీ చెప్పుకొన్నాడు. మందీయవలసి ఉంటుందని విన్నవించాడు.

"నిన్న వర్షంలో తిరిగితే జబ్బుచేయదూ?" అన్నది.

"అంతమాత్రానికే జబ్బు చేస్తుం దనుకో లేదండీ" అన్నాడు.

"ఓహో ! అలాగా !" అని నవ్వి, ఇంట్లోకి వెళ్ళి వెంటనే వచ్చి నాడిని పరీక్షచేసి, తర్వాత స్టెతోస్కోపుతో చూచి, లోపలనుంచి మందుసీసా తెచ్చి మూడుగంటల కొకసారి పుచ్చుకోవాలని చెప్పి యిచ్చింది. సరేనని లేచాడు.

"కన్సల్టేషన్ కు, మందుకు డబ్బీయకుండానేనా పోవటం" అని మళ్ళీ నవ్వింది.

"సరే, కానీయండి. నేను నయమయేదాకా పుచ్చుకోవాలిగా. చిట్టచివరకు మొత్తంబిల్ ఈయండి. అలాగే ఇస్తాను."

"సరే" నన్నది.

"అయితే మీరు పదేపదిగా నవ్వుతున్నారు, ఆ నవ్వే కేదైనా మందు పుచ్చుకోకూడదూ ?"

"ఎప్పుడు నవ్వాను ?"

"నిన్న రెండుసార్లు చూచాను. ఇవాళ నేవచ్చి నప్పటినుంచీ చూస్తున్నాను."

"ఎందుకు నవ్వానో మీకు తెలుసునా ?"

"తెలీదు."

"వర్షంలో పోతున్నందుకు, దయ్యాలమేడ నుంచీ భయం పుట్టి పోతున్నందుకు నిన్న నవ్వాను."

"నాకు భయమని మీ కెవరు చెప్పారు ?"

"మీ కళ్ళల్లోనే అదంతా తెలుస్తున్నది."

"కళ్లు సరిగా పరీక్షచేసి చెప్పండి. కంటి వైద్యం నాకూ తెలుసు. ఆ మాటకు వస్తే కంటివైద్యం తెలీనివాళ్లెవరు ?"

"ఓహో, చాలావరకూ ఉన్నదే సంగతి."

"నేనన్నానని మీకు కోపంవద్దు. కంటిని చూస్తే దయ్యాలసంగతి వెంటనే తెలుస్తుం దన్న మాట."

"నాకు తెలీదనుకోండి. మీరే సాయంత్రం మళ్లీ ఆ మేడదగ్గరకు వెళ్లి అక్కడ కూర్చోండి. ఏం జరుగుతుందో చూచి నాకు చెప్పండి. ఆతర్వాత మిగిలిన విషయాలను మాట్లాడుదాము" అన్నది.

సరేనని అత నింటికి వెళ్లాడు. ఆవిడ లేడీ డాక్టరు కాదేమోననే ఆశంకచేనైతేనేమి, దడుచు కొన్నకారణంచేనైతేనేమి, ఏమైతేనేం జ్వరం తగ్గ లేదు. కాని అక్కడేం జరుగుతుందో చూదామని ఆ సాయంత్రం మామేడ వసారాలోకి వెళ్లి కూచొన్నాడు. చాలాసే పున్నాడు. కొంతసేపటికి ఇంటిలోపల ఏదో అలికిడైనట్లున్నది. తలుపు లన్నింటి వైపూ చూశాడు. అన్నిటికీ తాళాలు వేసి ఉన్నవి. ఇంట్లో ఎవరినన్నా బందిఖానాలో ఉంచారా అని ఆలోచించాడు. పోనుపోను అలికిడి ఎక్కువైంది. "లోప లున్న దెవరు"అని అరిచాడు. సమాధానం లేదు. మళ్లీ కేక వేశాడు. కొంతసేపటికి ఎవరో లోపలనుంచి స్త్రీకంఠంతో "ఈ తలుపునద్దకు రండి, ఎవరో మీరు"అని వినిపించింది. ఆ శబ్దంవైపే వెళ్ళి తలుపు దగ్గర నుంచొని "ఇక్కడేనా" అన్నాడు. "అవు" నన్నది ఆమె.

"అయితే మీరెవరు? లోపల ఎలా చిక్కు పడ్డారు?"

"తీరికగా చెప్తానుగాని చీకటిపడేలోపల ఈ తాళం పగలగొట్టి ఎలాగైనా నన్ను విడిపించి మీయింటికి చేరవేస్తే ధన్యురాలను. మీమేలు ఎన్నటికీ మరచిపోను. రేపుప్రొద్దున్నే నాదారిన నే వెళ్ళిపోతాను" అన్నది.

వెంకట్రావు "ఇప్పుడే వస్తా"నని చెప్పి, కాసేపు తాళాన్ని చూచివెళ్లి పనిముట్లతోను, తాళపుచెవుల గుత్తితోను వచ్చి తాళం తీశాడు. చాలా తేలికగా, అప్రయత్నంగా వచ్చింది. లోపల పాతికేళ్ల యువతి ఉన్నది. అప్పుడే సూర్యాస్తమయమైంది. మళ్లీ తాళ మెప్పటిలాగానే వేసి, దారి తప్పించి, ఎవరికీ కనబడకుండా పోవాలని బండిచేయించుకొని, తన యింటికి ఆవిడను తీసికొనివెళ్లాడు. స్నానంచేసి, భోజనం చేసింది. ఈలోపల వెంకట్రావు డాక్టరుగారింటికి వెళ్లి, తన జబ్బేమీ తగ్గలేదనీ, ఆ మేడదగ్గరకు వెళ్లాననీ, ఏదో అలికిడి ఐందిగాని, ఎవరు వారంటే ఎవరూ పలకలేదనీ, విసుకుపుట్టి తిరిగివచ్చాననీ, ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పాడు. "రేపుదయం మళ్లా వెళ్లి రండి" అని చెప్పి మళ్లీ మందు ఇచ్చింది. అతనింటికి తిరిగి వచ్చేసరికి ఆ స్త్రీ భోజనంచేసింది. రాత్రి తొమ్మిది గంటలైంది. తనకు ఒంట్లో బాగా లేకపోవడంచేత భోజనా మేమీ చేయలేదు. ఆమె ఎవరో, ఆమె కథ ఏమిటో, ఆ యింట్లో ఎందుకు, ఎలా బంధింపబడ్డదో వినాలనే కుతూహలంతో ఆమె నడిగాడు. ఆమె మొదలుపెట్టింది:

"నే చెప్పితే మీరెవరూ నా విషయం వెంటనే నమ్మరు. కాని చెప్పతున్నాను. నేను ఈ ఊరికి బయలుదేరి నాలుగురోజులైంది. డాక్టరుగా ఇక్కడ ప్రాక్టీస్ పెట్టితే లాభకరంగా ఉంటుందని విన్నాను."

"ఐతే మీరు కొత్తగా వచ్చిన లేడీడాక్టరు గారా?"

"అవును."

"ఐతే ఇక్కడ ఇంకొక ఆవిడ డాక్టరుగా ఉంటున్నదే ఆవిడ ఎవరు?"

"ఆవిడసంగతే నే చెప్పబోయేది. నాకు దారిలో ఆవిడ కలిసింది. తను దిక్కులేనిదాననీ, జీవనోపాధి ఏమీ జరగటంలేదనీ, వైద్యం కొంచెం కృషిచేశాననీ, ఏపంచనైనా ఉండాలని బయలుదేరాననీ చెప్పింది. ఇంకా ఏవేవో సంగతులను చాలా దీనంగా చెప్పింది. జాలికలిగి నావద్ద ఉండవచ్చునని చెప్పాను. అంతకుముందే ఆ ఇల్లు అద్దెకు తీసికొన్నాను. అక్కడ ప్రవేశించి నాసరంజామా విప్పి సద్దుకున్నాను. మర్నాడుదయము ఆ మేడలో ఎలా చేరానో నాకే తెలియదు. రోజువిడచి రోజు అక్కడకా అమ్మాయి ఉదయంపూట వచ్చి నా సంగతి గమనిస్తూ నాకు కావలసిన పదార్థా లిస్తూఉన్నది. ఇవాళ ఉదయమే వచ్చిపోయింది. అనేకపర్యాయా లడిగాను నన్ను బంధించట మెందుకని. ఆ మందులన్నీ ఇచ్చేస్తాను నన్ను వదలివేయమన్నాను. కాని వదలదు. ఆమె ఉద్దేశ్య మేదో నాకు తెలియదు. నా అదృష్టవశాత్తూ మీరు నాకు విముక్తి చూపారు ఇవాళ."

"మిమ్మ లెందుకు బంధించింది?"

"నాకే తెలియదు."

"పోనీ, నే నడిగి తెలుసుకోనా?"

"వద్దు. నాదారిన నే వెళ్ళిపోతాను."

"ఆవిడ ఎవరో, ఎందుకు వచ్చిందో, ఎందుకీపని చేసిందో తెలిసికొని, తగిన శాస్తి చేయటం మా విధ్యుక్తధర్మం."

"నే వెళ్లిపోయినతర్వాత మీరేమైనా చేయవచ్చు. నాయందు దయఉంచి నన్ను క్షమించండి."

అంటూ దీనంగా బ్రతిమాలుకొన్నది. అతడేమీ మాట్లాడలేదు. ఇందులో ఎంత నిజమో, ఎంత అబద్ధమో తెలీదు. నిజం డాక్టరెవరో తెలిసికోవటంకూడా కష్టంగా ఉన్నది. మనస్సు పరిపరి విధాల పరుగెత్తింది. అంతా అయోమయంగా ఉన్నది. పిచ్చి ఎక్కినట్లైంది. ఎలాగైనా ఈవిడ ఇక్కడ ఉండగా నే నిజం తెలుసుకోవటమే యుక్తమని నిశ్చయించుకొని, ఆరాత్రి ఆవిడ నిద్రపోగానే, గబగబా లేచి తలుపువేసి, లేడీడాక్టరుఇంటికి పరుగెత్తాడు.

తలుపు గట్టిగా కొట్టి పిలిచాడు. ఆవిడ బయటకువచ్చి "ఎందు"కన్నది. "తనకేమీ తగ్గలేదనీ, జ్వరం బాగా ఉన్నదనీ, అందుకని వచ్చా"ననీ చెప్పాడు. ఆమె విసుక్కున్నది. కసురుకొన్నది. సణుగుకొన్నది. ఇదంతా గమనించి అసలు కథ విప్పటం మొదలు పెట్టాడు. తను మళ్లీ వస్తూవస్తూ ఆ మేడదగ్గరకు వెళ్లాననీ, అప్పుడే అందులోనుంచి ఎవరో స్త్రీ తలుపు పగలగొట్టుకొని బయటకు వస్తున్నదనీ, తన కాళ్ల మీద పడి ఆ సంగతి ఎవరికీ చెప్పవద్దని బ్రతిమాలుకొన్నదనీ, ఎవరుమీరంటే తనే లేడీడాక్టరునని చెప్పి గబగబా రైలువద్దకు వెళ్లి అదృశ్యమైపోయిందనీ చెప్పాడు. ఆవిడ వింటూవింటూనే కూలబడ్డది. కొంతకాలం నోటిమాట రాలేదు. కాసేపటికి అప్రయత్నంగా "ఇదంతా వాస్తవమేనా?"అని అడిగింది. "అవు"నంటూ—

"మీకూ, ఆమెకూ గల సంబంధ మేమిటి?"

"ఆమె నన్నీ వరలో చాలాకష్టాలు పెట్టింది. నేను ఏపని చేయబోయినా అడ్డుతగలటం మొదలు పెట్టింది. ఎంత చెప్పినా ఆమె వినలేదు. చివరకు నే నీవూరు బదులుచేరితే నావెంట బడింది........"

"మీరే వెంటబడ్డారని విన్నాను."

"ఎవరు చెప్పారు?"

"నాదగ్గర మీ అబద్ధాలు కట్టిపెట్టి నిజం చెప్పండి. అసలు డాక్టరెవరు?"

"రాత్రిపూట మందుకని వచ్చి, ఇలా గోల చేయటం మర్యాదేనా?"

"మర్యాదో గిర్యాదో నాకేమీ తెలియదు. మీ ఇద్దరిలో అసలు డాక్టరెవరో తేల్చుకోవాలి. అంతదాకా మీ రీ ఇల్లూ, ఊరూ వదలటానికి వీలు లేదు."

అని అంటూ ఆమెచేయి పుచ్చుకొని బయటకు తీసికొనివచ్చాడు. ఆమె కేమీ తోచలేదు. ఎక్కడకు తీసికొనివెళ్తాడో చూదామని నిర్భయంగా వస్తున్నది. చివరకతని ఇల్లు చేరారు. లోపల ప్రవేశించినతర్వాత నిద్రిస్తున్న స్త్రీని చూచి లేపింది.

ఎవరి ముఖానా నెత్తురుచుక్క లేదు. ఇద్దరూ నిశ్చేష్టులైనారు. ఇద్దరూ వెంకట్రావును ఉరిమిఉరిమి చూచారు. అతని కేదీ బోధపడలేదు. గబగబా బయటకువచ్చి ఇల్లు తాళంపెట్టి తన స్నేహితులను పిలుచుకొని రావటానికి వెళ్ళాడు. అతడు మళ్ళీ వాళ్ళతో వచ్చి తలుపు తెరచిచూచేసరికి ఇద్దరూ లేరు. ఎక్కడకు పోయినారో తెలీదు. ఆస్పత్రికి వెళ్ళారు. అక్కడ సామాన్లుకూడా లేవు. పాడుబడ్డ మేడదగ్గరకు వెళ్ళారు. అది శిథిలమైపోయిఉన్నది. నిరాశతో ఇంటికి వచ్చారు. తలుపులు పగలగొట్టిఉన్నవి. స్నేహితులతనిని వేళాకోళంచేయటం సాగించారు. అతని తల పగలగొట్టుకొనిపోయింది.

స్నేహితులను పంపించి స్టేషనుకు వెళ్ళాడు. అక్కడ ఆ ఇద్దరూ ఉన్నారు.

"నాతో చెప్పకుండానే వచ్చిశారేం? మీకోసమంతా వెదకి వెదకి వచ్చాను" అన్నాడు.

"ఇప్పుడైనా డాక్టరెవరో తెలిసిందా?"అని అతనిచే విముక్తికాబడ్డ స్త్రీ అడిగింది.

"మీరు వెళ్ళటానికి వీలులేదు" అన్నాడు.

"ఎందువల్ల?"

"మీ రేదో చేస్తున్నారు. మీ రిప్పుడైనా మీసంగతి తెలుపుతారనుకొంటున్నాను"

"అదే మీవల్ల కానిపని" అని రెండవ స్త్రీ అన్నది.

"పోనీ, మిమ్మల్ని రైలెక్కించి పోతాను." అన్నాడు. మాటలసందడిలో రైలువచ్చింది. ఎక్కువ కాలము రైలాగదావూళ్ళో. ముందు సామాన్లన్నింటినీ ఎక్కించాడు. తర్వాత డాక్టరు నెక్కించాడు. ఆమేడలో నున్న స్త్రీకి స్థలం దొరకలేదు. వేరేచోట చోటు వెదుకుతూఉన్నది. ఇంతలోకే రైలు వెళ్ళిపోయింది. అతడూ, ఆమే కలిసి ఇంటిదారి పట్టారు. దారిలో 'నిజం చెప్ప'మని మళ్ళా ప్రాధేయపడ్డాడు. "ఇంటికి వెళ్ళినాక" అని ఊరుకొంది. ఇంట్లో ప్రవేశించినతర్వాత—

"ఆ అమ్మాయి ఎవరో మీ కిప్పటికైనా తెలిసిందా?"

"లేదు."

"నా చెల్లెలే!"

"ఐతే ఇలా ఎందుకు వర్తించింది!"

సమాధాన మీయకుండా, అప్రయత్నంగా లేచి, అతని చేయిపట్టుకొని నిల్చోనమన్నది. అతను నిల్చొన్నాడు. వెనక్కు తిరిగి చూడమన్నది. ఏమిటోనని చూచాడు. ఇంతలోనే అతని నడుమును చేతితో చుట్టి, రంకులరాట్నంలాగా తిప్పుతూ, నెమ్మదిగా "ఇప్పుడు నే నెవరో తెలిసిందా" అన్నది. పిచ్చి ఏమైనా ఎత్తడం చేత అలా బంధించిందేమో ననుకొన్నాడు. కాని మాట్లాడలేదు. చివరకు అతన్ని కూచోబెట్టి—

"ఆ మేడలో ఎవరున్నారో తెలుసా" అన్నది.

"తెలీదు" అన్నాడు.

"మా అమ్మా వాళ్ళున్నారు."

"ఐతే మీ చెల్లెలు వెళ్ళిపోయిందేం?"

"రేపు వస్తుంది."

"మందులుకూడా తీసికొనివెళ్ళిందేం?"

"మందులు కావాలా?"

"నా కెందుకు!"

"ఐతే ఇన్నిసార్లు దానిచుట్టూ తిరిగా రెందుకు?" ఈవాగుడును ఆపాలని అతడు మాట్లాడలేదు. ఇప్పుడే వస్తానని చెప్పి బయటకు వెళ్ళింది. ఎంతసేపటికీ రాలేదు. కోడికూసింది. క్రమేణా తెల్లవారింది. ఆ అమ్మాయి రానేలేదు. ఎక్కడికి వెళ్ళిందో, ఏమో! కాని ఆ మెతలలో పెట్టుకొన్న మల్లెపూ వెందుకో అక్కడ పడిపోయింది.





"ఎగురవే జండా ఎగురవే!"

దాదాపు మూడు శతాబ్దముల 'బట్టీ బ్రిటీషు బావుటా రైన 'యూనియన్ జాక్' ఎగురుతూ వుండిన చెన్నపట్టణం ఫోర్టు సెంటు జార్జికోట ధ్వజ స్తంభంపైన, మన పుణ్యం పండి, ఇన్నాళ్లకిన్నాళ్లకు భారత పతాక ఎగురుతూ కన్నుల పండువు చేస్తున్న కమ్మని దృశ్యము.

# ప్రాచీన భూగోళము



— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

౨

వాయు విష్ణు బ్రహ్మాండముల మతమున ఈ యేడు దీవులలో అతిఁట ఏడేసి పర్వతములును, ఏడేసి నదులును గలవు. వీనిలో ఐదు దీవులందు ఆర్యక కురర విదిశ్య భావి నామములతో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు కలరు. ఆర్యక - ఆర్య, క్షత్రియ— కురర, విదిశ్య-వైశ్య నామములందుఁ గల పోలిక గమనించునది. ఈ దీవులన్నిఁటను ధర్మమున్నది. ఏదో ఒక తీరుతో ఈశ్వరారాధన మున్నది. కొందఱు సూర్యుని, కొందఱు చంద్రుని, కొందఱు వాయువును, కొందఱు రుద్రుని, కొందఱు బ్రహ్మను ఆరాధింతురు. ఈ దీవు లన్నిఁటియందును కాలము స్వాయంభువ త్రేతాసమము. ఈ త్రేతలో నెవరికిని వాద వివాదము లుండవు. ఇవన్నియు భోగభూములు. అనఁగా భరత వర్షమువంటి కర్మభూములు కావు.

## ప్లక్ష ద్వీపము

ఇది లవణోదకమును పరివేష్టించి యున్నది. విష్ణుమతమున లవణేక్షూదములను పరివేష్టించి యున్నది. ఇది జంబూద్వీపమునకు రెట్టి. ప్లక్షము లనఁగా జువ్వి చెట్టు, లేక కలజువ్వి చెట్టు. కలజువ్వికి గర్దభాండము సంస్కృతము. దీని మొదలు గాడిదవలె నుండును గాన దీనికి గర్దభాండ మని పేరని అమర వ్యాఖ్యాతలు. ఈ ద్వీపాకారము కలజువ్వి కాయలవలె నుండునని అధునాతనలు వ్రాసిరి.1

మత్స్యపురాణము దీనికి గోమేధ మని మఱియొక పేరు పెట్టెను. వాయువు శాకమునకుఁ జెప్పిన భూగోళసంబంధము మత్స్యమున ప్లక్షమునకు సంబంధించును.

## శాల్మల ద్వీపము

ఇది సురోద మను సముద్రమును పరివేష్టించి యున్నది. మత్స్యమతమున దధిసముద్రమును పరివేష్టించియున్నది. ఈ ద్వీపమునందే గరుత్మజ్జననము. ఇందు వానలు లేవు. అట్లని దుర్భిక్షమును లేదు. ఇచటి చాతుర్వర్ణ్యము కపి లారుణ పీత కృష్ణము.2

(1) తెలుఁగువారు జీవమున నుపయోగించు గాడిదగుడ్డునకును. దీనికిని— ప్లక్ష ద్వీపమునకుఁ గాదు లెండు. మఱి కలజువ్వికి ఏమి సంబంధమో విచారించునది.
ఇది టర్కీ. ఇరాకుల నడుమ, లేక ఇరాకే అని శ్రీ జే. సి. రే మతము.

(2) శాల్మల ద్వీపము Asia Minor. దధిసముద్రము Black Sea. సురాసముద్రము Ægean Sea. ఒకానొక కాలమున అసీరియా అసుర దేశము. పుష్కర ద్వీపమునందలి ధాతకి మహావీర ఖండములు అసీరియా బాబిలోనియాలు. అసురజాతిలోఁ బుట్టినవాఁ డొకఁడు శాల్మలేశ్వరుఁడు. అతఁడు క్రీ. వె. పదుమూఁడవ శతాబ్ది వాఁడు. ఆ శాల్మలేశ్వరునిచే ఈ ప్రదేశమునకు శాల్మలద్వీప మని పేరు వచ్చినచో ఈ సప్తద్వీప విభాగము భారత సంగ్రామమునకు వెనుక నని చెప్పవలయును. ఎంత వెనుక? ఆ కాలము స్వాయంభువ త్రేత. స్వాయంభువుని మునిమనుమఁడు భరతుఁడు. కావున భరతవర్షోత్పత్తికి వెనుక. పురాణములలో మన్వంతరముల లెక్క కలదు. వలయువారు అచటఁ జూచునది అని శ్రీ జె. సి. రే మహాశయులు.

## కుశద్వీపము

ఇది సురాఘృతసముద్రముల నంటియున్నది. ఘృతక్షీరోదముల నంటియున్న దని మత్స్యమతము. ఇది శాల్మలముకంటె ద్విగుణమని పూర్వమతము. శాకము కంటె ద్విగుణమని పరమతము.

ఇచట దైతేయులు, దానవులు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు, దేవతలును, వారితోపాటు మానవులును గలరు.

ఇందు హరిపర్వత మను మాఱుపేరు గల మహాపర్వతము అగ్నిపర్వతము. ఇందలి ద్రోణపర్వతము మిఫులఁ బొడవు. దానిమీఁద విశల్యకరణియు, మృతసంజీవనియుఁ గలవు. నడుమ కుశస్తంబ ముండుటఁ జేసి దీనికి కుశద్వీప మని పేరు.3

## క్రౌంచ ద్వీపము

ఇది ఘృతోదకసముద్ర మను సముద్రమును పరివేష్టించి యున్నది. దధి ఘృతసాగర పరివేష్టిత మని మత్స్యమతము.4

ఈ ద్వీపపు జనాభాలో తెల్లనివా రెక్కువ. ఈ ద్వీపమునందు ఉష్ణమనియు, పీవర మనియు రెండు దేశములు కలవు.5

## శాకద్వీపము

ఇది లవణోదధిని చుట్టియున్నది. మఱియు, దధిమండసముద్రము చేతను పరివేష్టితము.

మత్స్యమతమున దీనికి తూరుపున ఇందలి ఏడు కులపర్వతములలో నొకటి యగు మేరువు. దక్షిణమున క్షీరోదము. పడమట క్రౌంచము.

మేరువు తూర్పుకొన పేరు ఉదయాచలము. పడమటికొన పేరు అస్తాచలము. దీనికి మఱియొక పేరు సోమకము. వాయుపురాణమున మేరువునకు పడమట నున్న ఒక ప్రత్యంతపర్వతము పేరు ఉదయాచల మని కలదు.

ఉదయాచలమున మేఘము లుదయించునుగాని కురియవు. అవి అస్తాచలముమీఁది కేగి యట వర్షించును.

ఈ దీవిలో సోమకగిరిమీఁద హిరణ్యాక్షవధ జరిగెను. గరుత్మంతుఁ డమృతము నాహరించిన దిచట. ఇటులే ఈ యేడు దీవులలోను ఏదో యొక పురాణగాథ జరిగినటులు కనఁబడును.

ఇచటి జను లీ యుదయాస్తాచలములమీఁదుగా సూర్యుని ఉదయాస్తమయములఁ జూచుచుందురు.6

---

(3) Caspian Sea కి దక్షిణమునఁ గల Elburz Mts. మహిష పర్వతము కావచ్చును. ఏలన, నిందొక నిప్పుకొండ యున్నది. Caspian Sea ఘృతోదక సముద్రము. Aral Sea క్షీరోదము. క్షీరోదము నుండి ఘృతోదమువఱకును, అనఁగా Caspian Sea నుండి Aral Sea వఱకును కుశద్వీపము. కాస్పియన్ సీకి దక్షిణ పూర్వదిక్కున కుశలును, వానిఁ బోలు గడ్డియు నేఁడును ఎక్కువగా పెరుఁగును. భారత పశ్చిమోత్తరమున కుశాన్, లేక కుషాన్ రాజ్యము కలదు. అది ఇదియే కావచ్చు నని శ్రీ జే. సి. రే.

(4) ఇది కాస్పియన్ సీకిని, బ్లాక్ సీకిని నడుమ మున్నది. కావున అర్మీనియా. ఇందలి క్రౌంచపర్వతము Caucasus Mts. దీనికి ఉత్తరమున రషియా. దీని యింగితము పురాణమునం దెచటను గనఁబడదు. దీని యాకృతి కొంగను బోలునేమో యని శ్రీ జే. సి. రే. ఈ మాట యేమోకాని కాస్పియన్ సీకో కొంగ ముక్కున్నది.

(5) 'ఉష్ణ స్స్మృతో దేశః పీవరస్యాపి పీవరః' (వాయు ౩౩-౨౨)

(6) "ఈ ఉదయాస్తాచలముల మీఁదుగా సూర్యోదయాస్తములను జూచుటకు ఈకొండలలో ఉదయాచలము తూర్పు దక్షిణములుగను, అస్తాచలము పశ్చిమ దక్షిణముగను ఆయతమయి యుండవలయు"నని శ్రీ జే. సి. రే. వీరిది మత్స్యమతము. (వెనుకటి వ్యాసమున మూఁడవ పటము చూచునది) "ఉభయ త్రావగాఢౌ చ లవణక్షీర సాగరౌ" అను మత్స్యపురాణ మతమునకును, మఱియు "ప్లక్షము మొదలగు ఐదు దీవులందును వర్షపర్వతము లడ్డగీఁత గీచినటుల సముద్రమువఱకు వ్యాపించియుండవలె" నను శ్రీధరులకును ఈమతము విరుద్ధము. [ప్లక్షాది పంచద్వీపేషు వర్షాద్రయ స్తిర్యగ్రేఖాకారా ఉభయతోబ్ధిస్పృశ (?) ఇతి గమ్యతే. అన్యథా సప్తభి స్సప్తవర్ష విభాగాఽసంభవాత్. వైష్ణవే వర్షాణాం పూర్వాదిక్రమేణో క్తేశ్చ. భాగ-౫-౨౦] ఇట్టి విరోధమున్నను అది సామాన్యాకారమనియు, ఇది విశేషాకార మనియు అనుకొనవచ్చును. పర్వతముల మీఁదుగా చూచు రను బలము దీని కున్నది.

ఈ శాకదేశములకు రాజు లేఁడు, గద్దె లేఁడు. ఇచట నాలుగు వర్ణములున్నవి. నల్లనివారు నడుమ నున్నారు.

ప్రియవ్రతుని కొడుకు మేధాతిథి రాజు కాఁడా? అతఁడు తన యేడుగురు కొడుకులకును ఈ శాకము నేడు ముక్కలుగా కోసియిచ్చెనని పురాణములలోఁ గలదే యని అడుగుచో నిక్కమే. కాని "ఈ ఐదు దీవులందును రాజు లేఁడు"అని యిమ్మడిగా ఒక మాట ఆ పురాణములందే కలదు. కావున "అచటి ప్రజకు రాజ బాధ లేదు"అని గ్రహించుచో స్వవాక్యవిరోధ ముండదు.

ఈ ద్వీపమున సూర్యారాధన కలదు.

సూర్యుఁడు క్రౌంచద్వీపమునందు ఉత్తరమున కభిముఖుఁడైనపుడు అతఁడు దగు శాకద్వీపము ఉత్తరాంతమున ఉదయించుచుఁ బయికేఁగును.7 (చూ: మూఁడవ చిత్రము.) ఇది శాకవృక్ష బహుళము.8

## పుష్కరద్వీపము

ఇది క్షీరసాగరమును కలిగొన్నది. స్వాదూదధిని చుట్టువారియున్న దని మత్స్యము.

దీవ ధాతకి యనియు, మహావీర(త)మనియు రెండు ఖండములు కలవు. కొనక లేక ధాతకీఖండము ఖండము లని మత్స్యము.9

ఇచట వర్ణప్రసక్తియే లేదు. పశ్వాన్నృతములు లేవు. ఒకరి యెక్కువయు, మఱియొకరి తక్కువయు లేదు. అచటి జనులందఱియు ఒకటే వేషము. వారందఱును దైవసములు. ఇచట ఆహార మప్రయత్నముగా లభించును. ఇది భౌమస్వర్గము. ఇచట మానసోత్తరపర్వత మొకటితప్ప మఱి పర్వతములు లేవు. కాని గిరు లున్నవి. ఆ గిరులనడుమ ఈ రెండు ఖండములు నున్నవి. ఇందలి మానసోత్తరమునకు పురాణ జ్యోతిష ప్రసిద్ధి యున్నది.

## కేతుమాలము

ఇది జంబూద్వీపమునకు పశ్చిమోత్తరముగను ఘృతసాగరమునకు దక్షిణముగను10 ఉన్నది. సప్త ద్వీపవిభాగ మయినపిదప ఇది కేతుమాలదేశము.

## విరోధము

పురాణములలో పరస్పరవిరోధము బహుళము. వాయుమత్స్యాది పురాణములు భిన్నదేశములందు ప్రవచింపఁబడినను ఇంచుమించు సమకాలికములు. వీని లోనే ఇట్టి విరోధము లేల పొసఁగవలయును? ద్వీప ప్రసంగమున వాయ్వాదులు ప్లక్షము నారంభించి పుష్కరాంతముగాఁ జెప్పెను. మత్స్యము శాకము నారంభించి కుశ క్రౌంచ శాల్మల ప్లక్ష పుష్కరములను

---

(7) "శాకద్వీపస్య షష్ఠస్య ఉత్తరాంతోదిత శ్చరన్" (వాయు ౫౦-౧౧౮).

(8) శక శాక పదము లొకటి. శాకద్వీపమునుండి భరతవర్షమునకు వచ్చిన బ్రాహ్మణులు నేఁడు కనఁబడుచున్నారు. వారు శాకద్వీపిబ్రాహ్మణుల మని చెప్పుకొందురు. వీరు సూర్యోపాసకులు. శాకద్వీపమున సూర్యారాధనము కలదు గదా. ఇటనుండి వలసవచ్చిన క్షత్రియులు భరతవర్షమున శకభూపతులు. ఇందు ఉదయాచల పార్శ్వము శుష్కము. ఇచట చలియు, ఎండయు మిక్కుటము. పడమటి భాగమున సంవత్సరమునకు పది పండ్రెండంగుళముల వానలు. కొలఁదిగా కృషి జరుగును. ఇది తొల్లి శాకవృక్ష బహుళమయినను నేఁడు దేవదారు వన బహుళము. ఇందలి లవణసాగరము నేఁటి L. Balkhash. క్షీరసాగరము Aral Sea. పారసీకమున సీర్ దరియా-సీర్=క్షీర, దరియా=సాగరము. సీర్ అనఁగా నదియనియు నొక అర్థము.
Aral Sea లేక క్షీరోదము క్రమక్రమముగా పూఁడుకొనుచు వచ్చుచున్నది. దీని నీరు కొంచెము తెలుపు. రుచి ఉప్పన. లవణసముద్రము, లేక L- Balkhash పొడవు ౩౦౦ మైళ్లు. వెడల్పు ఏఁబది మైళ్లు. అని శ్రీయుతులు జే. సి. రే. వాయుమతమున ఇది యంతయు మాఱును. మత్స్యమతము వీరిది.

(9) ఈ రెండును సిరియా మెసపొటేమియాలు. (వీరు అసీరియా బాబిలోనియా లని వేఱొకచో వ్రాసిరి. ఇవి సిరియా ఇరాకులకు చెందినవే కాన విరోధము లేదు.) మత్స్యము చెప్పిన స్వాదూదధి టైగ్రిస్ యూఫ్రటిస్ నదులు. పుష్కరద్వీపమును, అనఁగా మెసపొటేమియాను ఒకానొకప్పుడు దార్యు లేలిరి. అచటి భూగర్భమున దొరకిన మిత్ర వరుణ నాసత్యాది విషయములే నిదర్శనము అని శ్రీ జే. సి. రే.

(10) ఇది పారసీకాంతర్గత మని శ్రీ జే. సి. రే. ప్లక్షము పారసీకమని కొందఱ అభిప్రాయము.

చెప్పెను. దీనిఁబట్టి ద్వీప మనఁగా నలుతట్టులను నీటిచేఁ జుట్టఁబడవలసిన గుండ్రపు సున్న అను నియమము దుర్బలమయిపోయినది. మండల మనఁగా ప్రదేశము కాని గుండ్రమును భూమియే అని నిష్కర్ష కాదు. అన్వీక్షకి చెప్పిన ద్వాదశ రాజమండలములు భూప్రదేశములే కాని కంపాసుతో చుట్టిన గుండ్రని సున్నలు కావు.

'ఉదకముల కాధానములు కావున ఉదధు'లని పురాణము నిర్వచించుచున్నది 14. 'కాఁచినచో పొంగినటులు పొంగుచుగావున సముద్రము'లని నిర్వచనము 15. ఇటులు పురాణములు సముద్రమునకు వ్యుత్పత్తి చెప్పుటయేకాక పర్వములందు సముద్రములు ౫౧౦ అంగుళుల యెత్తు పొంగుచును అని చెప్పెను. అనఁగా సముద్రపు మట్టమునుండి (నదులలో) పొంగుచు పోటు ౫౧౦ అంగుళుల యెత్తువఱకు వ్యాపించు నని దీని కర్థము. ఎంత సూక్ష్మముగా పురాణములు పరిశీలించి చెప్పెనో పరికించునది 16. ఇది సత్యముగునో కాదో విజ్ఞులు విమర్శించునది.

మఱియు 'పర్వములు లేనివి గిరులు, పర్వములు కలవి పర్వతములు. కాఁబట్టి ప్లక్షమండలి గోమేదము పర్వతము' అని పురాణము ఉదాహరణపూర్వకముగా పర్వతమునకు నిరుక్తి చెప్పినది. కావున ఇది యంతయు భూవిన్యాసవర్ణనమే యని అనుకొని దీనికి నేఁటికిని గల సాదృశ్యమును కనిపట్టుటకు ప్రయత్నము చేయుట నేలవిడిచి సాము చేయుట కాదు. కావున మనము మనకు చేతనయినంత సాము నీ నేలమీఁదనే చేసిచూతము.

ఇది కొన్ని వేలయేండ్లక్రిందటి భూగోళము. అది యెన్నిమార్పు లొందెనో ఎవ రెఱుఁగుదురు! సరస్వతీ నది పూఁడిపోయెను. తెథిస్ భూగర్భమునకు పోయెను. తొల్లి సముద్ర మున్న చోటునఁగదా నేఁటి హిమాలయము. సహారా ఒకప్పుడు సముద్రము! మొన్న భూకంపమున బీహారులో ఒక నది యేమాయెనో తెలియనిది కాదు. నేఁడు మన కనులయెదుట హిందూస్థానము మీఁద పాకిస్థాన్ అదిష్టమయినది. 'పురా యత్ర స్రోతః.' అట్టికతి నాఁటి ద్వీపములు బద్ధించినటులు కనఁబడక పోయినంతమాత్రమున నిది యంతయు కల్లయని అంగీకరించుటకు ప్రతికూలసాక్ష్యమును కొంత కలదు.

పురాణములందలి సముద్రవాచకములు నదీ హ్రద సముద్ర వాచకములు. ఆసియాఖండము పడమటిసగమున నేఁడు నాలుగు పెద్దహ్రదములు కలవు. చిన్నవియు రెండుకాఁబోలు ఉన్నవి. సిర్‌దరియావంటి నదులు ఐదాఱు కలవు. ఇరాన్ ఇరాకుల కంటె పర్షియన్ గల్ఫ్ కలదు. టర్కీచుట్టు మెడిటరేనియన్ సీ కలదు. దీనినిఁబట్టి ఆ ద్వీపములను, ఆ సముద్రములను ఏల పోల్పరాదు!

సరియు. ఈ క్షీరోదమునందును, ఘృతోదమునందును పాలు నేతులున్న వా? లేవు; తిన్నంతయుప్పే కలదు. అగుచో ఇది వాస్తవము లెటులగు ? ఈ కవిత్వమున కర్థము చెప్పవలసినంత దారిద్ర్యము మన కబ్బినది. ఐనను ప్రయత్నింతము. కొల్లేటిలో సమయభేదములచే మంచినీరును, ఉప్పునీరును ఉండును. దీనికి ఏఱనియు, హ్రదమనియు, సముద్రమనియును వ్యవహారము చూచు

(14) 'ఉదక స్యాధానం యస్మాత్తస్మా దుదధి రుచ్యతే' (వా. ౪౯-౧౩౧)
'ఉద్భిదా న్యుదకాని స్మ గ్గిరి ప్రస్రవణానిచ' (మ-౧౨౩-౨౫)

(15) 'అపాంచైవ సముద్రేకా త్సముద్రా ఇతి సంజ్ఞితాః' (వా. ౪౯-౧౨౪)
'దశోత్తరాణి పంచైవ అంగుళీనాం శతానితు,
అపాం వృద్ధిః క్షయో దృష్టః సముద్రాణాంచ పర్వసు' (వా. ౪౯-౧౩౧)

(16) ఈ శ్లోకమునకు వెన్నెలకంటి సూరన భిన్నముగా వ్రాసెను :
తే. అబ్ధి లేదును జంద్రోదయాస్తకలిత-వేళలందును గాఁగిన పాలఁబోలె
మీఱి వేయింటిమీఁద నేనూఱు వ్రేళ్ల-పొడవు పోటును నాటునై పొలుపు మిగులు. (విష్ణుపురాణము-౩-౨౬)
పై శ్లోకము వాయు విష్ణు బ్రహ్మాండ మత్స్యపురాణములందు సమము. 'దశోత్తరాణి పంచాశత్' అని మత్స్యము.

చున్నాము. ఇఁక చిలకసముద్రములో చిలక లేదు. హాంసిక్ సాగర్‌లో అంతయు మంచినీరే. ఇది అసలు సాగరముగు లేకదా! స్థలాదిసంయోగాదులచేఁ గలిగిన రంగు, రుచి, సరుగు మొదలగు నెన్నిటినో బట్టి భావన వర్తించిన ఫలముగా వీని కీపేరులు కలిగెను. వృక్ష శాఖాలక్షణమునఁ గొన్ని దీవుల కావృక్షచిహ్నముగా సంకేత మని పురాణమే చెప్పెను.

ఇక్కడ భూభాగముకన్న జలభాగము లెక్క కట్టఁగా విపరీతముగా నుండవలయుఁ గదా. అట్టి దిప్పుడు ఇసుమంతయుఁ గనఁబడదేమి!

ఇక్కడి జలభాగము చాలవట్టు నశించియుండును. అందులకుఁ గల సాక్ష్యము కొంత వెనక నుదాహరించితిని. అదియుఁగాక సరిగా గట్టి అని నిష్కర్ష లేదు. 'అచటి భూమి కనుగుణముగా సముద్రము కల' దని పురాణము లే నడుమనడుమ మనలను హెచ్చరించుట కనఁబడును.

ఇచటి కొండలును, నదులును ఏడేడేనా? ప్రియవ్రతుని కొడుకు లేడుగురే కా? వారిలో మరల నొక్కొక్కని కేడుగు, రేడుగురే గా! తెలుఁగువారి కేడుసంఖ్య అమంగళమని భ్రమ. కాని ప్రాచీనుల కీ 'సప్త' మంగళము. ఉత్తర కురువులలో ఆదిమమనుష్యులు, లేక ఋషు లేడుగురు. ఆకాశమున ఋషు లేడుగురు. లోకము లేడు. ఇటు లీ సప్తసంఖ్యాకములయినవానిని పరిగణించుచుఁ బోయినయెడల కొన్ని టావులు పట్టును. వాయుపురాణ మేడే యేమి!' అని శంకించి 'ఏడే యుండవలె'నని చెప్పి కారణము చెప్పఁబోయి చెప్పమఱచి వటులు కనిపించును. కావున దానిని ప్రాచీనవాఙ్మయ మెఱిఁగిన పాఠకులకు వదలుదును. ఈయేడులు కొన్ని ప్రక్షిప్తము కావచ్చును.

కొండలును, నదులును ప్రకృతిసిద్ధములు ఎల్లలు. దానఁ జేసి ఆ కాలమువారు వాని నెల్లలుగా నుపయోగించుకొని రనుకొనుట యుక్తము. ఈ విషయమున మొన్న నీ నడుమ (శ్రీ) డా. అంబేడ్కర్, కొండరి కమిషన్ గుఱించి చెప్పిన మాటలు పాఠకులకు గుఱుతురాఁగలవని తలఁతును. కొన్ని వేల యేండ్లక్రింద యూఫ్రేటిస్ తీరము నందలి బాబిలన్, కేంద్రముగాఁ గల బాబిలోనియా యును, టైగ్రిస్ తీరమునందలి నినెవె కేంద్రముగాఁ గల అసీరియాసామ్రాజ్యమును వచ్చిన హైకలలో భూమ స్వర్గము లని విఖ్యాతములు. అచటలేకదా మిశ్రవరుణ నాపత్యాది విషయసంగ్రహము భూగర్భములో కానిపించినది! ఇది పుష్కరద్వీపమని తోఁచుట కే పురాణ పాఠకునకు నిసుమంతయు ప్రయత్న మక్కఱలేదు. కావున లోభనీయమయిన యీ పుష్కరద్వీపమునందును, శాకద్వీపమునందును సూర్యనక్షత్రసంచారమును సూక్ష్మముగా పరిశీలించి ఆ పురాణము లేమి చెప్పెనో చూతము.

"రవి దక్షిణమునుండి మరలి విషువమునం దుండు నప్పుడు పాలపుంత ఉత్తరాంతమున నదయించును' 17. 'పుష్కరమునడుమనుండి రవి పోఁవుతతి 30 దవ భాగ. అది రవికొక ముహూర్తగతి.' 18.

'వైశ్వానరపథమునకు వెలుపల నున్నప్పుడు రవి మొదటివెలుఁగు పుష్కరమునుండ ప్రవర్తించును' 19.

(17) "దక్షిణా ద్వినివృత్తో సౌ విషువస్థో యదా రవిః,
క్షీరోదస్య సముద్రస్య ఉత్తరాంతోదిశ శ్చరన్." (వా. ౫౦-౧౨౩)

(18) "ఏవం పుష్కరమధ్యేన యదా సర్పతి భాస్కరః,
త్రింశాంశకంతు మేదిన్యా ముహూర్తేనైవ గచ్ఛతి" (వా. ౫౦-౧౧౮)
వా. వి. మ. లలో ఈ శ్లోకమే అక్షరభేదముతో ఏకార్థకముగా నున్నది. (చూ. విష్ణు ౮-౮-౨౮, ౨౮; మత్స్య-౧౨౪....౪౦....౪౮)

(19) "లోకసంతానతో హ్యేష వైశ్వానరపథా ద్బహిః
పృష్ఠే ద్యావ త్పురిలా సౌరి పుష్కరా త్సంప్రవర్తతే" (మ. ౧౨౪-౮౧)

'రవి ఉత్తరాయణమున అంత దీవి యందు శాక ద్వీపపు ఉత్తరాంతమున శ్రవణమునం దుదయించును' 20

మత్స్యపురాణమును పుష్కర మేరువ దీవి. దీని లోనివానిరెండింటికే భేదము. కావున మత్స్యము గూడ ముప్పదిభాగలం చెప్పెను.

భాగవత మీ పుష్కరమును క్షీరోదమునకు పరముగను, స్వాయమాదకముచే బహిరాత్రతమును జెప్పి మేరువును వలగొను రవి యింటి మానసోత్తర మను కుల గిరి మెట్టి ఉత్తరదక్షిణాయనముల నేర్పఱచును అని (౫-౨౦) చెప్పెను. దీని నన్నింటి బట్టి యీ దిగువ సంగతులు తేలుచున్నవి:

౧. రవి పాలపుంతకు ఉత్తరాంతమున నుదయించును. అప్పుడు విషువము.

౨. అందుచేత శాకద్వీపమునందు శ్రవణమున రవి యుండఁగా ఉత్తరాయణారంభము.

౩. రవి పుష్కరద్వీపమున మీనమునందు నుండఁగా ముప్పదవ నక్షత్రాంతము అది రవికి మహోత్తరగతి. దీనికి దిగువ చేర్పు.

వేదాంగజ్యోతిషకాలమున ధనిష్ఠ ఉత్తరాయణారంభకము. ధనిష్ఠ ముప్పది మూడు న. అక్షాంశములో నున్నదని దానికి గలదు. గర్గజ్యోతిషములో ఒక విశేష మున్నది. దీనికి ఉత్తరపు రేఖ వంగా వక్రగతి. ఈ ధనిష్ఠ క్రీ. పూ. ౧౩౭౨ సం॥ ౨౨ డిసెంబర్ ప్రాంతమున సూర్యునకు గంటయు నర ముందుగా ఉదయించి ఒక అరగంటకయినను కానిపించుచుండి యుండవలయును. క్రీ. పూ. ౪౦౧ లో శ్రవణమునకు గలిగిన ఒక విశేషము: విశ్వామిత్రుండు లోగడ నున్న నక్షత్రారంభమును విధ్వంసముచేసి మహాగ్రహమున శ్రవణముతో నక్షత్రారంభమును జేసెనని భారత రామాయణములలో నొక కథ కలదు.

'ఒకానొక మహారాజసభలో (మహాపద్మనందుడు కావచ్చును) విశ్వామిత్రుడను మహాజ్యోతిషికుడొకడు కన్నారఁ జూచియు, వాదించియు క్రాంతివృత్తప్రథమబిందువు శ్రవణముకాని ధనిష్ఠ కాదని నిరూపించుట యీ కథయొక్క చమత్కారము. (చూ: The first p int of Asvini.)




(20) "శ్రవణే చోత్తరాం కాష్ఠాం చిత్రభాను ర్యదా భవేత్, శాకద్వీపస్య షష్ఠస్య ఉత్తరాంతోదిత శ్చరన్" (వా. ౪౬-౧౨౦)



న్యూఢిల్లీలోని 'కాన్స్టిట్యూషనల్ హాలు'-భారత స్వాతంత్ర్య ప్రపానకలాప మంతయు ఈ భవనములోనే జరిగినది.

# విష్ణువర్ధనమల్లపదేవుని పిఠాపురశాసనము

— శ్రీ యం. వెంకటేశ్వర్లు —

విష్ణువర్ధనమల్లపదేవుని పిఠాపురశాసనమువలన చెప్పబడిన విషయములలో ఒకదానిని నేనిచ్చట విమర్శించుచున్నాను. క్రీ. శ. పండ్రెండవ శతాబ్ది ప్రారంభము నాటి వేంగీ, లేక ఆంధ్రదేశమును గూర్చి ఆ శాసనము కొంత వర్ణించియున్నది.

విక్రమచోళుని యనంతరము వేంగీరాజ్యము నాయకరహితమై పోయెననియు, ఆ కారణముచే అరాజకమునకు పాలయ్యెననియు ఆ శాసనమున గలదు. అట్లు కొన్నాళ్ళైన తర్వాత, తూర్పుచాళుక్యవంశమునకు చెందిన పిఠాపురరాజుల వంశావళిని—బేతవిజయాదిత్యుని మొదలుకొని మల్లపదేవునివరకు వర్ణించినది. విష్ణువర్ధనమల్లపదేవుని శాసనము క్రీ. శ. ౧౨౦౨ నాటిది.

విక్రమచోళుడు ఆంధ్రరాజ్యమునుండి చోళదేశమునకు క్రీ. శ. ౧౧౧౮ లో వెడలెను. ఆ సమయమున దాని పరిపాలన కెవ్వనిని నియమించకయుండెనా? అరాజకమే యున్నచో పరిపాలనాధికారి లేకపోవుట వల్లనా, లేక ఇతరకారణము లెవ్వైనను గలవా?

క్రీ. శ. ౧౧౧౮ నాటి ఆంధ్రదేశ పరిస్థితులను గూర్చి ఈ శాసనమున తెలుపబడిన విషయములను మన మంగీకరింపజాలము. ఈ శాసనము క్రీ. శ. ౧౧౧౮ నాటికి చాలదూరముగ నున్నది. పైగా రమారమి అదే కాలమునాటి శాసనములు అట్టి అరాజకమునుగాని, తూర్పుచాళుక్య పిఠాపురరాజులను గూర్చిగాని తెల్పుట లేదు. ముఖ్యముగ పై ఒక్క శాసనము తప్ప పిఠాపుర రాజుల శాసనములుకూడ ఈ విషయములను పేర్కొనుట లేదు. ఈ శాసనమునే ఆధారముచేసుకొన్నచో, ఏమగుననగా, విక్రమచోళుని యనంతరము తూర్పుచాళుక్యపిఠాపురరాజులు ఆంధ్రదేశమును పరిపాలింపసాగిరి అనునట్లుగా దోచును. కాని అది నిజముకాదు. ఏలనన, వారి శాసనములు చాలాకాలమువరకు అగుపడుట లేదు. పైగా ఇతర ఆంధ్రనాయకులుకూడ వారిని గూర్చి ఏ విషయములను తెలుపుట లేదు. రమారమి నూటయేభై సంవత్సరముల కాలము ఆంధ్రదేశమును వెలనాటిచోడరాజులు చందవోలును రాజధానిగా చేసుకొని, చాళుక్య-చోళరాజుల సామంతులుగ పరిపాలనచేసిరి. అందుచేత ఈ సందర్భమున మనము గుర్తించవలసిన విషయము వెలనాటిరాజుల విజృంభణ.

మొదటి కులోత్తుంగచోళుడు చాళుక్య-చోళ సామ్రాజ్యము నేర్పఱచి, తన యధికారమునకు ఆంధ్ర రాజ్యమును లోబరచెను. చాళుక్య-చోళచరిత్ర నెరిగినవారికి అతడు తన కుమారులను ఒకరివెంట నొకరిని రాజప్రతినిధులుగ ఆంధ్రరాజ్యమునకు పంపెనని తెలియును. అట్లు పంపబడినవారిలో ఆఖరువాడే విక్రమచోళుడు. రాజప్రతినిధులను నియమించుటయే గాక అదేకాలమున వారితోపాటు, వారికి సహాయపడు

---

౧. E. I. IV. No 33.

౨. Ibid. L. 61 "...విక్రమచోడనామా చాళు[క్య] [వంశ] జలధేః పరిపూర్ణచంద్రః తస్మిన్ స్వర్గగత[వు]

L. 13 ద్రావిడ [నా]మని [చో]డమండలం [ద్రా]ఘుం గతవతి వెంగీభూమిర్ నాయకరహితా ......etc.

నట్లుగా నుండుటకై, తనకు హెచ్చు నమ్మకముగల సుప్రసిద్ధ శూద్రవంశజులైన వెలనాటి నాయకులను పరిపాలనకై నియమించెను. కులోత్తుంగుని సమకాలికుడు వెలనాటి మొదటి గొంకరాజు. మొదటి గొంకరాజు, అతని కుమారుడు మొదటి చోడరాజు రాజప్రతినిధుల కాలమున తమ సామర్థ్యములను వెల్లడించి, చాళుక్య-చోళుల యుద్ధములలో పాల్గొని వారి మెప్పు బడసిరి. చాళుక్య-చోళులతో ఎక్కువగ కలసిమెలసి, వెలనాటిరాజులు తమ యధికారమును ఆంధ్రరాజ్యముపై రెండవ గొంకరాజు (క్రీ. శ. ౧౧౩౨-౧౧౬౩) కాలమునాటికి పరిపూర్ణముగ స్థాపించుకొనగలిగిరి. ద్రాక్షారామశిలాశాసనములనుండియును[3], పృథివీశ్వరుని పిఠాపురశిలాశాసనము నుండియును[4], అనేక యితరశాసనములనుండియు వెలనాటిరాజులు చాళుక్య-చోళుల పక్షమున కొంతయు ప్రసిద్ధులైనట్లును, వారిచే 'ఆంధ్రవిషయ'మునకు అధిపతులుగ నియమింపబడినట్లును తెలియవచ్చును. వెలనాటి మొదటి గొంకరాజు కులోత్తుంగచోళునినుండి ఆంధ్రమండలాధిపత్యమును పొందెను. అతని కుమారుడు వెలనాటిచోడుడు కులోత్తుంగుని దత్తపుత్రుడని పృథివీశ్వరుని పిఠాపురశిలాశాసనమున చెప్పబడియున్నది. అతడు వేంగి ౧౬౦౦౦ లకు అధికారిగ నియమింపబడెను. మొదటి చోడరాజుకుమారుడైన రెండవ గొంకరాజు (క్రీ. శ. ౧౧౩౨-౧౧౬౩) శాసనము లనేకములు మనకు దొరకినవి. వానివలన అతడాంధ్రమునంతను చాలవరకు పరిపాలించినటుల తెలియును. వెలనాటి రాజులనేకులు ఈ విధముగ మొదటి గొంకరాజు (క్రీ. శ. ౧౦౭౬-౧౧౦౮) మొదలుకొని పృథివీశ్వరుని (౧౧౮౬-౧౨౧౦) వరకు ఆంధ్ర దేశమున చాలభాగమును పరిపాలించిరి. తదితర ఆంధ్ర నాయకులు వారికి సామంతులై చిన్నచిన్న రాజ్యముల నేలుకొనుచుండిరి. అట్టివారే కోటరాజులు, ఇవని కొండపడమటి నాయకులు, కొలని రాజులు, పాకనాడును, కమ్మనాడును ఏలిన తెలుగు చోడరాజులు, తదితరు లనేకులు. వెలనాటి రాజులు పేరునకుమాత్రమే చాళుక్యచోళరాజుల సామంతులుగ నుండిరి. దీనికి నిదర్శనము, తమ శాసనములందు వారు చాళుక్య-చోళరాజుల రాజ్యపాలన వర్షములను పేర్కొనుటయే. వెలనాటిరాజు లేలిన కాలమున ఆంధ్రదేశమున తదితరవంశములవారి శాసనము లేవియు విస్తారముగ గానరావు. అసలు, తూర్పు చాళుక్యపిఠాపురరాజులనుగూర్చి, హెచ్చుగ తెలుపు శాసనములుగూడ లేవు. దీనినిబట్టి తూర్పుచాళుక్య పిఠాపురరాజులు, విక్రమచోళుని యనంతరము ఆంధ్రరాజ్యమును పాలించినట్లు ఎట్లు ఊహింపగలము?

ముఖ్యముగ పైశాసనములవలన తెలియునదేమనగా, విక్రమచోళుని యనంతరము, అనగా క్రీ. శ. ౧౧౨౭ నుండి చాళుక్య-చోళరాజులు ఆంధ్రదేశమునకు తమ వంశములోనివారిని రాజప్రతినిధులుగ పంపు వలవాటును వదలుకొనిరి. దీనికి కారణము వెలనాటి నాయకుల యధికారము విజృంభించుట యొకటి, వారు చాళుక్య-చోళరాజుల క్రమశిక్షితులుగ నుండి, వారికి సామంతులుగ నుండుట. పైగా విక్రమచోళుడు ఆంధ్రదేశమును వదలిన కాలమునకే వెలనాటిచోడుడు తన యధికారమును స్థిరముగ స్థాపించుకొనియుండెను. తన యధికారమును ధిక్కరింప సామర్థ్యముగల ఆంధ్రనాయకులు వేరెవ్వరు క్రీ. శ. ౧౧౨౭ లో లేరు. తర్వాత కొద్ది సంవత్సరములకు అరాజకము సంభవించెను. దానికి కారణము పశ్చిమచాళుక్యరాజులు ఆంధ్రదేశముపై గావించిన దండయాత్రయే. కాని దానికిని, విక్రమచోళుకు చాళుక్య-చోళసామ్రాజ్యమును వీడుటకును ఎట్టి సంబంధము లేదు.

విష్ణువర్ధనమల్లపదేవుని శాసనము వెలనాటి రాజుల పరిపాలనమునుగూర్చి తెలుపకపోవుట చరిత్రకారులెల్లరు ముఖ్యముగ గుర్తింపవలసిన విషయము. కొంత విమర్శ చేసిన దీనికి కారణమేదియో విశదమగును.

మల్లపదేవుడు మూడవ గొంకరాజు (క్రీ. శ. ౧౧౮౦-౧౧౮౬) యొక్కయు, ఇతని కుమారుడైన వెలనాటి పృథివీశ్వరునియొక్కయు శత్రువు. ఈ విష

3. 1182 IV. S. I. I; 1142 IV. S. I. I. (from Draksharama)

౪. E. I. IV. No. 4.

యము అప్పటి శాసనములను పరిశీలించినచో బయట పడును. వెలనాటి రెండవ చోడరాజు (క్రీ. శ. ౧౧౬౩-౧౧౮౧) తరువాత ఆంధ్రదేశము వెలనాటిరాజుల యధికారము క్షీణింపసాగెను. అతని పుత్రుడే మూడవ గొంకరాజు. తండ్రి పాలించుచున్న కాలముననే, మూడవ గొంకరాజు యువరాజుగ వెలనాటి రాజ్యములోని యుత్తరభాగములను కనిపెట్టుకొనియుండెను. ఇది యెట్లు తెలియుననగా, రెండవ చోడరాజు పరిపాలనకాలము నాటి శాసనములు రెండు, గొంకరాజువి, వెలనాటి రాజ్యములోని యుత్తరభాగమున అగుపడినవి.౫ రెండవ వెలనాటి చోడుని యనంతరము, వెలనాటి రాజుల శాసనములు చందవోలు, గుంటూరు ప్రాంతములం దెచ్చటను గానరావు. అప్పటినుండి వారి శాసనములు ద్రాక్షారామమునుండియో, పిఠాపురము నుండియో, లేక యుత్తరమున శ్రీకూర్మము, విశాఖపట్టణము మున్నగు ప్రాంతములనుండియో లభించినవి.

మూడవ గొంకరాజు కడు సమర్థుడుగ నగుపడడు. తనతండ్రి చోడుని పరిపాలనకాలముననే, అతడు తన అసమర్థతను కొంత చూపినట్లుగ నున్నది. ఏలననగా, ద్రాక్షారామమున విష్ణువర్ధనుని శాసనములు ఆ కాలము నాటి కనుపడినవి. వాటిలో మొట్టమొదటిది క్రీ. శ. ౧౧౭౯ నాటిది.౬ మరొక శాసనము అతని నాల్గవ రాజ్యపాలన వర్షమును పేర్కొనుచున్నది.౭ ఇంకొకటి క్రీ. శ. ౧౧౮౫ నాటిది.౮ వెలనాటిరాజులకు శత్రువైన కాకతీయరుద్రదేవుని శాసనము క్రీ. శ. ౧౧౮౬ నాటిది౯ ద్రాక్షారామమున గలదు. ఆ శాసనము సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుని, అతని ఐదవ రాజ్యపాలనవర్షమును పేర్కొన్నది. పిఠాపురశాసనమున చెప్పబడిన సర్వలోకాశ్రయవిష్ణువర్ధన మల్లపదేవుడును, ద్రాక్షారామశాసనమున పేర్కొనబడిన సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుడును ఒకరే యనుటకు సందియము లేదు.

పై శాసనములవల్ల తెలియునదేమన, క్రీ. శ. ౧౧౭౯ నుండి సుమారు క్రీ. శ. ౧౧౮౬ వరకు విష్ణువర్ధనమల్లపదేవుడు ద్రాక్షారామము నేలుచుండెను. చాలాకాలమువరకు ద్రాక్షారామము వెలనాటిరాజుల యధికారమున నుండెను. బహుశః విష్ణువర్ధనమల్లపదేవుడు వెలనాటిరాజుల యధికారము క్షీణించుటను జూచి, వారేలుచుండిన కొన్ని ప్రదేశములనైనను జయింపనెంచియుండును. కాకతీయరుద్రదేవుడు వెలనాటిరాజులకు శత్రువగుటచే, విష్ణువర్ధనుని యధికారము నంగీకరించెను. వీటన్నిటిలోన్న ముఖ్యముగ మనము గుర్తింపవలసినది మూడవ గొంకరాజు విష్ణువర్ధనుని యధికారము నంగీకరించుటయే. క్రీ. శ. ౧౧౭౭ నాటి గొంకరాజుని ద్రాక్షారామశాసనము.౧౦ ఈ శాసనము విష్ణువర్ధనుని, అతని నాల్గవ సామ్రాజ్య వర్షమును పేర్కొనుచున్నది. అదీగాక చాలా కాలము వెలనాటిరాజులు స్వతంత్రులుగ పాలించుచుండిరిగదా! వెలనాటి గొంకరాజేల విష్ణువర్ధనుని రాజ్యపాలనవర్షములను తన శాసనమున పేర్కొనవలెను? దీనినిబట్టి తెలియున దేమనగా, వెలనాటి గొంకరాజుని యధికారము క్రీ. శ. ౧౧౭౭ నుండి అడుగంటసాగెననియే.

మూడవ గొంకరాజు పరిపాలనకాలము (క్రీ. శ. ౧౧౮౦-౧౧౮౬) నాటి శాసనము లేవియు అగుపడక పోవుట ముఖ్యముగ గమనించవలసిన విషయము. విష్ణువర్ధనమల్లపదేవుడు గొంకరాజును తుదకు పదభ్రష్టునిగ జేసియుండవచ్చును.

పృథ్వీశ్వరుని పిఠాపురశాసనము౧౧ నాటికి, అనగా క్రీ. శ. ౧౧౮౬ లో మూడవ గొంకరాజు తన రాజ్యమును కొంతవరకు సంపాదించిన ట్లగుపడుచున్నది.

---

౫. 1168 IV S *I I* from Draksharama and 36-1912 ARE from Rajamundry.

౬. 1265 *IV*. S. *I*. *I*.

౭. 1176 *IV*. S. *I*. *I*.

౮. 1201 *IV*. *S* *I* *I*.

౯. 1155 *IV* S. *I*. *I*.

౧౦. 1168 *IV*. S. *I*. *I*. from Draksharama.

౧౧. E. I. *IV* No. 4.

ముఖ్యముగ, పృథివీశ్వరుని పిఠాపురశాసనమునుండి, వెలనాటిరాజులు-అనగా ఇతడు, ఇతని తండ్రి మూడవ గొంకరాజు విష్ణువర్ధనుని ముఖ్యపట్టణమైన పిఠాపుర మున తమ యధికారమును స్థాపించినట్లు తెలియును. ఎట్లన, మూడవ గొంకరాజుని పట్టమహిషి యగు జాయాంబిక ప్రోలునాడులోని నరభుంజెవాడను దానముచేసె నని ఈ శాసనము చెప్పుచున్నది. మల్లపదేవుని పిఠాపుర శాసనమునుండియు, తూర్పుచాళుక్య పిఠాపురరాజుల యితరశాసనములనేకములనుండియు, వారు పాలించుచుండిన ప్రదేశము ప్రోలునాడని తెలియుచున్నది. పృథివీశ్వరుని పిఠాపురశాసనమువల్ల మన మూహింపవలసిన విషయమేమనగా, మూడవ గొంకరాజు, అతని కుమారుడు వెలనాటి పృథివీశ్వరుడు, విష్ణువర్ధనుని రాజ్యమైన ప్రోలునాడును క్రీ. శ. ౧౧౮౬ లో జయించి, పిఠాపురము నేలసాగి రనియే. అనగా వెలనాటి పృథివీశ్వరునికిని, విష్ణువర్ధన మల్లపదేవునకును అతి మొదలు శత్రుత్వము ప్రారంభ మయినట్లు విశదమగుచున్నది.

ఈ విధముగ శత్రుత్వ మేర్పడుటచేతనే విష్ణువర్ధనమల్లపదేవుడు తన పిఠాపుర శిలాశాసనమున, విక్రమచోళునివరకు గల చాళుక్యచోళులయొక్కయు, తూర్పు చాళుక్యవంశజులైన పిఠాపుర రాజుల యొక్కయు వంశావళులను చెప్పెనేగాని, విక్రమ చోళుని యనంతరము ఆంధ్రరాజ్యమును సుమారు రెండువందల సంవత్సరముల కాలము పాలించిన వెలనాటిరాజులనుగూర్చి వర్ణింపలేదు.

ఇంకొక విషయము. విష్ణువర్ధనమల్లపదేవుని తామ్రశాసన మొకటి మనకు దొరకినది.[౧౨] అది క్రీ. శ. ౧౧౯౫ నాటిది. తర్వాత కాలమునాటి పిఠాపుర శాసనములలోనే, ఇదికూడ చాళుక్యచోళరాజుల వంశావళులను, విక్రమచోళునివరకు, శేతవిజయాదిత్యుని నుండి విష్ణువర్ధనమల్లపదేవునివరకు గల తూర్పుచాళుక్య పిఠాపురరాజుల వంశావళిని చెప్పుచున్నదేగాని, విక్రమ చోళుని తర్వాత, వేంగీమండలము నాయకరహితమై నటులగాని, అరాజకమునకు పాలయినట్లుగాని వచింపలేదు. ఒకేరాజుయొక్క శాసనములందు, ఈ సందర్భములు వేర్వేరుగా ఏల తెలుపబడవలెను? ఒకటి మాత్రము మన మూహింపవచ్చును. విష్ణువర్ధనుని తామ్రశాసన కాలమునాటికి వెలనాటి పృథివీశ్వరుడు తన యధికారమును గొద్దిగనో, గొప్పగనో స్థాపించగలిగెను. విష్ణువర్ధనుని కడివరకు ఉన్న అధికారము అడుగంటెను. కాని, పిఠాపుర శాసనమునాటికి, అనగా క్రీ. శ. ౧౨౦౨ నాటికి పరిస్థితులు మారసాగెను. పృథివీశ్వరుని యధికారము మెల్లగ తొలగిపోవ నారంభించెను. విష్ణువర్ధనుడు మున్నగు నాయకులు మరల తమ తలల నెత్తసాగిరి. వెలనాటిరాజులన్న ఇంక ఎవరికి భయము లేకుండెను. పరిస్థితు లీవిధముగ నుండగా, పైగా వెలనాటిరాజులు శత్రువుగ భావించిన మల్లపవిష్ణువర్ధనుడు వెలనాటిరాజులనుగూర్చి యేల తన శాసనమున చెప్పును?

పై విషయములవల్ల తెలునది ఏమనగా, విక్రమ చోళునితర్వాత ఆంధ్రరాజ్యము నాయకరహితముగ నుండలేదు. అరాజకమునకును పాలుకాలేదు. వెలనాటి మొదటి చోడరాజు ఆంధ్రరాజ్యమునకు ప్రభు వాయెను. కాని మల్లపదేవుని పిఠాపుర శాసనము విక్రమచోళునితర్వాత సంభవించిన ఆంధ్రరాజ్య పరిస్థితులకు నాధారముగ తీసుకొనలేము. అప్పటి రాజ్య పరిస్థితులపై అది గావించిన వర్ణన నిజమునకు దూరముగ నున్నదని మనము నిర్ధారణ చేయవలసియున్నది.

౧౨. C. P. 10 1916-17 ARE.



# గిరీశంగారిఅధికప్రసంగాలు

— శ్రీ సెట్టి ఈశ్వరరావు —

## ఆంధ్రమహాపురుషుని పునరవతరణం

(మా ప్రత్యేక విలేఖరి)

మద్రాసు, ఆగస్టు 8:

విశ్వవిఖ్యాత ఆంధ్రమహాపురుషులూ, సంఘసంస్కరణోద్యమభీష్ములూ అయిన శ్రీ యస్. గిరీశంగారు తమ స్వస్థలం విజయనగరంనుండి నిన్నటి కలకత్తా మెయిలులో మద్రాసు విచ్చేశారు. వారికి స్వాగతం యివ్వడానికి వచ్చిన ఆంధ్ర, ఆంధ్రేతర ప్రముఖులతో సెంట్రల్ స్టేషన్ కిక్కిరిసిపోయింది. ప్లాట్‌ఫారంమీదికి రావడం సాధ్యంకాక, స్టేషన్ ఆవరణలోనూ కాంపౌండ్‌లోనూ, చివరికి రోడ్లమీదా, గోడలమీదా, చెట్లమీదాకూడా, శ్రీగిరీశంగారి దర్శనంకోసం ప్రజలు తండోపతండాలుగా కనిపెట్టుకునిపడివున్నారు. ఈసందర్భంలో ప్రశంసనీయమైన బందోబస్తులు చేసి, జనాన్ని అదుపాజ్ఞల్లో పెట్టిన మద్రాసుపోలీసుశాఖ వారినీ, వివిధసంస్థల స్వచ్ఛంద సేవకులనూ యెంతైనా అభినందించవలసివుంటుంది.

కలకత్తా మెయిల్ కనుచూపుమేరలో కనిపించగానే, గిరీశంగారిని ఆహ్వానించడానికి గుమిగూడిన వారిలో—యెంత హీనంగా చూసినా, లక్షమందైనా అక్కడ వుంటారని అభిజ్ఞవర్గాల అంచనా—ఉత్సాహం వెల్లివిరిసింది. రైలు ప్లాట్‌ఫారాన్ని సమీపిస్తున్న కొద్దీ జయజయధ్వానాలు మిన్నుముట్టేయి. "బోలో గిరీశంగారికీ—జైయ్", "సెపొలిషన్ ఆఫ్ ఆంటీనాచ్‌కి జైయ్" మొదలైన నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయంటే అతిశయోక్తి యేమీ లేదు.

రైలు ప్లాట్‌ఫారంమీదికి వచ్చి ఆగేసరికి, జనం గిరీశంగారున్న కంపార్టుమెంటు వెతుకుతూ పరుగులు తీశారు. మర్యాదకుకట్టుబడిన పెద్దలుమాత్రం చేతిలో పుష్పాలదండలు పట్టుకుని, చిక్కమొహంతో దిక్కులు చూస్తూ నుంచున్నారు. కంపార్టుమెంటు వెతుకుతూ, దాదాపు పదిహేనునిమిషాలు పెనగులాట జరిగింది. వొచ్చిన ఘుట్టి చిక్కేమిటంటే, అక్కడికి వొచ్చిన పెద్దల్లోనూ, పిన్నల్లోకూడా గిరీశంగారిని చూసిన వాళ్ళొక్కరూ లేరు. కనీసం ఆయన ఫోటోఅయినా దేశంలో లేకపోయింది. ఇంతమందిలోనూ గిరీశంగారిని యెరిగినవా రొక్కరైనా వుండకపోతారా అన్న ధైర్యంతో ప్రతిఒక్కరూ స్టేషనుకు విచ్చేశారు.

రైల్లోంచి దిగినవారుకూడా, పెట్టే బేడా దించుకుని వారి దర్శనార్థమై జనంతోపాటు నుంచున్నారు. ఆశాభంగమైపోతుందేమోనని ప్రముఖుల్లో గుసగుసలు పుట్టడం చూసి, ప్రజ లెంతో నిరుత్సాహపడ్డారు. కాని వారిలో కొందరు పట్టుదలైన మనుషులు ప్రముఖులవద్దకు తోసుకునివచ్చి, గిరీశంగారిని దర్శించకుండా యిళ్లకు వెళ్లమని పంతంపట్టారు. గిరీశంగారు యీ బండిలో వచ్చినట్టు లేదనీ, మ రెప్పుడు వచ్చేదీ తరవాత ప్రకటింపబడుతుందనీ ప్రముఖుల్లో ఒకరు చెప్పినా, ప్రజలు వినలేదు. "గిరీశంగారు యీబండిలోనే రావాలి!" అని ఒకపక్కనుంచి నినాదాలు వస్తే, "రాకపోయినా సరే, గిరీశంగారు దర్శనం యివ్వాలి" అని వారికంటే బిగ్గరగా యింకోపక్క

సంది వివాదాలు చేశారు! "కనిపించకపోతే పూరుకోమండోయ్" అని కాంపౌండ్‌లో వున్నవాళ్లు కేకలేస్తే "సత్యాగ్రహం చేస్తాం" అని గోడలమీదవాళ్లూ, "ప్రాయోపవేశం చేస్తాం" అని చెట్లమీద వాళ్లూ యథాశక్తిని గిరీశంగారిపట్ల తమతమ సద్భక్తిభావాన్ని యెలుగెత్తిచాటేరు!

ఈ కోలాహలంలో ప్లాట్‌ఫారం మొదటి చివర నున్నవాళ్లు "వెంకటేశంగారికీ జై", "వెంకటేశం గారికీ జేయ్" అని నినాదాలు ప్రారంభించారు. దాంతో అందరూ ఆ వేపుకి తోసుకవెళ్లారు. ఇది విని స్టేషన్ ఆవరణలో వున్నవాళ్లు వెంకటేశంగారు వచ్చినట్లు నిశ్చయం చేసుకున్నారు. అనేక పనితొందరలవల్ల తాను రావడానికి వీల్లేక, తన ప్రియశిష్యులైన వెంకటేశంగారిని ముందుగా పంపేరని కొందరూహించారు. ఇంకొందరు వెంకటేశంగా రొచ్చారంటే, గిరీశంగారుకూడా వొచ్చివుంటారని ఛాతీమీద దెబ్బకొట్టి మరీ చెప్పేరు. దాంతో జనసమూహంలో పంతాలు పెరిగి, రెండుపక్షాలుగా చీలి పందేలు కట్టారు. ఈ పందేలలో కనీసం పదివేలరూపాయల వరకైనా పడివుంటుందని ఖచ్చితంగా తెలియవస్తున్నది. గిండీరేసుల్ని ఎత్తివెయ్యడానికి మద్రాసు ప్రభుత్వంవారు చేస్తున్న ఆలోచనల్లో యేకారణం చేతనైనా అవాలోచిత నిర్ణయం జరిగినట్లయితే, మన దూర్తనాగరికతకు భంగంరాకుండా, మన నాగరిక ప్రజలు యిటువంటి సందర్భాలను వినియోగించుకోగలరని, కిడెంబి మేలెంచే వర్గాలవల్ల రూఢిగా తెలియవస్తోంది. ఎన్నికల సందర్భంలోనూ, మంత్రుల నియామకవిషయంలోనూ యిటువంటి అవకాశాలు కలగక పోవనీ, తన్మూలంగా గిండీరేసులు లేని లోపం కొంతవరకైనా తీరక తప్పదనీకూడా సూచింపబడుతోంది.

వెంకటేశంగారి ఆగమనాన్ని జనసమూహం గ్రహించగలగడానికి, తీసిన కూపీలవల్ల యీ క్రింది కథనం తెలియవస్తోంది.

కలకత్తా మెయిలు ఆగగానే మిస్టర్ వెంకటేశం రైల్వేకూలీలను నెట్టుకుంటూ ప్లాట్‌ఫారం మీదికి వచ్చారు. జనసమ్మర్దంలో వారు కొంతసేపు కూలీల్ని కానక, రెడ్ బ్లేజర్ కోటు వేసుకున్న ఒకపుర ప్రముఖుడ్ని రైల్వేకూలీ అనుకుని (ఆయనపేరు వెల్లడించడానికి అనుమతి లేనందుకు చింతిస్తున్నాను) ఆయన బుట్ట తల పాగామీద గిరీశంగారి ట్రావెలింగ్ ట్రంక్ పెట్టబోయారు. దానిపై ఆ పురప్రముఖుడుగారు మిస్టర్ వెంకటేశం చెంపపైకి చాచిపెట్టి చెయ్యి యెత్తారనీ, కాని అదృష్టవశాత్తూ చేయి చెంపకు చేరకముందే ట్రావెలింగ్ ట్రంకుపైని "మిస్టర్ యస్. గిరీశం" అన్న పేరు చూసి చేయి దించివేసి క్షమాపణ చెప్పుకున్నారనీ తెలుస్తోంది. కాని గిరీశంగారి సిబ్బందితోనే ప్రయాణం చేస్తోన్న మిస్టర్ అసిరిగాడు పురప్రముఖుడుగారు చెయ్యెత్తడం చూసి, చేతనున్న కర్ర యెత్తి, అడుగులు వేసుకుంటూ సాముచేస్తూ వచ్చి, ఆయనతలపై గట్టి దెబ్బకొట్టాడనీ, ఆయన జనరల్ హాస్పిటల్‌లో చేర్చబడ్డారనీ లోపాయికారీవర్గాల కథనం. (గిరీశంగారి అంతరంగిక కార్యదర్శిహోదాతో మిస్టర్ వెంకటేశం పైవార్తను "పచ్చిపుకారుకోర్ల స్కాండిల్" అంటూ చేసిన పత్రికాప్రకటన శిరోకచో ముద్రింపబడింది.)

తరవాత సంఘసంస్కరణోద్యమభీష్ములు శ్రీగిరీశంగారు రూఢిగా వచ్చినట్లు, వారి అంతరంగిక కార్యదర్శి మిస్టర్ వెంకటేశంద్వారా అధికారరీత్యా తెలుసుకున్న తరవాత, పురప్రముఖులూ, వివిధసంస్థల ప్రతినిధులూ గిరీశంగారున్న ఫస్టుక్లాస్ కంపార్టుమెంటుదగ్గరకు వెళ్లారు. అందులో ఒకరు చొరవతీసుకుని కంపార్టుమెంటులోనికి వెళ్లబోగా సంఘసంస్కరణోద్యమభీష్ముని అంగరక్షకుడు మిస్టర్ అసిరిగాడు ఆయనను అడ్డగించారు. ఎందరు ప్రాధేయపడినా, ఆయన, "సేనొగ్గ—సేనొగ్గనుగా కొగ్గను" అని తలుపుతియ్యడానికూడా నిరాకరించారు. ఇది చూసినవారందరూ మిస్టర్ అసిరిగాడి స్వామిభక్తినీ, క్రమశిక్షణనూ లోలోన ప్రశంసించారని తెలుస్తుంది. పోనీ, శ్రీ గిరీశంగారు లోన యేమి చేస్తున్నారో చెప్పమని కోరగా, మిస్టర్ అసిరిగాడు కాలుస్తున్న చుట్ట పారేసి యీవిధంగా అభిభాషించారు:

"బుగత ఎప్రిల్ని లోన తొంగొద్దని చెప్పేడు. ఒగ్గితే నా కొమ్మా తక్కువాగిందా? సాఖలోన్ని నన్నుం చేటూన్నాం! ఒక్క చెణం వల్లకుండండి. బుర్రకి రంగు పులుంకోని, సిటికలో వొచ్చేత్తాడు" అని మిస్టర్ అసిరిగాడు చెప్పారు.

మిస్టర్ అసిరిగాడు చెప్పిన వార్తని బట్టి, గిరీశంగారు బాగా వయోవృద్ధు లయ్యుంటారని అనభిజ్ఞులైన పురప్రముఖు లూహించుకుంటుండగానే, ఫస్టు క్లాస్ పెట్టె తలుపు మెల్లగా తెరుచుకుంది. హవానా చుట్ట కాలుస్తూ సుప్రసిద్ధ రైల్వే సాహిత్య ప్రచురణ కర్తలచ్చేసిన కవాళ్ళెలక్కంప్రతి ఒకటిపట్టుకుని, ఆంధ్ర మహాపురుషుడు శ్రీ యస్. గిరీశంగారు ప్రత్యక్షమయ్యారు. ప్రాంగణాలు బద్దలై పోయేటట్టు జయజయధ్వానాలు మోగిపోయాయి. కొన్ని డజన్ల సంస్థల ప్రతినిధులు పూలదండలు వేశారు. కాలేజీవిద్యార్థులూ, ప్రెస్ ఫోటోగ్రాఫర్లూ అనేకమంది ఫోటోలు తీశారు. పురప్రముఖులు పరిచయం చేయబడినతరవాత, గిరీశంగారు చేతులు పీకేట్టు వారందరితో కరస్పర్శ చేశారు.

"ఐ థాంక్ ఆఫుల్లీ సారీ—అనగా నేను చాలా యిదిగా విచారిస్తున్నాను—మిమ్మల్నింతమందిని కష్టపెట్టినందుకు. నాపట్ల దేశంలో ప్రచండమైన లవ్ వుందని నాకు హిమాలయన్ కాన్ఫిడెన్స్ వుండబట్టే, అజ్ఞాతవాసం రిసైన్ చెయ్యడానికి నన్ను నేను ఒప్పించుకున్నాను. గత ఫిఫ్టీ యియర్సుకీ, యిప్పటికీ కంట్రీలో వండర్‌ఫుల్ డెవలప్‌మెంట్సు వచ్చిపడినట్టు కనిపిస్తున్నాయి. ఆకాలంలో నాబోటి హంబుల్ సర్వెంట్స్ ఆఫ్ మేన్‌కైండ్, లెక్కపెడితే ఒకచేతివేళ్ళకే సరిపోయేవారు కాదు. ఇప్పుడో? డజన్స్, హండ్రెడ్స్—నై హండ్రెడ్స్? థౌజండ్స్—యెక్కడ చూసినా కనిపిస్తున్నారు. తొండ ముదిరి ఊసరవిల్లి అయినట్టు సివిలిజేషన్ టెరిబుల్‌గా ప్రోగ్రెస్సయింది" అని ఆంధ్రసంస్కరణోద్యమభీష్ములు పెద్దంతో సంభాషిస్తూ అన్నారు. ఇప్పటి జాతీయఅంతర్జాతీయ పరిస్థితులమీద ప్రకటన చెయ్యమని పత్రికావిలేఖరులు బలవంతం చెయ్యగా, యీ యాభైఏళ్ల పరిస్థితుల్ని "క్లోస్‌గా స్టడీ" చేస్తేగాని, ఏమాటా చెప్పనని గిరీశంగారన్నారు. కాని ఆగస్టు 15వ వచ్చేస్తున్న స్వాతంత్ర్యంగురించి ఒకమాట చెప్తానంటూ యిలా అన్నారు:

"ఫిఫ్టీయియర్స్ క్రితం నేను చెప్పాను—కాంగ్రెస్ అంటే దివాన్గిరీ చెలాయించడం అని. అప్పుడు నేనన్న ప్రతిఒక్క అక్షరం సెంట్ పెర్సెంట్ కరెక్టు అయిందని, మీకు నేను వేరే చెప్పనక్కరలేదు. అప్పుడు బండివాడడిగినట్టు, కాంగ్రెసు హెడ్ కానిస్టేబుల్సునే కాదు - కలెక్టర్లనీ, గవర్నర్లనీకూడా బదిలీ చేయిస్తుంది. మాటవిననివాళ్లందర్నీ డొక్క బద్దలుచేసి రాళ్లకొడుతుంది."

తరవాత గిరీశంగారు కారులో తమ విడిదికి బయలుదేరారు. జనం తొక్కిసలాటలో పోలీసువారు చేయిచేసుకుని, వల్పవల్పగా లాఠీఛార్జి చేశారు. శ్రీగిరీశంగారు మద్రాసులో వున్నంతకాలం శ్రీ బి. రాధారమణమూర్తి (భారతదేశానికి స్వాతంత్ర్యప్రదానసమయంలో తమ 'సర్' బిరుదాన్ని త్యాగంచేయడానికి నిశ్చయించుకున్న మహాపురుషుడు) గారింటో "బిడారా చేస్తా"నని పత్రికావిలేఖర్లతో చెప్పారు. రెండుమూడు రోజుల్లో, దేశంలోని ఆహారపరిస్థితిపై ఒక ప్రకటన చేస్తానని చెప్పారు. (ఆప్రకటన వచ్చేసంచికలో ప్రకటింపబడుతుంది.)

గిరీశంగారి పరివారంలోని ఒక్కొక్కర్ని సందర్శించగా, వారీవిధంగా ప్రసంగించారు: మొట్టమొదట వారి ఆంతరంగికకార్యదర్శి శ్రీ నలక వెంకటేశంగారిలా అన్నారు:

"మా గురువుగారు శ్రీ గిరీశంగారన్నట్టు, దేశంలో వండర్‌ఫుల్ డెవలెప్‌మెంట్సు వచ్చిపడ్డాయి. నా కుర్రతనంలో చేగోడీలు, ఊరుబిండి మొదలైనవి తినేవాళ్లంకాని యిప్పటి కుర్రకారు యిడ్లీలు, దోసెలు, కాఫీ టీలు మరిగారు. మానాన్న స్వర్గీయ నలక అగ్నిహోత్రావధాన్లుగారు పొడుంకని దాచుకున్న పొగాకు కట్ట సంగ్రహించి, చుట్టలు చుట్టుకుని నేనూ, గురువుగారూ కాల్చేవాళ్లం; ఈనాటి కుర్రకారు దుకాణాలమీద కాశాలు పెట్టి, సిగరెట్లు కాలుస్తూన్నారు.

# మృతి

= శ్రీ కామేశ్వరరావు =

మొన్ననే ఇద్దరు పెద్ద వ్యక్తులతో నడుస్తున్నాను. వారు జీవితంలో ఎంతో అనుభవం సంపాదించారు; ప్రజాదరణ పొందారు; కొన్ని తరములవరకూ నిలిచే గ్రంథాలు రచించారు. ఎంతో సుఖం అనుభవించారు......

వారిద్దరూ తమకు చావు అంటే భయంలేదన్నారు. ఒకరు తనకు ఆరునెలలు గడువు ఇస్తే సిద్ధముగా వున్నానన్నారు.

* * * *

ఆ మాటలు మరచిపోలేను. అంత మనోనిశ్చయమున్న వ్యక్తిని నేను చూడలేదు. నిఘంటుకారుడు అమరునిగూర్చి అవిధమైన కథే చెబుతారు: ఏదో ఒక తప్పిదానికి మరికొందరితో అతన్ని వధించబోతున్నారు. అందరినీ వధించి తన దగ్గరకు రమ్మని ప్రార్థించాడట అతను. ఈలోపుగా అతను అమరకోశము పూర్తిచేసుకొన్నాడుట. అతనికి మృత్యువు అంటే భయం లేదు. కేవలము కార్యాటంకము అని అతని అభిప్రాయము. అంతే.

ఉద్గ్రంథాలు రచించేవారికి చావు త్వరగా రాకూడదు; రాదుకూడాను. వారికి ఇక్కడ పనివుంది కాబట్టి. నన్నయా, తిక్కనా తమ గ్రంథాలను పూర్తి చెయ్యకుండా ఎందుకు చనిపోయారో తెలియడంలేదు. ఆగంతుకంగా చనిపోయివుండాలి. "మహాభాగవతం" రచించాలనుకున్నా, "రామాయణం" గానం చెయ్యాలనుకున్నా ఆ ఋషులను చూసి జర భయపడుతుంది. వారు కార్యసాధకులు. వారి పని పూర్తిఅయితేనేగాని వారు యీ స్థానం వదిలివెళ్లరు.

ఈ తరగతిలోనే జ్ఞానంకోసమూ, సేవకోసమూ ప్రాకులాడేవారు వుంటారు. బెర్నార్డుషాకు ౯౦ వ ఏట శైశవం వచ్చిందట. ౩౦౦ ఏళ్లు బ్రతికితే అతని జ్ఞానోదయం పూర్తిఅవుతుందిట. అందుకు అతను బ్రతకాలంటాడు. అంతకాలము అతను మనతో వుండకపోవచ్చును. కాని అతని ఆశయమే మనకు దృక్పథము. మహాత్ముడు కూడా అంతే. మానవసేవకోసము చాలాకాలం బ్రతకాలనుకుంటాడు. అటువంటి వ్యక్తులు ఏమైనా యుగాంతమువరకూ బ్రతికేవుంటారు.

వారి సంకల్పము పూర్తిచేసుకుని అవతారం పూర్తిచేయవచ్చును. భౌతికంగా లేకపోయినా వారు కార్యసాధకులు. వారి సంకల్పము పూర్తికాకపోతే తిరిగి మనకోసమై జన్మిస్తారు. యుగయుగములోనూ శ్రీకృష్ణుడే సంభవించకపోవచ్చు. కాని అతని అంశకలవారు పృథివికి దిగివస్తారు. వారి నియమిత కార్యము పూర్తిచేస్తారు; కేవలమూ మానవోద్ధరణకోసమే. సంగీతకారుడు స్ట్రాస్ ఒక్క 'బ్లూ డాన్యూబ్' వ్రాసి మరణించినా అతను ఎవరి అంశతోనో యీ యుగంలో మనతో వున్నాడనుకోవాలి. ఏచిన్న కార్యమైనాసరే, ప్రజలను వున్నదానికన్నా ఆనందంగా వుండేలా చూస్తే చాలు. "శిష్టరక్షణాయ సంభవామి యుగే యుగే"అన్న వాక్యం వర్తింపజేయవచ్చును.

* * *

మృతి ఒక తెరను తప్పించుకుని అవతలకు నడవడమనికాదూ హైందవుల నమ్మిక! మళ్లీ తిరిగి మరొకరూపంతో వస్తాముకాదూ? ఇంక మృతి ఘోరస్వరూపము కాదు. విడుదల. కాని తిరిగి జన్మించా

లంటేమాత్రము భయంగా వుంటుంది. ఇప్పుడు పుట్టేము కాబట్టి బ్రతకాలి. బ్రతికితీరాలి!! కాని తిరిగి నువ్వు జన్మిస్తావా అంటే ముమ్మాటికీ వద్దని చెప్పాలి. “అందుకు మంచిగా వర్తించుకో; పునర్జన్మ వుండదు” అని ఋషుల ఆదేశం. కాని మంచి అంటే ఏమిటో. దేశానుగుణంగా, కాలానుగుణంగా, ప్రవృత్తి ననుసరించి ‘మంచి’ నిర్ణయించరూ? అసలు యీ జన్మ జన్మాంతరాలకు మొదలు ఎందుకో! ఇది సామాన్య మానవుల ప్రశ్న పరంపర.

వేదాంతము మాట అటుంచండి. “ఎందుకు?” అన్న ప్రశ్నకు ఒకచోట సరియైన సమాధానం రాదు. కాని అడగకుండా మరణించడం అన్నిటికన్నా అందమైన గుప్తద్వారం. అందుకు మన స్థైర్యం వుండాలి. మరణించేటప్పుడుకూడా మనశ్శాంతి వున్న వ్యక్తులు ఆదరణీయులు. లార్డ్ చెష్టర్‌ఫీల్డు మరణశయ్యమీద వున్నాడట. అవసానదశలో ఆయనను చూసి వెళ్లడానికి ఒక మిత్రుడు వచ్చాడట. లేని శక్తి తెచ్చుకుని మంచంమీదనుంచి కొంచెము లేచి, తన సేవకుని కేసి చూసి “ఆయనకు ఆసనము చూపించడం మరచిపోయావా” అని మృదువుగా చెష్టర్‌ఫీల్డు అడిగాడట. అతనికి మరణముకన్నా మర్యాద అంటే ఆతురత ఎక్కువఅయింది. అతనికి మరణమంటే భయములేదు. అందుకు విచక్షణ చచ్చిపోలేదు.

జీవితానికి అదే లక్ష్యంగా వుండాలి. చావుకు భయపడ నవసరమే లేదేమో. కాని చావు వుండకూడదని కోరుకోకూడదు. అది పిరికితనం. రవీంద్రుడు ఆ ఒక్క పద్యమూ వ్రాయకుండా వుండవలసింది. చిగురుదశలో చావులో ఏముందో అని బేలతనంతో ఆక్రోశించాడు. అది మానవత్వము. ప్రతిజీవికీ ఆ సందేహము వస్తుంది.

* * *

మృతికి భయపడకుండా వుండడానికి నిజమైన మృతి కోరాలి. అది కోరికలు లేకుండా వుండడం. ఒక యువకుడు ఖండఖండాంతరాలూ తిరిగిరావాలనుకుంటాడు. అందరూ అందుకు తోడ్పడరు. అప్పుడతనికి నిరాశా, నిస్పృహా జీవితమంతా ఆవరించుకుపోతాయి...మరొక యువకుడు తనలోని ‘పెలరేటి చిరుపాటలకు’ శృతినివ్వగలిగే సాంగత్యము కోరుతాడు. కాని అది హిమాలయపర్వతపు కొనమీద తొలి సూర్యకిరణముకన్నా దూరమైపోతుంది. అతనికి ఇంక ఆనందమైన సన్నివేశాలు లేవు...అతనికి ఇంక కోరికలు లేవు............

నాకూ చావు అంటే భయములేదు. దినదినమూ అందుకై వేచియుంటాను: సర్వమైన కోరికలూ సంతుష్టి అయ్యాయి కనుక కాదు; వున్న కోరికలన్నీ సమసిపోయాయి కాబట్టి. కోరికలే మరచిపోతే ఇంక ఎందులోనూ ఆప్యాయతే లేదు. అదే నిజమైన మృతి. దైవమంటూ ఏ మహామూర్తములోనైనా నమ్మితే నా ప్రార్థన అదే...“ఏకోరికా లేదు; ఒక్కటే కోరిక—ఇంక నాకు కోరిక రాకుండా చెయ్యి”... ఆ మృతే నాకు కావాలి.



# కనకాభిషేకము

[ నాటిక ]

•

— శ్రీ బులుసు వేంకటరమణయ్య —

మొదటి రంగం

[సూరకవి, భార్య సీతమ్మ ప్రవేశం]

సూర—సీతా! చూడూ - యీవాళ వంట కాస్త త్వరగా కావాలి. పది గడియలకి సమంగా నేను కోటలోకి వెళ్లాలి. చాలా రోజులనుంచి కనబడ్డం లేదేమిటంటూ మహారాజులుంగారు కబురు పంపారు. యీ మాటు దర్శించకపోవడం బాగుండదు.

సీత—(నవ్వుతూ) వంటకేం! నిముషాల మీద తయారుచేస్తా. అసలు - విశేషంగా చెయ్యడానికి ఏమున్నాయింట్లో వుంటేగా? అయ్యవార్లంగారి నట్టిల్లాయె! యింత అన్నం పారేసి, కాస్త చారు మరిగించడానికి ఎంతసేపు కావాలేమిటి!

సూర—సీతా! నీ వన్నది నిజమే. మనకి సరస్వతీ కటాక్షం వున్న'గాని, లక్ష్మీకటాక్షం లేదు. మన ఆశ్రయులు మహారాజులుంగారయినా మన దురదృష్టవశాత్తూ—వారి పూర్ణానుగ్రహం మనమీద లేదు.

సీత—ఏమిటో, ప్రతీదానికీ అదృష్టం అంటారు, చాదస్తం కాకపోతే. తరతరాలనించీ ఈ ప్రభువుల్ని ఆశ్రయించివున్నారు. మీ పూర్వీకుల దగ్గర్నించీ మీదాకా ఎవరన్నా నిర్విచారంగా కాలుమీద కాలు వేసుకుని హాయిగా కాలం గడపగలిగారా! చెప్పండి! ఈ కవిత్వం మానేసి, మరేపని చేసుకున్నా హాయిగా బతకడానికి వీలుండేదేమో అనిపిస్తుంది నాకు.

సూర—అలా అనకూడదు. మనకి డబ్బేనా శాశ్వతం? వెధవడబ్బు యీవాళ వచ్చి రేపు పోతుంది. శాశ్వతమయింది కీర్తి. ఆ కీర్తికి కవిత్వంకంటే ఉత్తమమైన మార్గం మరేముందీ! సత్కవులు చచ్చిపోయినా, వాళ్ల కవిత్వం ఎన్నినోళ్లల్లో మెలగుతున్నదో, వాళ్లని ఎందరెందరు ఎన్నిరకాలంగా పూజిస్తున్నారో చూడు! కవి నందిని పందినీ, పందిని నందినీ చేస్తాడు. అతను తృణీకృతబ్రహ్మ పురందరుడు. అతని జీవితమే ధన్యం. నీకు ఎప్పుడూ యింట్లో అది లేదనీ, యిది లేదనీ సంసారపుగోలగాని మరోవిచారం లేదు. నాకుమాత్రం ఏవిషయంలోనూ విచారం లేదు.

సీత—క్షమించండి! ఏదో అజ్ఞానంవుంది అప్పుడప్పుడు యిలా అనిపిస్తుందిగాని మీ కవిత్వం వింటూవుంటే అన్నపానాలు మరపుకువస్తాయి! మొన్న పాలుపంపాటి వెంకన్న అన్నగారిమీద మీరు రాసిన పద్యాలసంగతిని విని సూరమ్మత్త, వెంకమ్మపిన్ని ఎంతో ఆనందించారు. అలాగ్గా మిమ్మల్ని అందరూ పొగుడుతూవుంటే అంతకంటే నాకు కావలసిందేముంటుంది! (నవ్వుతూ) మీరు ఆయనమీదే అంత బాగా ఎందుకు రాస్తున్నారో ఇన్నాళ్లకి గ్రహించగలిగాను.

సూర—ఓహో! బుద్ధిమంతురాల వయ్యావే! ఏమిటో చెప్పూ, విందాం.

సీత—అంత బుద్ధిని వుపయోగించవలసిన పని ఏముందీ? ఆయన ధనవంతుడు! ఒక జమీందారీకి దివాను! అలాక్కాకపోతే—కరిణీకం చేసుకుంటున్న మా రామయ్యన్నమీద ఒక పద్యమన్నా చెప్పిన పాపాన పోయారా!

మూర—(గట్టిగా నవ్వుతూ) అదా, సీతాలు! చెప్పలేమీ! ఆయనమీదా చెప్తాను, నిమిషం మీద, ఇదిగో విను—

గ్రామము చేతనుండె, కృషి
కల్పితధాన్యము లింటనుండ, శ్రీ
రామకటాక్షవీక్షణ ప
రంపరచే దిన మేగుచుండ, మా
రామయమంత్రి భోజనప
ర్యాకము క్షేమని చెప్పవచ్చు! నా
సామి రొటంగు దక్క బళి
చాతురి తాళఫలప్రమాణముల్.

సీత—(ముఖం చిట్లించుకుని) యిలాంటి పద్యా లా యతనిమీద చెప్పడం! పాపం! అతనిదే బావ కడుపు! మీ కందరికీ తిండి అక్కరలేదు; పస్తులు పడుకుంటున్నారు పాపం!

మూర—ఏదో, వరసకి నీకు ఆయన అన్నగారయారు! అతనిమీద అలా చెబితే నీ కెందుకు ఇంత ఉలుకు? నీ దగ్గర చట్టంమీద చెప్పమన్, ఎలా చెప్తానో చూద్దువుగాని!

సీత—(సంతోషంతో) అయితే మా నాయన బాచన్నమీద చెప్పండి! కన్నకొడుకుకంటే ఆప్యాయమయినవారు వుండరుగదా!

మూర—అలా అడుగు, చెప్తాను. విను—

బాదా, బూచులలోపల
బాచన్నే పెద్దబూచి పట్లం దానన్;
బూచంటే రాత్రి వెరతురు
బాచన్నను జూచి పట్టపగలే వెరతుర్.

(పకపక నవ్వును)

సీత—(కోపంతో) చాల్లెండి, మీ కవిత్వాలూ, మీరూను. మా బాచన్నకి ఏమిటి తక్కువండీ, ఇలా అనడానికి? కాస్త నల్లగా వుంటే సరా? కృష్ణుడు నల్లగా లేడూ? ఇంతకీ పెరటిచెట్టు మందుకు పనికి రాదని వూరికే అన్నారూ మనవాళ్లు! ఇంతతో ఆగండి!

మూర—(నవ్వుతూ) సీతా! నీకు కోపం తెప్పిద్దామని యిలా చెప్పేను. ఇకమీద చక్కని కవిత్వం చెప్తానులే. నీమీద ఒక మంచిపద్యం చెప్పేదా?

సీత—బాబోయ్! అక్కర్లేదు తక్కువ! కవిత్వాలూ వద్దు; కంపలూ వద్దు. వూరుకుంటే చాలు. మీతో తనివారి వాదన పెట్టుకుని పనీ, పాటూ మానుకొని నిలబడిపోయాను. పొద్దెక్కిపోతూవుంది. వేగం చెప్పండి, ఏంచెయ్యమంటారో!

మూర—మొదటే చెప్పావుగా, ఏమీ లేదంటూ? ఇక అడగడం దేనికి?

సీత—అన్నట్టు యీవాళ మార్గశిర లక్ష్మీవారం కూడాను. అన్నీ కలిసివచ్చాయి. పులగం చేస్తాను అందులోకి ఆధరువు ఏది కావాలో చెప్పండి.

మూర—ఇకనేం!

'పులగములోపలికి పచ్చిపులుసే కాదా!' పద.

(నిష్క్రమణం)

## రెండవ రంగం

[ప్రవేశము: విజయరామ గజపతిమహారాజు, దివాను సీతారామరాజు, వందిమాగధులు, మూరకవి, కొందరు సభ్యులు]

వంది—జయజయ! శ్రీమన్మహారాజాధిరాజ! శ్రీ విజయనగరరాజ్యైకధురంధర! శ్రీ పూసపాటివంశ పయఃపారావారరాకాసుధాకర! మత్స్యతుల్యాది వివిధబిరుదావళీవిరాజమాన! శ్రీమద్విజయరామగజపతి మహారాజ! పరాకు! బహుపరాకు!

మాగధుడు—జయ, విజయీభవ! విజయరామ విభో! విద్వన్మానసహంస! హంసకులవర్ధన! రిపుమర్దన!

"ఢిల్లీలోపల గోలకొండపురి నిం
డెన్ నీప్రశంసల్; గబాల్
బల్లాలం బోడిపించి హుమ్మని యుర
శ్శ్వాసక్కై పైకొంచు వా
దుల్లాఖానుని వాలుదోలితివి; నీ
దోశ్శక్తి! మా బాలకన్
మళ్ళింపం దరమానె? శ్రీవిజయరా
మా! మండలాధీశ్వరా!"

సీతా—మా భేషైన పద్యమోయ్! కాని మహారాజులుంగారిని ఏకవచనంతో సంబోధించడంమాత్రం బాగులేదు.

మాగ—చిత్రం, చిత్రం. ప్రభువులు క్షమించాలి నన్ను. ఆపద్యాన్ని రాసింది మన సూరకవీశ్వరులే నండి!

సీతా—ఆఁహా! అలాగా?

విజయ—అమీరుఖాను చాలా వెలవేసుకున్నట్టున్నాడు! అన్నగారు ఆవిషయం బందోబస్తు చేయించిస్తేనా!

సూర—ప్రభువులకి ఆ విచారం అక్కర్లేదు.

పంతము నీకు చెల్లు; నీక
   పాటి యమీరుడు నీకు లక్ష్యమా?
పంతము చేతబూని నిను
   గెల్వనివాడు ధరిత్రిలోన భూ
కాంతు డొకండు లేడు; కట
   కంబు మొదల్కొని గోలకొండ ప
ర్యంతము నీవె కా, విజయ
   రామనరేంద్ర! సురేంద్రవైభవా!

పద్మలు—చాలా అద్భుతంగా వుందండీ, కవిగారి ఆశుకవిత్వం! ఎంత ధారాశుద్ధి!

సీతా—వాడి సంగతి అలావుంచి, ప్రభువులు ఈ విచిత్రం గమనించాలి. ఊరూ, పేరూ లేని శృంగారపుకోట కాశీపతిరాజుకొడుకు—చచ్చుపాపయ్య రాజభూపాలరాజు మనమీదకి దండెత్తిన సమాచారం మరీ ఆశ్చర్యం! పాపం! నిష్కారణంగా మలమల మాడిపోతాడని చాలా విచారంగా వుంది నాకు.

విజయ—సరే. వాళ్ళ దివాను వెంకన్నగారు మన సూరకవిగారికి ఆప్తుడుగదా! వారిద్వారా బుద్ధి చెప్పిస్తే!

సీతా—అప్పుడే పటాలాలు బయలుదేరి గంట్యాడదాకా వచ్చినట్లు యిప్పుడే వేగులు తెలియజేశారు.

సూర—అయితే వ్యవహారం చాలా ముదరపాకంలోనే వుందన్నమాట! ఎంత అవివేకం! ఎంత అవివేకం!

విజయ మతిమాలి నాథ వీర డేఁ
పట్టు ములికించె రాజభూపాలరాజు!
కడమమాటలకేమి? యీ కాలమందు
పుట్టె నవ్వేల; పులిమీద గొర్రె పడియె.

ఈ దెబ్బతో అతని అధఃపతనం నిశ్చయం ప్రభూ!

సీతా—అదెలాగూ దేవుడే చెప్పేడు. కాని కవిగారూ! మీ పద్యాలయితే బాగున్నాయేకాని, నేను ప్రతిపద్యాన్నీ గమనిస్తూనే వున్నాను, ప్రభువుల్ని ఏకవచనంతో సంబోధించడంమాత్రం మీరు మానడం లేదు. యిది యేమీన్నీ బాగులేదు.

సూర—దివాను సాహేబుగారికి రాజ్యవ్యవహారాలు తెలియవచ్చునుగాని, కవిత్వంసంగతి ఎలా తెలుస్తుందీ? ఆదికవినుంచి నేటిదాకా కవులందరూ చక్రవర్తుల్ని కూడా ఏకవచనంతోనే సంబోధన చేస్తున్నారు. కవిత్వానికి ఇది మెరుగు!

చిన్నప్పుడు, రతికేళిని
నన్నప్పుడు, కవితలోన, యుద్ధములోనన్
వన్నెసుమీ 'రా'కొట్టుట
చెన్నుగ నో పూసపాటి సీతారామా!

సీతా—తప్పులేకపోతే లేకపోవచ్చుగాని, మాకు ఈ పద్ధతి రుచించడం లేదు. మీరు ఇకమీదనన్నా ఈ పద్ధతిని మార్చుకోవాలి.

సూర—(ఉద్రేకంతో) అది సాధ్యంకాదు! అసలు అలా మార్చుకోవడం కవిత్వపద్ధతే కాదు. కాకపోతే నేను కవిత్వమే మానుకోవలసి వస్తుంది.

సీతా—(రూక్షంగా) అలా అంటారేమండీ? మీ పద్ధతి ప్రభువుల్ని అవమానిస్తున్నట్టు లేదూ? అలా కూడదంటే—కవిత్వమే మానుకొంటానంటారూ! మీరు కవిత్వం మానితే, మాకు మాన్యాలెందుకిచ్చినట్టు!

సూర—(కోపంతో) కవిత్వ పద్ధతి ఎరగని ఒక ఆసామి ఒక మహాకవిని అలా రాయి, ఇలా రాయి అని శాసించడం అవమానించడంకాదూ? కవి దరిద్రుడే కావచ్చు. కాని ఆత్మగౌరవము అతనికి వుంది. మాటాడితే మాన్యాలసంగతి ఎత్తి బెదిరిస్తారు! ఆ మాన్యాలు తప్ప మరి మీరు పరిష్కరించిన దేముంది? గమనించండి!

గరిసెలు వ్రాతగాని, మతి
గంటె డెబ్బంగము; మన్యదేశముల్
తిరిగి యభీష్ట వస్తువుల
దెచ్చి భుజింతుము సర్వకాలముల్;
సురుచిర సత్కవిత్వనిధి
సూరకవీంద్రున కేల గద్దె-గం
చరమును, రేగ-మేక పెడ
చన్నులవంటివి రెండు మాన్యముల్ ?

అవి నాకు వున్నా, లేకపోయినా ఒక్కటే! నేటినుంచీ వాటిని నేను సర్కారువారికి విడిచిపెట్టి వేస్తున్నాను. ప్రభువులు తీసికోవచ్చు.

విజయ—సూరకవిగారికి చాలా ఆగ్రహం కలిగి నట్లు కనబడుతున్నది. నన్ను చూసిఅయినా శాంతం వహించండి.

సూర—ప్రభువులమీద నాకు ఎలాటి భేదాభిప్రాయమూ లేదు. మాన్యాలు విడిచినా, ఆస్థానానికి రాకపోయినా—ప్రభువుల వుప్పు తిన్నకారణంచేత—సూరకవి ఎప్పుడూ ప్రభువులకి కృతజ్ఞుడే! ఎన్నడూ కృతఘ్నుడు కాడు. సెలవు.

(నిష్క్రమణం)

## మూ డ వ రం గం

[ప్రవేశము : సూరకవి, భార్య సీతమ్మ, శిష్యుడు మురపాక సూరన్న.]

ము. సూరన్న—అయినా, గు రు వు గా రూ! మీరు మాన్యాలువిడిచడంలో కొంత పొరపాటుపడ్డా రేమో ననిపిస్తుంది.

సీతమ్మ—నీకడుపు చల్లగా, నువ్వు నాలాగే అన్నావు! మీ గురువుగారికి ఎంత తోస్తే అంతేనే గాని, ఒకరి సలహా అనేమాట ఎప్పుడైనా వుంటేనా!

సూరకవి—మంచిమాట అన్నావు! లోకానికి సలహా లిచ్చే కవులు పైవాళ్ల సలహాలని ఎందుకు తీసికో వాలి? నేను మాన్యాలు విడిచినా, మహారాజులుంగారిని అలక్ష్యంచేసినా, కాపురం యీ వూరికి మార్చినా అప్పటికీ యిప్పటికీ భేదం కనబడ్డ లేదు. దేశాలు తిరిగి డబ్బు దండుకోవడం ఎప్పుడూ తప్పలేదు.

ము. సూరన్న—అయితే, అప్పుడే దేశాలు తిరగ డానికి ప్రారంభించారన్నమాట మళ్ళీ.

సూరకవి—దివానుగారి ధర్మమా అంటూ అది వేగంగానే ప్రారంభమయింది. ఈమధ్య బొబ్బిలికి వెళ్లేను.

సీతమ్మ—నాకు యీసంగతి చెప్పనన్నా లేదే? ఎప్పుడేమిటి?

సూరకవి—వారంరోజుల కిందటే. అక్కడ సంగతి వినండి! అక్కడ రావురంగారాయణింగారు నన్ను గౌరవించినట్టే గౌరవించి నిండుసభలో మన ప్రభువుల్ని దూషించడానికి మొదలుపెట్టాడు.

సీతమ్మ—ఎంతమాట! ఎంతమాట!

సూరకవి—నాకు వొళ్లుమండింది. ఏదో నేను డబ్బుకక్కుర్తిపడి వచ్చిన చచ్చుకవి ననుకున్నాడు కాబోలు అతని మనస్సులో. నేను నాలుగుదులుపులూ దులిపి యీలాంటి వాడి రాజ్యంలో ఒక క్షణమన్నా వుండనని అతని ముఖంయెదుటే చెప్పి రాత్రికిరాత్రే బయలుదేరాను.

ము. సూరన్న—మీది నిర్లక్ష్యస్వభావం అని ఎరగడు, పాపం!

సీతమ్మ—రాత్రికి రాత్రే! ఎంత సాహసం!

సూరకవి—నాచేతిలో వాడు ఎప్పుడూ సిద్ధమే గదా! భయం దేనికి? రామోపాసకుడికి భయం దేని కంటాను.

ము. సూరన్న—ఆయన ఏమీ అపకారం తల పెట్టలేదుకదా!

సూరకవి—తలపెట్టకేమి? నన్ను చంపడాని కంటూ కొందరు బోయవాళ్ళని దారిలో ఉంచేడా మహానుభావుడు!

సీతమ్మ—అమ్మో! చంపడానికే! బోయలచే! అమ్మో!

సూరకవి—సీతా! జరిగిపోయినదానికి యింత భయం ఎందుకూ? ఆ బోయకొండవాళ్లు నన్నేం చెయ్య

గలరు? వాళ్లు కొత్త దూరాన వుండగానే కనిపెట్టాను. కనిపెట్టి—

ము. సూరన్న—శాపతో మీద పడ్డారా ఏమిటి?

సూరకవి—(నవ్వుతూ) అంతదాకా ఎందుకోయ్! ఆసువుగా శ్రీరామదండకం చెప్పడం ప్రారంభించాను. శ్రీరాముడు సపరివారంగా ప్రత్యక్షమయ్యాడు. నా చుట్టూ శ్రీరాముడు సపరివారంగా నిలబడివుండడం చూసి, ఆబోయలు హడలెత్తి వంగివంగి దండాలు పెడుతూ పారిపోయ్యారు. వెంటనే నే నో పద్యం రాసి, రంగారాయణింగారికి పంపించానులే. ఈపాటికి అందేవుంటుంది కూడా. వింటావా దాన్ని—

హనుమంతుం డెదుటన్ దివాకరసుతుం
డా చెంత సౌమిత్రియున్
దను సేవింపగ జానకీవిభుడు వా
త్సల్యంబుతో నిల్చి యుం
డ నన్నవ్వాడు గాచుచుండగను నీ
బోయాధముల్ కిన్కచే
నను జంపంగలవారె? రావుకులజ
న్మా! రంగరాయోత్తమా!

ము. సూరన్న—మహాకవులకి అసాధ్యమన్నే మాట లేదు.

సీతమ్మ—అంచేనే, నాయనా! ఈయన మహారాజులనికూడా లక్ష్యంచెయ్యకపోవడం! ఈమధ్య రెండుసార్లు విజయనగరమహారాజులుంగారు వర్తమానం చేశారు. కాని ఏమాట—ఈయన వెళ్లదలచుకో లేదన్నారు.

సూరకవి—ఒకళ్లకి లొంగవలసిన అవసరం నాకేముందీ! ఆయన ఒక జమీందారీకి రాజు అయితే నేను కవితాసామ్రాజ్యానికి చక్రవర్తిని! శపించడానికిన్నీ, తిరిగీ శాపం తిప్పడానికిన్నీ శక్తివుంది. ఎక్కడికి వెళ్ళినా సూరకవికి విజయమేగాని, పరాజయ మన్న మాట లేదు. నాకు ఎవరి ప్రాథేయమూ లేదు.

ము. సూరన్న—మహాకవుల మాటకి ఎదురాడే శక్తి నాకు లేదు. కాని క్షమించాలి. ఒక మనవి! మహారాజులుంగారిని ప్రాథేయపడే అవసరం మహాకవులకు లేకపోవచ్చు; గాని మహారాజులుంగారే మహాకవిని ప్రాథేయపడితే, ఆ ప్రభువుని గౌరవించడం భావ్యంకాదా మరి?

సీతమ్మ—మీకు దివానుమీద కోపంగాని, ప్రభువుమీద కోపం లేదుకదా! ప్రభువుల దయ వూరికే పోదు ఎప్పటికన్నా.

ము. సూరన్న—నిన్ననే ఒక సమాచారం తెలిసింది. రాబోయే పౌర్ణమికి పెద్దాపురంలో తిమ్మజగపతిరాజుగారి కోటలో మహారాజుల సభ జరగనున్నదట! దానికి అందరు మహారాజులకీ ఆహ్వానాలు వెళ్ళాయట! పర్లాకిమిడి, బొబ్బిలి, కిమిడి, కురుపాం, జయపురం మహారాజులు వెళ్తారట! అందరూ ఆస్థానకవులతోపాటు బయలుదేరి రావాలని ఆహ్వానంలో వుందట! మన మహారాజులుంగారు వెళ్లేవారిలో ముఖ్యులు. అందుకనే మీకు రెండుమార్లు రావలసినదిగా కబురు పంపివుంటారని అనుకుంటాను. ఆస్థానకవులు రాకుండా ఒంటరిగా వెళ్లడానికి ఆయన ఎంత కించపడి వుంటారో!

సూరకవి—సూరన్నా! సీతా! మీ మాటలు తీసివెయ్యలేను. ఈసారి వర్తమానం వస్తే వెళ్తానులెండి!

ము. సూరన్న—మహారాజులుంగారు ఈపాటికి పెద్దాపురానికి బయలుదేరేవుంటారు. మరి మీకు వర్తమానం పంపడానికి అవకాశంవుండదు.

సూరకవి—(ఆలోచించి) అయితే వొక తమాషా చేద్దాం. నేను రాజుగారికి తెలీకుండానే పెద్దాపురం వెళ్లి, ఆయనకు ఆశ్చర్యం కలిగేటట్టు నా ప్రతిభను చూపి, అక్కడి అందరి మెప్పునూ పొందుతాను.

ము. సూరన్న—అయితే, గురువులకు శుశ్రూష చెయ్యడానికి శిష్యుడు కూడా వుండాలేమో!

సూరకవి—నీ కభ్యంతర మేమిటోయ్! సూది తోడిదే దారంకూడాను.

సీతమ్మ—నాదో చిన్న మనవి వుంది. ఎన్నేళ్లయిందో, మావాళ్లు మనవేపు చూడడమన్నా మానేశారు. మనం రెండుమార్లు వార్త పంపినా రానేలేదు.

నూరకవి—అవునవును. ఎందుకొస్తారూ!

తెలియనిదానవు సుమ్మీ!

పిలిచినచో వచ్చుటకును పెండ్లా? వధుగా!

సీతమ్మ—నన్ను పూర్తిగా చెప్పనియ్యండి! చెప్పొచ్చేదేమిటంటే—మీరెలాగూ పెద్దాపురం వెళ్తున్నారుగనక—నన్నూ, అబ్బాయినీ మా వాళ్లింట దిగబెట్టి మరీ వెళ్ళండి! కొంచెం చుట్టుఅన్నమాటేగాని, కోటిపల్లి దారిలోదే గదా! ఏం చేస్తాము? మా వాళ్లు రాకపోతే మనమే వెళ్లాలి. పుట్టింటికి వెళ్ళడానికి నాకు పిలుపులు అక్కర్లేదుగదా!

నూరకవి—మంచి గడుసెత్తే ఎత్తేవు, ఖర్చులో ఖర్చు కలిసివస్తుందని. పంపించడమేమో పంపించి వేస్తాను గాని తిరిగి తీసుకువచ్చే పూచీ మీ వాళ్లది. దీనికి ఒప్పుకొంటావా?

సీతమ్మ—మా వాళ్లు రాకపోతే, మా నూరన్న తీసుకువస్తాడు, మీకు కష్టమని తోస్తే.

నూరకవి—అదికాదు చెప్పేది. దూరాభారాన్నుంచి రాకరాక అమ్మాయిగస్తే పుట్టింటివాళ్లు ఓ ఏడాదో, ఆరు నెల్లో వుంచుకోకుండా వెంటనే పంపివేస్తారంటావా?

సీతమ్మ—వుంచమంటేమాత్రం వుండడానికి ఇవతలవాళ్లు అంత తెలివితక్కువగా వుంటారా యేమిటి! మనంతట మనం వెళ్ళినప్పుడు మర్యాదగా రెండింటే రెండు రోజులుండి వెనక్కి రావలసినదే. సీతమ్మంటే నూరకవిగారి భార్య అని జ్ఞాపకం వుంచుకోండి!

నూరకవి—అయితే నీయిష్టం. నూరన్నా! ప్రయాణానికి మూటా, ముల్లె సిద్ధం చెయ్యి.

(నిష్క్రమణం)

## నాలుగవ రంగం

[పెద్దాపురంలో. తిమ్మ జగపతి సభాభవనం. రాజులూ, కవులూ ప్రవేశం.]

తిమ్మ—మూడు రోజులనుంచీ మన మహోత్సవం జయప్రదంగా జరుగుతూవున్నందుకు చాలా సంతోషం! ఇలా జరగడానికి అన్నివిధాలా సాయపడిన ప్రభువులందరూ కారణం! వారందరికీ మా ధన్యవాదాలు. ఈదినంతో సభ పరిసమాప్త మౌతుంది. మన కార్యక్రమాన్ని అనుసరించి యీరోజు కవితాగోష్ఠి జరగాలి; మనం అంతా కవితామృతాన్ని శ్రుతిపేయంగా చేసి, ఆనందంగా ఈసభను ముగించాలి. ప్రభువులవెంట వారివారి ఆస్థానకవులు వచ్చేవున్నారుగనక, వారు వారివారి కవితాకళని ప్రదర్శించాలని మా అభ్యర్థన.

ఏనుగు లక్ష్మణకవి—అయితే యిందులో కేవలం అతిథుల పక్షమున వచ్చిన కవులే పాల్గొనవలెనా! అందరికీ అవకాశం వున్నదా? ఈ విషయం ప్రభువులు వివరించాలి.

తిమ్మ—యిందులో ఏ నియమమూ లేదు. కవులయినవారందరూ పాల్గొనవచ్చు. కవిత్వం వచ్చిన ప్రభువులున్నా పాల్గొనవచ్చు. (నవ్వు)

లక్ష్మణ—అయితే నాతో పద్యంలో సంభాషణ జరిపే కవు లెవరన్నా వుంటే రావొచ్చు. ప్రశ్న సమాధానాలు రెండూ ఒక్క పద్యంలోనే ముగియాలి.

నూరకవి—ఇదిగో! నేను తయారుగా వున్నాను.

విజయ—(తనలో) ఓహో! మా నూరకవిగారు వచ్చారే—ఎలాగయితేనేం! ఇక ఫర్వాలేదు.

లక్ష్మణ—మీ రేయది?

నూర— చీపురుపల్లి;

లక్ష్మణ—పేరో?

నూర— నూరకవి;

లక్ష్మణ— ఇంటి పేరు?

నూర— ఆకిదమువార్;

లక్ష్మణ—మీ రాజు?

నూర— విజయరామనృపోరాజు;

లక్ష్మణ— అతఁ డేమి, సరకుడా?

నూర— భోజుఁడయా.

సభ్యులు—ఒక్క చిన్న కందపద్యంలో ఎంత విషయాన్ని ఇమడ్చగలిగారు ఈ కవులు! చాలా ఆశ్చర్యంగా వుంది!

లక్ష్మణ—కవిగారి ప్రతిభ అద్భుతం!

సూర—గడిచెను నూటయేఁబదియేఁడులు

గంటము లేక రచింతు; దిట్టగా

దొంగిలినా పద్యాలమని

ఈ లిపకుల కులశైలరాజముల్;

విడిచి, యనుగ్రహించి నను

పేద ధనాధిపతులుగ జేసు; చే

నడిదము వాడ; సూరన స

మాఖ్యుఁడ; నా కొకరుండు సాటిరే!

౧. సభ్యుడు—భీమకవి, శ్రీనాథుల తర్వాత అంతటి కీర్తిసంపన్నుడులా వున్నాడు ఈ మహాకవి!

౨. సభ్యుడు—నిజంగా అలాంటివాడే. సందేహం లేదు.

సూరకవి—లక్ష్మణకవిగారు దయచేసి తమ ప్రావీణ్యం ప్రదర్శించాలని ప్రార్థన.

లక్ష్మణ—(గొంతుక సవరించుకుని)

తీరుగ నక్ష్వాకుకుల

తిమ్మజగత్పతికీర్తి మా

హేశశరద్ద్విజన్మకులి

శాయుధజాతుల మించె; శౌర్యమా

హోరశరద్ద్విజన్మకులి

శాయుధజాతుల మించె; రూపమా

హీరశరద్ద్విజన్మకులి

శాయుధజాతుల మించె నిద్ధరన్.

సభ్యులు—భేష్! భేష్! బలే కవిత్వముంది!

సూరకవి—మా మహారాజులుంగారి సంగతి చెప్తాను, చిత్తగించండి.

రాజు కళంకమూర్తి; రతి

రాజు శరీరహీను డంబికా

రాజు దిగంబరుండు; మృగ

రాజు గుహాంతరసీమవర్తి; వి

భ్రాజితపూర్వవాద్విజరు

రామనృపాలుడు రాజుగాక—ఈ

రాజులు రాజులే! పెంత

రాజులుగాక! ధరాతలంబునన్!

సభ్యులు—ఈ కవిత్వం మరీ అద్భుతం! సర్వజనగ్రాహ్యం! సరిరాజుల పక్కలో బల్లెంపోటులా ఉన్నది.

ఒక రాజు—సభాసదులు గమనించాలి! సూరకవిగారి ఈ పద్యమూ, చదివే వైఖరీ యీసభలో వున్న రాజులందరికీ అవమానం కలిగించింది; మాకు చాలా మనస్సంకటంగా వుంది.

సూరకవి—సభ్యులకి తొందరపాటు కూడదు. వారికి సాహిత్యజ్ఞానం తక్కువయితే- నా పద్యంలోని 'ఈ రాజులు రాజులా?' అనేది పద్యంలో చెప్పబడ్డ రాజులని తెలియజేస్తున్నదో, ఎదటఉన్నవారిని తెలుపుతుందో ఎరిగినవాళ్లని అడిగి తెలుసుకోవచ్చు! స్వతహా కవిపండితులైన సభాసదులున్నారు! వారి ఆస్థాన కవులు లక్ష్మణకవిగారున్నారు. వారి నడగవచ్చు.

తిమ్మ—సభ్యుల నుద్దేశించి సూరకవిగారు చెప్పేరనడానికి వీలులేదు. దేవతలనుగురించే వారట్లా చెప్పారు.

లక్ష్మ—మా ప్రభువుల అభిప్రాయమే నాదీన్నీ. అంతకంటే ఎక్కువ చెప్పటం అనవసరం.

తిమ్మ—నిజంగా విజయనగరప్రభువుల ఆస్థానానికి సూరకవీంద్రులు ఒక మణిదీపం!

విజయ—కవిసార్వభౌమా! సూరకవిచంద్రా! నిండుసభలో నామర్యాదను నిలబెట్టినమే కాకుండా, నాఘనతను వెల్లడించిన మీకు ఇదే అనేకంగా ధన్యవాదాలు.

సూరకవి—ప్రభువులు అలా సెలవియ్యకూడదు. నేను ప్రభువుల భృత్యుణ్ణి. నాధర్మం నేను నెరవేర్చక పోతే ఆత్మద్రోహం చేసిన ట్లవుతుందని, చనవుచేత యిక్కడికి వచ్చాను. ప్రభువుల వాత్సల్యానికి ఎంతో ధన్యుణ్ణయినాను.

(నిష్క్రమణం.)

అయిదవ రంగం

[దర్బారు : ప్రవేశం : విజయనగరప్రభువు, దివాను సీతారామరాజు, సూరకవి, కొందరు సభ్యులు.]

విజయ—కవిగారూ! మీరు పెద్దాపురంలో చెప్పిన పద్యము అక్షరలక్షలు విలువగలది. అది మీ కవిత్వానికీ, నా కీర్తికీ గీటురాయి అయింది. తక్కిన రాజులకు తలవంపులు తెచ్చినది. మీరు చూపిన యీ గౌరవానికి నేను యావజ్జీవమూ ఋణపడివున్నాను.

సూరకవి—ప్రభువులు అలా సెల వివ్వకూడదు. ప్రభువుల అనుగ్రహం వుండబట్టే అలా జరిగింది. నిజంగా-ఆ సభలోని రాజులందరూ ఉడుక్కోవాలనే అలా పద్యం చెప్పినాను. లేనిపోని తగాదాలు ఎందుకని, అభిప్రాయాన్ని మార్చి చెప్పినాను.

విజయ—ఓహో! అలాగా!

సూరకవి—చిత్తమండి. 'ఈ రాజులు రాజులా?' అంటే ధరాతలంలోని రాజులు రాజులు కారని భావం. పద్యంలోని రాజులంతా దేవతలేగదూ! వాళ్ళకే దిక్కు లేకపోతే, భూమిపైనున్న మానవమాత్రుల లెక్కలేమిటి అని నా అభిప్రాయం. కాని ఈ అభిప్రాయాలు అందరికీ అర్థంకావు ప్రభూ!

సీత—ఏదో, కలుగురిలాగే మామూలుకవి అనుకున్నాను గాని, మన సూరకవిగారు ఇంత గొప్ప వారనీ, ఇంత ధైర్య, సాహసాలు కలవారనీ ఎప్పుడూ అనుకో లేదు. కవిగారూ! నాతప్పు క్షమించండి!

విజయ—నేను ఆనాడే మనస్సులో సంకల్పించుకున్నాను, కవిగారికి స్వర్ణాభిషేకం చేయించాలని. ఈదినం సభలో ప్రధానవిషయం అదే!

సూర—సర్వజ్ఞ! సర్వజ్ఞ!

(కనకాభిషేకం జరుగును. మంగళతూర్య నాదాలు చెలరేగును.)

విజయ—కవిసార్వభౌమా! మీకు బంగారు మొహరీలతో స్నానం జరిగింది. ఈ ధనమంతా తీసుకొని, తాము స్వేచ్ఛగా ఖర్చు చేసికోవచ్చు.

సూర—నాదొక చిన్న మనవి, ప్రభువులు! నాకు ఎలాగో ఒకలాగు దినం గడిచిపోతున్నది. దాన్ని గూర్చి నాకు ఎప్పుడూ ఏచింతా లేదు. మరిన్ని—ఇంతదాకా ప్రభువుల అనుగ్రహంవల్ల స్నానం చేసిన నీళ్లు తాగవలసినంత అవసరం కలగలేదు. క్షమించాలి, ప్రభువులు!

విజయ—(ముక్కుమీద వేలేసుకుని) ఏంగర్వా, ఏమి నిర్లక్ష్యం! నిజంగా మీరు కవిత్వసామ్రాజ్యానికి సార్వభౌములేనండి! నాదే పొరపాటు, ఈధనం తీసికోమని చెప్పడం! నాతప్పు క్షమించాలి. ఈ ధనానికి సమానమైన స్వర్ణాన్ని తమ బసకు పంపిస్తాను. స్వీకరించాలి.



# మంగళాష్టకము



## శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు =

మెచ్చీమెచ్చని విద్దెల
వచ్చీరానట్టి ముద్దువచ్చు నుడులకే
యిచ్చుమెఱఁగి మావలసిన
విచ్చి మముం గన్నతల్లి! యేలితి నాఁడే.

పలుకే నీ పుట్టిల్లఁట!
పలుకే నినుఁ గన్న బ్రహ్మపట్టణమఁట, నీ
పలుకే సృష్టికిఁ దలఁపఁట!
పలుకుఁబడుల తల్లి మమ్ముఁ బాలింపవఁటే!

తలఁపుల పలుకుఁదనమునను,
తలఁపుల కన్నుల వెలుంగు తల్లితనమునన్
తలఁపుల పెరిమఁదనమునను,
తలఁపుల పాలిచ్చి మమ్ముఁ దనిపితి తల్లీ!

తొలిపలుకుల, మలిపలుకుల
నెలపలుకుల నపుడు, నిపుడు నేముతలఁపఁగాఁ
గలకల నవ్వేదు ప్రియమునఁ
బలుకుఁబడికిఁదలఁపుఁబడియె ప్రాణమఁటమ్మా.

'ఉంగా ఉంగా' యను మా
యంగుటికే పాలచంటి నందించితో వా
గంగన! నీకృప మాకున్
మంగళసంగీత కావ్యమాలిక లొదవెన్.

కొమ్మని నీ పదతీర్థము
లిమ్మఁకఁ, బరమార్థగతుల నిమ్మఁకఁ జాలున్
తమ్ముల కిచ్చే దుగ్ధము
లిమ్మని పీడింతు మమ్మ యెడబిడ్డలమై.

తడఁబడని కడిఁదిపదముల
నడిలోఁ బ్రహ్మంబె నీకు వశ్యంబనఁగా
తడఁబడు పదముల జీవులఁ
బడకుండఁగఁ బట్టు టెంతపాటిది తల్లీ!

నిరతబ్రహ్మోపాసన
పరులంతర్ముఖులుగాంచి ప్రముఖతఁబొగడన్
దెరవెనుక భామవలె వా
తెఱవెనుకనె యుండి రక్తిఁదేఁ నాడఁగదే!



ప్రధాన నగరిలో పతాకారోహణ

స్వాతంత్ర్యోత్సవ సందర్భమున న్యూఢిల్లీలో రాజ్యాంగ పరిషత్తు సభాపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారు పతాకారోహణోత్సవం చేస్తున్న దృశ్యము.




# అదృశ్యకిరణములు

వానచినుకులు పడినపుడు మన ప్రక్కను కంటికింపగు ఇంద్రధనుస్సు కనిపించుచుండును. ఇది సామాన్యముగా పైన ఎఱుపు, లోన ఊదారంగులు కలిగియుండును. తెల్లని సూర్యకిరణము వర్షబిందువుచే ఏడురంగులుగా విచ్ఛిన్నముగావింపబడుటచేత ఈ ఇంద్రధనుస్సేర్పడుచున్నది. ఈ ఏడురంగుల కిరణములు సూర్యుని వెలుతురులో సమ్మిళితములై యున్నవి. సూర్యకిరణము లొక చిన్న రంధ్రముగుండ ఒక చీకటి గదిలో అమర్చబడిన పట్టకము (Prism)పై బడునట్లు చేసిన ఎదుటిగోడపైన ఏడురంగులు స్పష్టముగా చూడవచ్చును. ఎఱుపు, లేక శోణవర్ణము, దానిక్రిందనే నారింజ, పసుపుపచ్చ, ఆకుపచ్చ, నీలము, నీలి (Indigo), అన్నింటికన్న క్రిందట ఊదా, లేక నీలలోహితము అను రంగులను క్రమముగా చూడవచ్చును. ఇట్టి చిత్రపటమునే వర్ణపట (Spectrum) మని చెప్పెదరు. ఇంద్రధనుస్సు సూర్యుని కిరణముల ప్రకృతి నిర్మిత మహావర్ణపటము. మనకు కనబడు వెలుతురు ఈ ఏడు రంగుల కిరణములవల్ల ఏర్పడినదే. ఈ వెలుతురే మానవ జీవనాధారము. ఈ వెలుతురుకిరణము లేరంగువయినా సరే, మన దేహముపై బడినపుడు హాయిగా నుండును. అపుడే ఉదయగిరి విడచివచ్చు బాలసూర్యుని కిరణములు మన నిమీలితనేత్రములపై బడుచున్నపుడు కలుగు ఆనందము వర్ణనాతీతము.

వర్ణపటములో ఎఱుపురంగుతో కనబడు కిరణములు చాలపొడవయిన అలలరూపములో వ్యాపించును. సూర్యుడు ఉదయాస్తమయకాలములందు, దట్టముగా మంచుకురియు రోజున ఎఱ్ఱనిబంతిగా నగుపించుట అందుకే. ఈ ఎఱుపువాటికన్న కొంచెము పొడవు అలలు గల కిరణములు నయనాతీతములు. వీటికి అవిశోణ కిరణము (Infra-red rays)లని పేరు. ఇవి మనము చూడలేకున్నను, వాటి స్పర్శ మన మనుభవింపగలము. సూర్యుని వేడిమి తెలియుట దేహముపై ఈ కిరణపుంజములు పడుటచేతనే! ప్రజ్వలించు అగ్నులన్నిటినుండి అవిశోణకిరణములు పుట్టి ప్రసరించునుగావున వీటికి 'ఉష్ణకిరణము'లని నామాంతరము. వీటి ఉనికి ఉష్ణమాపకముతో తెలిసికొనవచ్చును.

అవిశోణకిరణము లెంతటి దట్టమయిన మంచులోను, ధూళిలోనుగూడ చొచ్చుకొనిపోగలవు. ఈ గుణమువల్ల నివి ఫోటోగ్రఫీలో విరివిగా నుపయోగింపబడుచున్నవి. ఈ కిరణములద్వారా ఇరవై, ముప్పై మైళ్ల దూరములో నుండు ప్రదేశముల ఫోటోలుగూడ తీయుట నేడు సులభసాధ్యమయినది. అంతేగాదు, చీకటిలోగూడ ఫోటోలు తీయవచ్చునట! వీటితో ఎన్నో వేల మైళ్ళదూరములో నుండు నక్షత్రముల ఉష్ణోగ్రతలు తెలిసికోబడినవి.

అవిశోణకిరణములతో తీసికోబడిన ఫోటోలవలన వైద్యములో కొన్ని రోగలక్షణములు క్రొత్తగా తెలిసికోబడినవట. మనము అవిశోణకిరణములను చూడగలిగినపుడు వస్తువు లేవిధముగా కనబడునో చూపునదే అవిశోణకిరణములతో తీసిన ఫోటో. దానిలో పచ్చనిచెట్లు తెల్లగా నగుపడును. కొన్ని కిరణములు మన కదృశ్యములుగా నుండుట ప్రకృతి వైచిత్ర్యము. మనకు ఏర్ప-

కిరణముల (X-rays) దృష్టి యుంచిన ఎక్స్-కిరణముల ఫోటోలలో నున్నట్లు మన మెంకరికొకరు ప్రేతములవలె కాన్పించెడివారము! అపుడు గాజు సీసమువలె నల్లగా నగుపించెడిది!

వర్ణపటములో ఎఱుపునుండి క్రిందుగా వచ్చిన, కనపడు వెలుతురులో కురుచఅలపొడవు (Short-wave-length) గల నీలలోహితకిరణములు చూడవచ్చును. వీటితర్వాత కురుచఅలపొడవు గల కిరణములు మనకు కానరావు. వీటికే అతినీలలోహితకిరణము (Ultra-violet Rays) లని పేరు.

టన్నులకొలది పూతినాశకము (Antiseptic) లుపయోగించినను చావనన్ని లక్షల సూక్ష్మజీవులు, ఒక రోజు బాగుగా ఎండగాచినవెంటనే నామరూపములు లేకుండ నశించును. దేహమున కెల్ల రోగముల నిరోధించు తను శక్తి నిచ్చుట కొక ఆతపస్నానము (Sun-bath) చాలు! ఆతపస్నానమువలన దేహమందలి నాడీమండలము బలిష్ఠమగును. శరీరములో నొక నూతనోత్సాహ ముదయించును. సూర్యుడు సర్వవ్యాధివినాశకు డగుటకు కారణము సూర్యరశ్మిలో అతినీలలోహితకిరణము లుండుటయే. ఈ కిరణములు 'ఆరోగ్యకిరణములు' అని పిలువబడుచున్నవి. ఇవి దేహముపై బడినపుడు చర్మపు క్రిందిభాగమున నున్న ఎర్గోస్టిరాల్ (Ergosterol) అను పదార్థము 'డి' విటమినుగా మారును. ఆహారపదార్థములపై గూడ ఈ కిరణములు పడినపుడు వాటిలో గూడ 'డి' విటమిను ఉత్పన్నము గావింపబడుచున్నది. 'డి' విటమిను పిల్లల ఎముకలు, దంతముల వరుస క్రమముగా వృద్ధిచెందుట కత్యవసరమని మనకు తెలియని విషయము గాదు. ఇది పిల్లలలో రికెట్సువ్యాధి, వంకరకాళ్లు, గూని, రక్తవిహీనత (Anemia) మొదలగు చెడువ్యాధులను నిర్మూలించును—రానివ్వక చేయును. పెద్దలలో గూడ నిది శీర్ణవాతము, మధుమేహరోగము మొదలగు వాటిని రూపుమాపును.

అతినీలలోహితకిరణములు దేహమున విటమిను 'డి' నుత్పన్నముచేయుగలుగుటేగాక రక్తమున కుత్తేజకరముగా పనిచేయును. రక్తము వీటివలన క్షయ మున్నగు వ్యాధిక్రిముల నిరోధింపగల శక్తిని పొందును. అతినీలలోహిత కిరణములతో చికిత్స నవీనవైద్యశాస్త్రములో నొక ముఖ్యభాగము.

వైద్యములో అతినీలలోహితకిరణముల ఉపయోగములు, చర్మముపై వాటిప్రభావముమీదనే ఆధారపడియుండలేదు. అన్నిపదార్థములు వాటిపై చీకటియందు అతినీలలోహితకిరణములు పడినపుడు వాటికి ప్రత్యేకమైన రంగుతో ప్రకాశము నొందును. ఈ ప్రకాశమునకు 'ప్లవకాంతి' (Fluorescence) అని పేరు. వెన్న, నేయి, నూనె మొదలగున వీ ప్లవకాంతి నొందగలవు. అందుచే వీటిలో కల్తీ యయినపుడు ప్లవకాంతి మారును. అందుచే కల్తీయయినదా, లేదా యని అతినీలలోహితదీపము (Ultra_violet-ray lamp)తో వెంటనే కనిపెట్టవచ్చును. సామాన్యదృష్టికి సూక్ష్మదర్శిని (Microscope) క్రిందను ఆరోగ్యమైన రక్తపు రసిక (Serum) కు, రోగిరసికకు భేదము తెలియదు. కాని అతినీలలోహితకిరణములు పడినపుడు వేర్వేరు రక్తముల రసిక వేర్వేరు ప్లవకాంతి నొందును. ఈనాడు వైద్యుడు కొన్ని రక్తపుచుక్కలు పరీక్షగావించి రోగము నిర్ణయించగలడు.

ఈకిరణములు బహుకురుచఅలపొడవు (Wave-length) గలవగుటచేత అతిసూక్ష్మములయిన పదార్థములు సూక్ష్మదర్శినిద్వారా స్పష్టముగా గోచరించునట్లు చేయుచున్నవి. వీటివలన సూక్ష్మదర్శినిద్వారా ఇంతవరకదృశ్యములుగా నున్న వేలకొలది సూక్ష్మక్రిములు చూడగలుగుచున్నాము.

వీటితో విషములు ఎంత స్వల్పముగా నున్నను గుర్తింపవచ్చును. ఒక్కొక్కసిరా దానికే ప్రత్యేకమయిన ప్లవకాంతితో ప్రకాశించును. ఫోర్జరీనేరములలో పత్తేదారులకు అతినీలలోహితకిరణము లెంతయో సహకరించును. అపరాధపరిశోధనయం దీ కిరణములు ముఖ్యపాత్ర వహించుచున్నవి.

ఇతరదేశములలో ఈ కిరణముల దీపము నిత్యజీవితములో వాడబడుచున్నది. చాకలి ప్లవకాంతి నిచ్చు రంగులేని సిరాతో బట్టలకు గుర్తు వేయును. పగలు ఈ

గుర్తులు బట్టలపై నగుపించవు గావున బట్టలు మరక లేక స్వచ్ఛముగా నుండును. చాకలి చీకటిలో అతినీల లోహితకిరణముల దీపముతో బట్టలు గుర్తించుకో గలడు. ఇది ఒక ఉదాహరణమాత్రమే.

అతినీలలోహితకిరణములకన్న తీక్ష్ణమయినవి, కురుచఅలపొడవుగలవి ఎక్స్-కిరణములు (X-rays). వీటిని కనిపెట్టిన మహనీయుడు రాంట్ జెన్. ఎక్స్‌కిరణములు వైద్యములో నే రోగనిర్ణయమున కధికముగా వాడబడుచున్నవి. ఎక్స్‌కిరణములు దేహముపై ప్రసరింపజేసి తెరపై దేహయంత్ర మేవిధముగా పనిచేయునో, హృదయము ఏ విధముగా పనిచేయునో, రక్త మేవిధముగా ప్రవహించునో ప్రత్యక్షముగా చూడనగును. ఎముకలు విరిగినపుడు, దేహములో పరాయివస్తువులు చేరుకొన్నపుడు, దేహము హృద్రోగములచే, నాడీ రోగములచే, క్షయ మొదలగు వ్యాధులచే బాధపడుచున్నపుడు, ఎక్స్‌కిరణముల ఫోటో రోగనిర్ణయమునకు, చికిత్సకు ఎంతయో దోహద మొనర్చును.

ఇవి ఏవిధముగా దేహములోని ఎముకలు చూపెట్టునో అట్లే ఒక ఉక్కుముక్కలో భాగములు, తాళము వేయబడిన పెట్టెలోని వస్తువు చూపగలవు. జైలు చూచుటకు వచ్చువారు నిషేధింపబడిన ఆయుధములు దాచుకొని లోనికి పోవుట ఎక్స్-కిరణములతో వెంటనే కనుగొనవచ్చును. మొక్కలు పెరుగునపుడే వాటిలో దోషము లేవైన ఉండిన కనిపెట్టి వెంటనే సరిదిద్దవచ్చును.

ఇవి అతితీక్ష్ణత గలవిగాని సీసముగుండ నివి చొచ్చుకొని పోలేవు. ఇవికూడ కొన్ని పదార్థములలో ప్లవకాంతిని కలిగించును. ఇది అధికముగా ప్లవకాంతి నొందింపజేయు బేరియంప్లాటినోసయనైడు, కాల్షియం టంగ్‌స్టేటు అను రెండుపదార్థములు ఎక్స్‌కిరణముల ఫోటోగ్రఫీలో వాడబడుచున్నవి.

ఎక్స్‌కిరణములే లేకుండినయెడల భౌతికశాస్త్రములో ఈనాటికి పదార్థస్వరూపము విశదమయ్యేడిది కాదు. పరమాణుస్వరూపము, స్ఫటికముల అంతరాకృతి (Crystal structure) ఎక్స్‌కిరణములవల్ల విశదీకరింపబడినది. పదార్థమంతయు బహుశః స్ఫటికాకృతి కలిగియుండునని శాస్త్రజ్ఞుల భావన. ఏలవనగా- ఎక్స్‌కిరణములవల్ల రబ్బరు, పట్టు మొదలగునవన్నియు స్ఫటిక నిర్మితము లయినవే యని తెలియుచున్నది.

ఎక్స్‌కిరణములతో పరిశీలించినపుడు ప్రతిధాతువు ప్రత్యేకరూపముతో నగుపించును. ఈ కిరణములతో పరిశోధన ధాతుశోధనవిద్య (Metallurgy) నెంతయో అభివృద్ధికి కొనివచ్చినది. ఒక లోహము తయారగుచున్నపుడు, పోతపోయునపుడు, అచ్చులు వేయునపుడు వివిధసమయములలో లోహపు అంతరాకృతి ఏయే మార్పులుపొందునో ప్రత్యక్షముగా చూడవచ్చును. వజ్రముల స్వరూపము ఎక్స్‌కిరణములవలనే విశదమయినది. అందుచే ఒక వజ్రముయొక్క ఎక్స్‌కిరణముల ఫోటో తీసి అది ఎటువంటిదో, దాని విలువ యెంతో నిర్ణయింపనగును.

ఎక్స్‌కిరణములు శరీరముపై బడినపుడు అది కణజాలములను (Tissues) నాశముగావించును. అందుచే అపాయకరమగు కాల్పులు గలుగును. (ఈవిధముగానే ఎక్కువసేపు దేహముపై అతినీలలోహితకిరణములు పడినపుడు చాల తలనొప్పి, జ్వరము కలుగును.) ఎక్స్‌కిరణములఫోటో తీయునపుడు, వాటితో పరిశోధన సల్పునపుడు వైద్యులుఅపాయము కలుగకుండ సీసముతో చేసిన కవచములు ధరింతురు. కణజాలములను కాల్చివేయు గుణము కలిగియుండుటచేతనే ఎక్స్‌కిరణములు తామర, గజ్జి మున్నగు భయంకరచర్మవ్యాధులను నిర్మూలము గావింపగలవు. ఈ కిరణములు మీద పడినవెంటనే క్రిమికీటకాదులు నశించును. శరీరముపై ఎక్స్‌కిరణములు చాలకాలము పడుచుండిన వంధ్యాత్వము గలుగునట!

విత్తనములు, గడ్డలు (Bulbs) ఎక్స్‌కిరణముల ఆవరణములో కొంతకాల ముంచిన వాటి స్వభావమే మారి, క్రొత్తరకపు మొక్కలు వాటినుండి పుట్టును. లేకున్న వాటిలో ప్రాణమే నశించును. కాని ప్రకృతిలో లేని ఎన్నో క్రొత్తవృక్షములను ఈ కిరణముల వల్ల సృష్టింపవచ్చును. ద్రాక్షపండ్ల విత్తులు ఎక్స్‌కిరణముల వైతన్యమునకు పాల్పడినతర్వాత వాటి మొక్కలు ఐదేండ్లకుమారుగా ఐదువారములలోనే పండ్లుకాయుట

మొదలిడినవట! పొగాకు మొక్కలు కొన్ని పదునై దడుగుల ఎత్తున కెదిగినవట! ఈ విజ్ఞానరంగములో నింక ఎన్ని వింతలు చూడనగునో!

ఎక్సుకిరణములకన్న తీక్ష్ణముగా చొరబడు శక్తి గల కిరణము లున్నవని, అవి అనంతవిశ్వమునుండి మన భూమిపై బడుచున్నవని తెలియుచున్నది. ఈ కిరణము లింతవరకు కనిపెట్టబడిన కిరణము లన్నింటికన్న అతి కురుచఅలపొడవు గలవి. బహుతీక్ష్ణత గలవి. వీటికి 'విశ్వకిరణములు' (Cosmic rays) అని పేరు.

విశ్వకిరణము లెన్నో లక్షల వోల్టు (V lts) ల శక్తి గలవి. ఒక విశ్వకిరణమున కున్న శక్తిని నేడు పరమాణువిచ్ఛిన్నముగావించిన యంత్రముతోగూడ మానవుడు ఉత్పన్నముచేయలేడు. ఈ కిరణములు భూమియందట, సముద్రపు అడుగుభాగములో సర్వత్ర వ్యాపించి యున్నవి. విశ్వకిరణములు లేని చోటు లేదు. "ఇందు గల వందు లేడని సందేహము వలదు—ఎందెందు వెదకి జూచిన నందందే కలవు" అని వీటినిగూర్చి చెప్పవచ్చును. ఇవి నిరంతరము పరమాణువులను, పదార్థమును విచ్ఛిన్నముగావించుచున్నవి. వీటి ప్రభావము, తీక్ష్ణత విజ్ఞానపరికరములతో కొలవవచ్చును. ఎత్తునకు పోవు కొలది వీటి తీక్ష్ణత మెండగును.

ఇవి గగనములో నక్షత్రవీథి (Milky way) నుండి వచ్చునని కొందరు చెప్పెదరు. కొందరు ఇవి ప్రకృతిలో పదార్థపు పుట్టుకననుసరించి, ప్రకృతి రహస్యమునుగురించి తెలుపగలవని ఊహించుచున్నారు.

విశ్వకిరణము లెట్టివి? వాటి ధర్మము లేవి? అను ప్రశ్నలపై నేడు వైజ్ఞానికప్రపంచములో తీవ్ర చర్చలు సాగుచున్నవి. విశ్వకిరణములు ఎక్సుకిరణముల వంటివే యనియు, ఇవి పరమాణువు జననమొందినపుడు విడుదలయగు శక్తిని వహించుచున్నవనియు మిల్లికను మహాశయుని సిద్ధాంతము. పదార్థము విచ్ఛిన్నమయినపుడు గూడ ఇవి జననమొందుచున్నవనియు, వీటివలన విశ్వము (Universe) ఛిన్నాభిన్నముగా చేయబడుచున్నదనియు జీన్సుదొర ఊహ. నక్షత్రములచే త్యజింపబడి వాటినుండి భూమిపై పడుచున్న విద్యుత్పరమాణు రజమే ఈ విశ్వకిరణములని మరికొందరి ఊహ.

ఏది ఎట్లున్నను విశ్వకిరణములు జీవరహస్యమును తెలుపునని జీవశాస్త్రజ్ఞుల అభిప్రాయము. విశ్వకిరణములు దేహమున జీవకోశకములను (Cells) నిరంతరము నాశముగావించుటచేతనే ముసలితనము ప్రాణులకు ప్రాప్తించునట! విశ్వకిరణముల అత్యద్భుతములయిన గుణము లెందరో శాస్త్రజ్ఞుల నాకర్షించినవి. వారి పరిశోధనఫలిత మేమగునో!

ఈ అదృశ్యకిరణములనుగూర్చి నేడు తెలిసినదానికన్న ఎంతో తెలిసికొనవలసియున్నది. వెలుగునకు తరంగస్వభావము గలదనియు, వెలుతురుగూడ విద్యుచ్చుంబకీయతరంగముల (Electro - magnetic waves) ఒక అవతారమేననియు నేటి శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

ఈ అదృశ్యకిరణతరంగములే జీవము (Life) న కాధారమైయుండవచ్చును. ఈ కిరణములను గూర్చిన విజ్ఞానము, వీటి ఉపయోగము అభివృద్ధి నొందుకొలది వైద్యమే మారుమారగును. మనశ్శాస్త్రజ్ఞులు తలంపులు గూడ కొన్ని అదృశ్యతరంగములే యని ఊహించుచున్నారు. ఇకమీద శబ్దగ్రాహకములవలె యోచనాగ్రాహకములు (Thought - recorders) రాగల సూచన లున్నవి.

డి. వి. రామచంద్రన్



# భూప్రదక్షిణము

— శ్రీ మావిండిపూడి వెంకటరంగయ్య —

రోజు రోజుకూ ప్రపంచంలో శాంతికి బదులు సంక్షోభం పెరుగుతున్నది. ఈ సంక్షోభం ఆర్థికరంగంలోనూ, రాజకీయరంగంలోనూ కనిపించు చున్నది. ఆర్థికసంక్షోభం "డాలర్ల కాటకం" అనే రూపం ధరించింది. రాజకీయసంక్షోభం అధికార వ్యామోహంకారణాన ఏర్పడ్డ యుద్ధరూపాన్ని ధరించింది.

## డాలర్ల కాటకం

అమెరికా దేశంయొక్క చెలామణీ ద్రవ్యానికి డాలర్ అని పేరు. మనదేశంలో "రూపాయి" ఎట్టిదో అమెరికాలో "డాలర్" అట్టిదే. అమెరికా దేశంలోని వస్తువులను ఇతరదేశాలవారు కొనుగోలు చేయగోరిన యెడల డాలర్లను ఇచ్చి కొనవలసి యుంటుంది. ఇందులో విపరీతం ఏమీ లేదు. మన దేశంలోని వస్తువులను ఇతర దేశాలవారు కొనునప్పుడు మనకు వారు రూపాయలు ఇయ్యవలసిఉంటుందికదా! అయితే రూపాయలకాటకం సంభవించిందని ఎవరూ ప్రస్తుతం అనుకోవడం లేదు. ఏదేశానికి వెళ్లినా అచ్చటి ఆర్థిక చిక్కులన్నిటికీ డాలర్ల కాటకమే కారణమని చెప్పడం మామూలై పోయింది. ఇట్టి కాటకం సంభవించడంచేతనే ఆగస్టునెలలో ఇంగ్లండునందు, ఫ్రాన్సునందు, ఇండియాయందు, ఇతరదేశములన్నిటియందును ఆర్థిక విషయాలలో ప్రభుత్వంవారు అనేకమార్పులు చేయవలసివచ్చింది. డాలర్ల కాటకం అంటే ఏమిటో, డాలర్లయందు అన్ని దేశాలవారికి ప్రస్తుతం ఇంతటి వ్యామోహం కలగడానికి కారణం ఏమిటో, ఆర్థికంగా ప్రపంచం ప్రస్తుతం అనుభవిస్తున్న కష్టాలకు, ఈ కాటకానికి సంబంధం ఏమిటో మనం తెలుసుకోవలసి ఉన్నది.

## యుద్ధఫలితం

రెండవ ప్రపంచ యుద్ధమూలాన ఆసియా, యూరపు, ఆఫ్రికా, ఆస్ట్రేలియాఖండాలన్నిటిలో విపరీతమైన ఆర్థికపరిస్థితులు ఏర్పడ్డవి. అనేకదేశాలలో ఎక్కడలేని జననష్టం సంభవించింది. కష్టపడి పనిచేయ లేని వికలాంగులు ఎందరో ఏర్పడ్డారు. బాంబుల మూలాన వ్యవసాయయోగ్యములగు పొలములు, గనులు, కర్మాగారాలు, యంత్రములు, రోడ్లు, రైళ్లు, స్టీమర్లు, ఇండ్లు,—అన్నీ నాశనమయిపోయినవి. పశునష్టం ఎంతో కలిగింది. ఇంతటి విపరీతం సంభవించుటచేత ఆసియాయూరపుఖండాలలోని దేశాలలో ప్రజలకు కావలసిన పదార్థముల ఉత్పత్తి ఎంతో తగ్గిపోయెను. తినుటకు తిండి, కట్టుకొనుటకు బట్ట, తల దాచుకొనుటకు ఇల్లు—ఇవికూడ అనేక దేశాలలో దొరుకుట లేదు. సుఖంగా కాలక్షేపం చేయడానికి కావలసిన భోగపదార్థాల విషయం ప్రత్యేకంగా చెప్పవలసిందే లేదు. యుద్ధానికిపూర్వం ప్రజలకు లభిస్తున్న పదార్థాలలో సగంకూడా ఇప్పుడు పైదేశాలలో ఉత్పత్తిఅగుట లేదని చెప్పటలో అతిశయోక్తి ఏమీ లేదు.

## అమెరికా ఐశ్వర్యం

కాని అమెరికాలోమాత్రం రెండవ ప్రపంచ యుద్ధంమూలంగా ఇట్టి విపరీతం ఏమీ సంభవించలేదు. ఇంతే కాకుండా ఆ దేశంలో ఆర్థికపరిస్థితులు మరింత

చిక్కుబడ్డారు. యుద్ధరంగానికి చాలాదూరంగా ఆ దేశం ఉండడంచేతను, మిత్రమండలివారికి కావలసిన సామగ్రిలో చాలభాగమును ఆ దేశంలోనివారు తయారు చేయుటకు ఎక్కువ అనుకూలాలు ఉండినందునను, వారు వారి వ్యవసాయాన్ని, పరిశ్రమలను, రవాణా సౌకర్యాలను, నౌకలను, విమానాలను—అన్నిటిని అపరిమితముగా వృద్ధిచేసుకొనగలవారైరి. యుద్ధము ముగియునప్పటికి ఆర్థికముగా వారి దేశము పూర్వముకంటె అనేకరెట్లు ఎక్కువగ సమస్తపదార్థములను ఉత్పత్తి చేయగలదయ్యెను.

ప్రస్తుతము ఇతరదేశములకు కావలసిన ఆహార పదార్థాలు, బట్టలు, ఉక్కు, యంత్రములు, తదితరవస్తువులు అమెరికాయందు ఎక్కువగా తయారగుచున్నవి. వాటిలో తమకు కావలసిన భాగమును వారు ఉంచుకొని, శేషమును ఇతరదేశములవారికి విక్రయించుటకు సంసిద్ధులుగా ఉన్నారు. కాని వారివద్దనుండి ఇతరదేశములవారు వీటిని కొనుటకు సాధనమేది? అను విషయమునందే డాలర్లకరువు సంభవించుచున్నది. దుకాణములో వర్తకునివద్ద మనకు కావలసిన సామానులుంచునప్పుడు, మనదగ్గర రూపాయలు ఉన్నగాని వాటిని కొనుటకు వీలు పడదుగదా! అదేవిధముగ అమెరికాదేశము ప్రస్తుతము ప్రపంచమునకంతకు ఒక దుకాణంగా ఉన్నది. వారివద్దనుండి మన కేదైనా సరకులు కొనదలచినయెడల వారి దేశములో చెలామణియగు డాలర్లను మనము వారికి ఇయ్యవలెను. ఇతరదేశముల వారివద్ద కావలసినన్ని డాలర్లు లేనపుడు, అమెరికాలో వస్తుసామగ్రి సమృద్ధిగ నున్నప్పటికిని, అవి మనకు గాని, ఇతరదేశములవారికి గాని లభించుట సాధ్యముకాదుగదా! "అంగట్లో అన్నీ ఉన్నవి. అల్లుని నోట్లో శని ఉన్నది" అన్న సామెత ఈ సందర్భంలో మనకు జ్ఞాపకంరాకమానదు.

## చెలామణీసంపాదనకు సాధనములు

అమెరికాలో చెలామణియగు డాలర్లను సంపాదించుటకు రెండేమార్గములు. మన దేశంలో తయారయ్యేటటువంటిన్నీ, అమెరికావారికి కావలసినటువంటిన్నీ వస్తువులను వారికి విక్రయించుట మొదటి మార్గము. వారివద్ద మనకు కావలసిన డాలర్లను అప్పు తీసుకొనుట రెండవ మార్గము. దేశంలోని దుకాణాలలో మనం రోజూ వస్తుసామగ్రిని కొనునప్పుడు మనం చేస్తున్న పని ఇదే. మనం తయారుచేసే పదార్థాలను అమ్మి, రూపాయలు సంపాదించి, ఆ రూపాయలను దుకాణాదారునికి ఇచ్చి మనకు కావలసిన వస్తువులను వానివద్దనుండి కొంటున్నాం. అది వీలు లేనప్పుడు మనం అరువుబేరం చేస్తున్నాం; అనగా అతనివద్ద అప్పుతీసుకొంటున్నామన్నమాట. ఎక్కువవస్తువులను కొనుటకు ఎక్కువ రూపాయలు మనకు కావలసినయెడల మనము ఎక్కువవస్తువులను తయారుచేసి ఎక్కువ రూపాయలకైనా అమ్మవలెను; లేదా, అతనివద్ద ఎక్కువ ఋణమైనా చేయవలెను. ఈ రెండు సాధనాలూ లేనిపక్షంలో దుకాణం ఉండికూడా మనకు లాభంలేదు. అట్టి సందర్భంలో మనం మరిరెండు ఉపాయాలను అనుసరిస్తాం. మన అవసరాలను తగ్గించుకొంటాం. కొన్ని వస్తువులను ఉపయోగించడం మానుకొంటాం. ఇది ఒక ఉపాయం. వీలైతే దుకాణంలో దొరికే వస్తువులను కొన్నిటిని కొనడానికి బదులు మనమే తయారుచేసుకొంటాం. కొనుటకు బట్టలు దొరకనప్పుడూ, బట్టల ఖరీదు అపరిమితముగా పెరిగిపోయినప్పుడూ, కొందరు సొంతంగా నూలువడికి బట్టలు నేయించుకోవడం, దుకాణాలలో కూరగాయలు సులభంగా దొరకనప్పుడు ఇంటి ఆవరణంలో కూరగాయల పాదులు పెట్టుకోవడం మనం చూస్తున్నాం.

## అమెరికాతో బేరం

ప్రపంచంలో ఇతరదేశాలవారు ప్రస్తుతం అమెరికాతో చేయుచుండు బేరంయొక్క లక్షణాలన్నీ ఇట్టివి. అమెరికాలోని పదార్థాలను కొనుటకు కావలసిన డాలర్లలో కొంతభాగాన్ని ఇతర దేశములలో తయారగు సామానులను అక్కడికి పంపి, సంపాదించుచున్నారు. కాని ఈభాగం చాలా స్వల్పం. రెండవ ప్రపంచయుద్ధంమూలాన ఏర్పడ్డ పరిస్థితులు కారణంగా, ఇతరదేశాలవారు ఎక్కువ సామానులను తయారుచేసి అమెరికాకు పంపుటకు వీలులేదు. గనుక అమెరికావారు అరువు పద్ధతిపైన వారి సరుకులను ఇతరదేశములకు విక్రయించుట అవసరము. డాలర్లు ఇతరదేశాలవారికి లభించుటకు ఇది రెండవ మార్గం. కాని ఈ మార్గాన్ని అన్నిదేశాల విషయంలో అమెరికావారు అనుసరించుటకు ఇష్టపడుట లేదు. షావుకారు ఎవరికంటె వారికి అప్పు ఇచ్చుటకు ఇష్టపడునా? దుకాణాదారుడు ఎవరికంటే వారికి అరువు ఇచ్చుటకు ఇష్టపడడుకదా? అతడు ఇష్టపడ్డా కొందరు అరువుబేరం చేయడానికి వెనుదీయుటకూడా

కర్తు. అతడు స్వలాభాన్నే గమనిస్తూ, కొనువానిపై కఠినమగు షరతులను విధించిన యెడల ఆ దేశులు వానివద్ద అప్పు తీసుకొనుటకు జంకెదరు. ఇదేవిధంగా అమెరికావారు కొన్ని దేశాలవారికి అప్పు ఇచ్చుటకు ఇష్టపడుట లేదు. రషియా దేశానికి, రషియా పలుకుబడిలో ఉండే హంగెరీ బల్గేరియా, రుమేనియా, జెకోస్లొవేకియా, పోలెండు మొదలగు దేశాలవారికి ఋణమిచ్చుటకు వా రంగీకరించరు. సాహుకారీవిధానము, అప్పిచ్చుట పుచ్చుకొనుట, వడ్డీవసూలుచేయుట మొదలగు ఆచారములు అధర్మములు, అన్యాయములు అని వాదించు కమ్యూనిష్టుల అధికారమునకు ఈ దేశములు లోబడియుండుటయే దీనికి కారణము. గనుక ఈ దేశములవారు డాలర్ల కాటకమును అనుభవించవలసినదే. అనగా అమెరికాలో తయారగు వస్తుసామగ్రిని కొనుట మానుకొనవలసినదే. మరికొన్ని దేశములవారు అమెరికావారు విధించు షరతులు కఠినములని వారివద్ద అప్పుపుచ్చుకొనుట ఇష్టపడుట లేదు. ఇంగ్లండుయొక్క ప్రస్తుతపరిస్థితి ఇట్టిదే. రెండు సంవత్సరముల క్రిందట ఇంగ్లీషువారు అనేకకోట్ల డాలర్లను అమెరికావారివద్దనుండి అప్పుతీసుకొనియుండిరి. అప్పుడు కొన్ని షరతులను అమెరికావారు వారిపై విధించిరి. ఆ కారణముచేత ఆ ఋణముద్వారా నాలుగు సంవత్సరముల కాలము తమకు కావలసిన వస్తుసామగ్రిని అమెరికావద్దనుండి కొనుగోలుచేయవచ్చునని తలచిన ఇంగ్లీషువారు రెండుసంవత్సరములు కాకపూర్వమే దానిలో చాలభాగమును ఖర్చుపెట్టవలసివచ్చినది. ఇట్టి షరతులకు లోబడుటకంటె ఋణము చేయకుండుటయే ఉత్తమమని వారిప్పుడు తీర్మానించుకొని, డాలర్లను సంపాదించుటకు మార్గాంతరమును అనుసరించుచున్నారు. సంపాదించిన డాలర్లను అత్యంతావసరములగు పదార్థములను కొనుటకుమాత్రమే వినియోగించుటకును, ఇదివరకు అమెరికానుండి కొనుచున్న వాటిలో అనేకములను తామే ఉత్పత్తిచేయుటకును, స్వానుభవమునకు కావలసిన పదార్థములకంటె విదేశముల కెగుమతి చేయదగువాటిని ఎక్కువగ తయారుచేయుటకును తీర్మానించుకొనిరి. ఆదాయమునకు మించి ఖర్చుచేయుటయు, దాని మూలమున అప్పులపాలగుటయు అనుసరణీయము కాదనుకొనుటయేగాక, ఆదాయమునంతయు ఖర్చుపెట్టక, ఆహారము మొదలైన అత్యావశ్యకములనుకూడ వారిప్పుడు తగ్గించుకొనిరి. పంటలు వృద్ధిచేసుకొనుటకు, బొగ్గు, విద్యుచ్ఛక్తి, ఉక్కు, యంత్రములు మొదలగునవి ఎక్కువగ ఉత్పత్తియగుటకు వారనేకసాధనములను ఉపయోగించుచున్నారు. దేశములోని కార్మికులు అనవసరముగ సమ్మెలు చేయకుండునట్లు ఏర్పాటులు గావించుకొనిరి. కష్టపడి గనులలో పనిచేయువారికి, వ్యవసాయదార్లకు ఆహారాదివిషయములలో ఎక్కువ సదుపాయములను కల్పించిరి. ఉత్పత్తిని ఎక్కువచేసుకొనుటయు, ఖర్చును తగ్గించుకొనుటయు, విదేశములనుండి పదార్థములను తక్కువగ కొనుటయు, విదేశములకు ఎక్కువపదార్థములను ఎగుమతిచేయుటయు వారనుసరించుచుండు మార్గములు. డాలరు కాటకమును ప్రతిఘటించుటకు వారు కనిపెట్టిన ఉపాయములు ప్రశంసనీయములు. ఇతరదేశములందుకూడ ఇట్టి పద్ధతుల ననుసరించుటకు ప్రభుత్వమువారు సిద్ధపడియున్నారు.

## జర్మనీ

ప్రపంచములోని ఇతరదేశములలో ఉత్పత్తియగు వస్తుసామగ్రి తగ్గిపోవుటచేతనే అందరూ అమెరికాపై ఆధారపడవలసివచ్చినదియు, డాలర్ల కాటకమునకు అదియే కారణమనియు, దానినుండి తప్పించుకొనుటకు ఇతరదేశములలో ఎక్కువ వస్తుసామగ్రిని ఉత్పత్తిచేయుటయే ఉత్తమసాధనమనియు అన్నిదేశములవారును గ్రహించిరి. ఈకారణముచేత, జర్మనీలో తయారగు పదార్థములను వృద్ధిచేయుటకు ఇంగ్లీషువారు, అమెరికావారు క్రొత్తపథకములను ఇప్పుడు తయారుచేయుచున్నారు. ప్రపంచయుద్ధములకు జర్మనులే కారణభూతులనియు, వారి దేశములో ఫ్యాక్టరీలు ఉండకూడదనియు గత రెండు సంవత్సరములనుండి వీరనుకొనుచుండిరి. ఇప్పుడు వీరీ అభిప్రాయమును మార్చుకొని, జర్మనీలో ఉత్పత్తియగు బొగ్గు ఉక్కు మొదలగువాటిని అనేకరెట్లు ఎక్కువచేయుటకు తీర్మానించుకొనిరి. పారిశ్రామికముగ జర్మనీదేశమును వెనుకబెట్టుటవలన నష్టపడువారు ఆదేశస్థులుమాత్రమేగాక, ప్రపంచములోనివారందరు ననుసత్యమును వారిప్పుడు గ్రహించిరి.

## జపాను

జపానువిషయముకూడ ఇట్టిమార్పు రాగలదని ఆస్ట్రేలియాలో కొన్నిరోజులనుండి జరుగుచున్న కామన్‌వెల్తు ప్రతినిధుల సమావేశములోని చర్చలు సూచించుచున్నవి. ఈ చర్చలలో మన ప్రతినిధులుకూడ పాల్గొనియున్నారు. జపానును సంపూర్ణముగ నిరాయుధముగను, సైన్యవిహీనముగను చేయవలెనను

కార్మికుల ప్రతినిధులందరు అంగీకరించిరిగాని, అందులోని పరిశ్రమలు పునరుద్ధారణచేయుటయే వారి సంకల్పముగ కనుపించుచున్నది. జపానులో పదికోట్లజనమున్నారు. పరిశ్రమ లనేకములలో వారు ఆరితేరినవారు. చౌకగ వారు తయారుచేసిన వస్తుసామగ్రిని యుద్ధమునకు పూర్వము ప్రపంచములోని ఇతరదేశముల వారు ఎక్కువగా కొనుచుండిరి. ఈ పరిశ్రమలన్నిటికి విఘాతము కలిగిన కారణమువలనే ఇండియా, బర్మా మొదలగు దేశములలో వస్తు సామగ్రి ప్రస్తుతము దొరకకున్నది. ఇట్టి కాటకము తగ్గుటకు జపాను పరిశ్రమల పునరుద్ధారణమే తగిన మార్గము. ఆ పరిశ్రమలద్వారా వారు యుద్ధపరికరములను తయారుచేయకుండ ఐక్యసమితివారు తగువిచారణ చేయుట యుక్తమేగాని, ఆదేశములో పరిశ్రమలే ఉండకూడదని చెప్పుట ప్రపంచ దారిద్ర్యమునకు హేతు వగును.

## యుద్ధములు దారిద్ర్యహేతువులు

ప్రపంచములోని ప్రస్తుత సంక్షోభమునకు ఆర్థిక సమస్యలేగాక రాజకీయ సమస్యలుగూడ కారణములుగ నున్నవి. అనేక దేశములలో యుద్ధములింకను జరుగుచునేయున్నవి. వాటిలోని ప్రజలు సుఖజీవితమునకు కావలసిన ఆహారపదార్థాదులను ఉత్పత్తిచేయుటకు బదులు యుద్ధపరికరములను తయారు చేయుచున్నారు. వారిలో అనేకులు సైన్యములలో చేరి ఒకరినొకరు చంపుకొనుటయందు కాలము గడుపుచున్నారేగాని వస్తుసామగ్రిని ఎక్కువగ నుత్పత్తి చేయుటకై పాటుబడుటలేదు. యుద్ధములు జరుగని ఇతరదేశములలో కూడ యుద్ధపరికరములు తయారు చేయుటయందును, సైన్యములందును కాలముగడుపువారెందరో ఉన్నారు. ప్రజల దారిద్ర్యమునకిది ఒక ప్రబలకారణము. ఇంగ్లండులోని ప్రస్తుతపు ఆర్థిక దుస్థితికి జర్మనీ, పాలెస్టయిన్, ఈజిప్టు, బర్మా, సింగపూరు మొదలగు ప్రదేశములలో వారు ఉంచుకొన్న సైన్యములే కారణమనియు, ఇందుకై కోట్లకొలది ద్రవ్యము అనవసరముగ ఖర్చగుచున్నదనియు, ఈ సైనికులు ఇంగ్లండుకు వచ్చి వ్యవసాయములోను, గనులలోను పనిచేసినయెడల ఈ ఖర్చు తగ్గుటయేగాక ఆహారపదార్థములయొక్కయు, బొగ్గు మొదలగువాటి యొక్కయు ఉత్పత్తి అధికమై ప్రజల అవసరములు చక్కగ తీరగలవనియు అనేకులు సూచించియున్నారు. డాలర్ల కాటకమును ప్రతిఘటించుటకిది యొక ఉపాయమని ఇంగ్లీషు ప్రభుత్వమువా రిప్పుడు గ్రహించి, కొన్ని దేశములలో వారిదివరకు పెట్టుకొనియుండిన సైన్యములను ఉపసంహరించుకొనుచున్నారు. మొత్తము మీద ప్రపంచములోని దారిద్ర్యమునకు చాలవరకు యుద్ధములు, యుద్ధసన్నాహములు కారణము లన్న మాటను మనము జ్ఞాపకముంచుకొనవలెను.

ప్రస్తుతము గ్రీసు, ఇండోచైనా, ఇండోనీషియా, చైనాదేశములలో ఇట్టి యుద్ధములు జరుగుచున్నవి. వీటిలో ఇండోచైనా, ఇండోనీషియాలలో జరుగు యుద్ధములకు పాశ్చాత్యుల సామ్రాజ్యకాంక్షయే కారణము. ఆ దేశములలోని ప్రజలు స్వాతంత్ర్యమునకై యుద్ధము చేయుచున్నారు. ఇట్టి యుద్ధములు జరుగకుండుటకును, ప్రపంచములో శాంతి స్థాపించుటకును ఐక్యరాజ్య సమితియు, భద్రతాసంఘమును ఏర్పాటు గావింపబడినవి. ఇండోనీషియా యుద్ధమును ఆపివేయుటకు భద్రతాసంఘము తగిన చర్యను తీసుకొనవలె నని మన ప్రభుత్వమువారును, ఆస్ట్రేలియా ప్రభుత్వమువారును గతమాసములో సూచించిరి. భద్రతాసంఘము ఇందునిమిత్తమై కొన్ని తీర్మానములు గావించెను. కాని వీటిని లక్ష్యపెట్టక డచ్చివారు యుద్ధమును సాగించుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయమగు విషయము. దీనిమూలమున నానాదేశములవారికి ఐక్యసమితిలో గల గౌరవము, ఉత్సాహము తగ్గిపోవు నను మాటను అగ్రరాజ్యములవారు గ్రహించుట లేదు.

## దక్షిణ ఆఫ్రికా

ఐక్యరాజ్యసమితియందు గౌరవము చూపని దేశములలో దక్షిణఆఫ్రికా ఒకటి. అచటనుండు భారతీయులను అక్కడి ప్రభుత్వమువారు అనేక చిక్కుల పాలు గావించుచున్నారని మన ప్రభుత్వమువారు గతసంవత్సర సమితి సమావేశములో ఫిర్యాదు చేయగా, అట్టి చిక్కులను తొలగించుటకు దక్షిణఆఫ్రికా ప్రభుత్వమువారు మన ప్రభుత్వముతో సంప్రతించి తగిన చర్యను తీసుకొనవలసిన దని సమితి సభవారు తీర్మానించిరి. కాని ఈ విషయమై జనరల్ స్మట్సు (దక్షిణఆఫ్రికా ప్రధానమంత్రి)గారు, పండిట్ నెహ్రూగారికి జరిగిన ఉత్తరప్రత్యుత్తరములలో ఇట్టి చర్యను తీసుకొనుటకు దక్షిణాఫ్రికావారు సమ్మతించనట్లు స్పష్టమగుచున్నది. ఇంతేగాక, ఇటీవల వారు అచ్చటి భారతీయులపై మరికొన్ని నిర్బంధములను కూడ విధించిరి. సమితిమహాసభ కొద్దిరోజులలో న్యూ

యొక్క పట్టణమున సమావేశము కానున్నది మన ప్రతినిధులు అప్పటికి వెళ్లుచున్నారు. ఈవిషయమై జనరల్ సభ్యులు ఏమి సమాధానము చెప్పగలరో చూడవలెను.

## భరతఖండము : స్వాతంత్ర్యము

ఆగస్టు నెలలో దేశమందంతటను స్వాతంత్ర్య మహోత్సవములు జరిగెను. వీటియందు అన్ని జాతులవారు, మతములవారు, ధనికులు, దరిద్రులు, అన్ని రాజకీయపక్షములవారును అనల్పమగు ఉత్సాహముతో పాల్గొనిరి. ప్రతి ఉత్సవమందును మన జాతీయపతాకమును ప్రతిష్ఠించిరి. ఆ పతాకముయొక్క ప్రాధాన్యమును గుఱించియు, అందులోని అంతరార్థమునుగురించియు అందులోని అంతరార్థమునుగురించియు నాయకులు నాయకురాండ్రు ఉపన్యసించిరి. దసరా, దీపావళి మొదలైన పండుగలను ఎంతటి వైభవముతో మనము చేసుకొనుచుందుమో అంతకంటె ఎన్నిరెట్లో అధికమైన వైభవముతో ఈ ఉత్సవము దేశమందంతట జరిగెను. భరతఖండము ఎంతకాల ముండునో అంతకాలము ఏటేట ఆగస్టు ౧౫ తేదీన ఇనుమడించిన వైభవముతో స్వాతంత్ర్యమహోత్సవమును ప్రజలెల్లరు జరుపగలరని చెప్పదగియున్నది. పరాయిప్రభుత్వము తొలగుటయు, స్వరాజ్యము లభించుటయు—ఇంతకంటె సంతోషింపదగిన ఉత్సవము దేశమందేదికలదు !

## విషాదము

కాని, ఎవరుకూడ ఈ ఉత్సవమును విచారముతోనే చేయవలెనని చెప్పవలసియున్నది. అనాదిగ చక్రవర్తిక్షేత్రమని ప్రఖ్యాతిగాంచిన భరతఖండ మీనాడు రెండు రాజ్యములుగ చీలిపోవుటకంటె విషాదకరమగు సంఘటన మరేది కలదు ! లీగుపక్షమునకు చెందిన మహమ్మదీయుల దౌర్జన్యము వలనను, బ్రిటిష్ వారి కపటము వలనను, కాంగ్రెసుయొక్కయు, కాంగ్రెసును అనుసరించిన జాతీయవాదులయు దౌర్బల్యములవలనను, హిందూమహాసభ మొదలైన రాజకీయ పక్షములవారి నిర్మాణకార్యచింత లేకపోవుటచేతను దేశవిభజన జరిగినది. కాని ఇంతటితో దేశమందు శాంతిభద్రతలు స్థాపితమైయుండినయెడల, మన విషాదము, విచారము కొంత తగ్గియుండెడివి. కాని అట్లు జరుగుటకు బదులు ఈ విభజనమూలమున దేశములో—ముఖ్యముగ పంజాబునందు—అశాంతి ప్రబలి, ఇంతవరకు మనము కననట్టియు, విననట్టియు బీభత్సము జరిగెను. ఇంకను ఆ బీభత్సము జరుగుచునే యున్నది.

పాకిస్థాన్ రాజ్యములో చేరిన పశ్చిమపంజాబులోని హిందువులు, శిక్కులు అనుభవించుచుండు నరకబాధలు వర్ణనాతీతములు. ఏపాపము ఎఱుగని శిశువులు, స్త్రీలు పురుషులు ఇట్టి ఘోరమునకు ఎదురు గురి అయిరో ! ఈ చిత్రవధలకు పాల్పడవలసివచ్చినవారు ఒకరూ ఇద్దరూ కాదు లక్షలకొలది జనము ఈవిధముగ ప్రాణములు కోల్పోయిరి. మానభంగము పొందిన స్త్రీల సంఖ్యకు మితిలేదుగదా ! కోట్లకొలది విలువగల ఆస్తులను హిందువులు, శిక్కులు కోల్పోయిరి. దేశవిభజన జరిగినతోడనే హిందూమహమ్మదీయ సమస్య పరిష్కారము కాగలదనియు, అటుమొదలు హిందువులు మహమ్మదీయులు సోదరభావముతో మెలగుచుందురనియు లీగునాయకులు చెప్పుచుండిన మాటలన్నియు కల్లలయ్యెను. ఎప్పటినుండియో దాగియున్న వైమనస్యము, మతదురభిమానము ఒక పెట్టున ప్రజ్వలించి సమస్తభోగభాగ్యములతోడను, ఐశ్వర్యముతోడను కళకళలాడుచున్న గ్రామములను, పట్టణములను, నగరములను, భవనములను భస్మీపటలము గావించినది. ఇంకను ఈ అశాంతి పూర్తికాలేదు. రాక్షసులు మారణహోమమును చేయుచునే ఉన్నారు. చరిత్రలో రాక్షసకృత్యములకు పేరుగాంచిన హూణులు, మంగోలులు, తార్తారులు వీరియెదుట ఎందుకూ పనికిరానివారగుచున్నారు.

## విముక్తి

కాని ఇట్టి ఘోరపరిస్థితులనుండి విముక్తిపొందుట ఏలాగు ? అనువిషయమునుగురించి మన ప్రభుత్వమువారు ప్రస్తుతము ఆలోచించవలసియున్నది. ఆకాశవిమానములను, బస్సులను, లారీలను పశ్చిమపంజాబునకు పంపి వెంటవెంటనే అక్కడనుండి హిందువులను, శిక్కులను తూర్పుపంజాబులోనికి తెచ్చుటతప్ప మార్గాంతరము కనిపించదు. మహమ్మదీయులే కాని, మహమ్మదీయేతరులెవ్వరూ పాకిస్థానులో పౌరులుగ ఉండుటకర్హులు కారని లీగువారి సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ననుసరించి ఈ ఘోరములన్నియు జరుగుచున్నవి. పాకిస్థానములోని మహమ్మదీయేతరులను ఇండియాలోనికిని, ఇండియాలోని మహమ్మదీయులను పాకిస్థానములోనికిని మార్పుటయే తన ఉద్దేశమని సంవత్సరము క్రిందట జిన్నా గారు చెప్పియుండిరి. ఇదంతయు సాధ్యముకాని పని అనియు

ఇట్టి మాటలు చెప్పువాడు కాజాలడనియు మన నాయకులు జిన్నా గారిని పరిహసించుచుండిరి. కాని ఇప్పుడు జరుగుచుండు దురంతములమూలమున మన ప్రభుత్వములోని నాయకులకూడ— నెహ్రూ, పటేల్, మొదలగు వారు కూడ—ఇట్టి పరివర్తన అవసరమని గ్రహించినట్లు తెలియుచున్నది. జిన్నాయొక్క జీవితచారిత్రము ఒక విషయమును స్పష్టము చేయుచున్నది. అతడు పట్టిన పట్టును విడచువాడు కాడు. ఏవిధముగానైనా దానిని సాధించేవాడు. పాకిస్థానము సాధించగలిగెను. ఇప్పుడు జరుగుచుండు దురంతముల మూలమున పాకిస్థానములోని మహమ్మదీయేతరుల నందరిని హిందూస్థానమునకు తరిమివేయగలవాడగుచున్నాడు. అందువలన పాకిస్థానమునకు రెండువిధముల లాభములు చేకూరగలవు. అల్ప సంఖ్యాకుల సమస్య అదృశ్యమగుట మొదటి లాభము. వర్తకవ్యాపారములమూలమునను, స్వకష్టార్జితము మూలమునను హిందువులు, సిక్కులు సంపాదించిన ఆస్తులు పాకిస్థానములోని మహమ్మదీయుల పరమగుట రెండవ లాభము. అన్నిటకంటెను ధనికులలో చాలభాగము హిందువులు, సిక్కులు అన్న మాటను మనము మరవగూడదు. ఈ దురంతములకు ఇదియే ప్రధాన హేతువు. శత్రువుల దృష్టిలో హిందూ సిక్కుల స్త్రీలుకూడ ఆస్తిగ పరిగణింపబడుచున్నారు.

స్వాతంత్ర్యము లభించుట మూలమున క్రొత్త సమస్యలు, బాధ్యతలు ఏర్పడినవని చెప్పుటలో గల సత్యమిదియే. మహమ్మదీయేతరులగు అల్ప సంఖ్యాకులను రక్షించుటకు పాకిస్థాన్ ప్రభుత్వము సిద్ధపడనప్పుడు ఇండియా ప్రభుత్వము వారు ఇండియాలోని అల్ప సంఖ్యాకులగు మహమ్మదీయుల విషయములో ఏవిధముగ ప్రవర్తించవలెనననదియే ఈ సమస్యలలో గడ్డు సమస్య.

## కేంద్ర ప్రభుత్వము

స్వాతంత్ర్యము సిద్ధించిన తర్వాత ఏర్పడ్డ కేంద్ర ప్రభుత్వములో ఆగస్టు ౧౫ తేదీకి పూర్వము తాత్కాలిక ప్రభుత్వమందు (Interim Government) ఉండిన కాంగ్రెసు పక్షము వారును, తదనుకూలులును గాక మరికొందరు ప్రముఖులు చేర్చుకొనబడిరి. అదివరకు ప్రభుత్వమందుండిన శ్రీరాజగోపాలాచారిగారిని మాత్రము పశ్చిమ బంగాళమునకు గవర్నరుగ పంపివేయుట జరిగెను. ఈమార్పునకు కారణమేమియో దురూహ్యము. గొప్ప తెలివి తేటలు గలవాడనియు, రాజనీతి ప్రయోగించుటయందు మిక్కిలి చతురుడనియు ప్రఖ్యాతి గాంచిన శ్రీ రాజగోపాలాచారిని ఎట్టి అధికారమూ లేని గవర్నరుపదవిని అనుభవించునట్లు చేయుటలో రహస్యమేమిటో తెలియకున్నది. క్రొత్త ప్రభుత్వములో చేరినవారిలో షణ్ముఖం శెట్టిగారును, అంబేడ్కరు గారును పేర్కొనదగినవారు. వీరు కాంగ్రెసు పక్షమునకు చెందినవారు కాకపోయినను, కొంత కాలము విరోధులుగనుండినను కాంగ్రెసు నాయకుడగు నెహ్రూ నాయకత్వమున ఏర్పడిన మంత్రివర్గములో వీరు చేరుట కొంత గమనింపదగిన విషయము. వీరిలో షణ్ముఖం శెట్టిగారి అధీనములో ఫైనాన్సు-ఆదాయ వ్యయ - శాఖను ఉంచుటకూడ గమనింపదగ్గదే. ఆ శాఖను చక్కగ నిర్వహించ దగ్గవాడు డాక్టరు మత్తాయి అయినను దానిని వారి అధీనములో ఉంచకపోవుట కొందరికి అతృప్తి కలిగించినది. ప్రస్తుతపు కాంగ్రెసు నాయకులు సాహుకారీవిధానమునకు తలయొగ్గినవారనియు, కోటీశ్వరుల లాభము నపేక్షించి ఈ ప్రభుత్వమును జరుప నిశ్చయించుకొన్నవారనియు, సామాన్యజనుల సౌఖ్యమున కనుకూలించు సోషలిజం పద్ధతిని వారు ప్రవేశపెట్టజాలరనియు అనుకొనువారికి ఈ మార్పు ఒక ప్రధాన హేతువుగ నున్నది.

## సంస్థానములు

ఆగస్టుమాసములో జరిగిన సంప్రతింపుల ఫలితముగ భోపాలు ఇండోరుసంస్థానములుకూడ తక్కిన సంస్థానములతోపాటు ఇండియారాజ్యములో తాత్కాలికముగ చేరుటకు అంగీకరించినవి. అట్లు చేరని సంస్థానములలో ప్రధానములైనవి హైదరాబాదు, కాశ్మీరము. హైదరాబాదులో పరిపాలకుడు మహమ్మదీయుడు; ప్రజలలో బహుసంఖ్యాకులు హిందువులు. కాశ్మీరములో పరిపాలకుడు హిందువు; ప్రజలలో బహుసంఖ్యాకులు మహమ్మదీయులు. పరిపాలకులకును, ప్రజలకును ఇట్టి భేద ముండుటచేత ఈ సంస్థానములు ఇండియాలోనూ, పాకిస్థానములోనూ చేరక స్వాతంత్ర్యమును ప్రకటించియున్నవి. కాని భూగోళరీత్యా హైదరాబాదు ఇండియాలో చేరుట తప్పదు. మధ్యకాలమున ఎన్ని బేరములు జరిగినను తుదకు ఇండియాలో చేరుటయే హైదరాబాదుకు క్షేమము. ఈ పని వెంటనే జరిగినయెడల హైదరాబాదు ప్రభు

పునకు [illegible] మర్యాదగ ఉండెడిది. ఇది జరగని కారణమున సంస్థానములోని ప్రజలకును, ప్రభువునకును వివాదము సంభవించి, ప్రజాపక్షమును వహించిన స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహోద్యమమును లేవదీయవలసివచ్చెను. పంజాబులో జరుగుచుండునట్లు హైదరాబాదు సంస్థానములోకూడ హిందూమహమ్మదీయ కలహములు సంభవించి, లక్షలకొలది హిందూ వర్తకులు, సామాన్యజనులు సంస్థానమును వదలి ఇరుగు పొరుగు రాష్ట్రములలోనికి పారిపోవలసివచ్చెను. ఈ కలహము దినదినమునకు తీవ్రతర మగుచున్నది. శాసన సభకు గల అధికారములను హెచ్చుచేయునట్లును, ప్రజాపక్షమునకు చెందినవారిద్దరిని తన మంత్రివర్గములో చేర్చుకొనునట్లును నైజాం ప్రకటించెను. కాని ప్రజలు కోరినదానికిని, ఈ సంస్కరణములకును హస్తిమశకాంతరమున్నది. శాసనసభకు ఎక్కువ అధికారములనిన, మహమ్మదీయులకు ఎక్కువ అధికారములన్నమాటయే. అధికారములో అధికసంఖ్యాకులతో సమానమైన స్థానము అల్పసంఖ్యాకుల కిచ్చుటయే శాసనసభలోని గొప్పలోపము. కనుక ఇట్టి స్వల్పమైన మార్పుగాక, యథార్థమైన బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించి ప్రజానాయకులకు అధికారమును ఒప్పగించినగాని సత్యాగ్రహోద్యమము విరమించబడదు. ప్రతిసంస్థానమందును ప్రజలు కోరుచుండు మార్పు ఇదియే. మైసూరు, సంస్థానములోకూడ ప్రజాప్రభుత్వమునకై కాంగ్రెసువారు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించియున్నారు. ప్రస్తుతము సంస్థానములలో జరుగవలసిన మార్పు ఇదియే. ఇది ఇండియాలో చేరుటయా, మానుటయా అన్నది అంత ప్రధానవిషయము కాదు. ఈ సత్యాగ్రహోద్యమములు సఫలములై, బాధ్యతాయుత ప్రభుత్వములు స్థాపితములైనయెడల సంస్థానములన్నియు వెంటనే ఇండియాలో చేరగలవు. కనుక ఇండియా ప్రభుత్వమువారి దృష్టి అంతయు ఇట్టి మార్పుపై ప్రసరించవలసియున్నది.

## రాజ్యాంగ పరిషత్తు

ఆగష్టులో సమావేశమైన రాజ్యాంగపరిషత్తు రాజ్యాంగవిధానమునకు సంబంధించిన విషయములలో రెండు ప్రధానములైనవాటిని పరిష్కరించెను. కేంద్ర ప్రభుత్వమునకు ఎట్టి అధికారము లుండవలెను, రాష్ట్ర ప్రభుత్వమునకు ఎట్టివి ఉండవలెను అనునది మొదటి విషయము. ఇండియాలోని అల్ప సంఖ్యాకులకు ఎట్టి హక్కులు ప్రత్యేకముగ నుండవలెననుట రెండవ విషయము. కేంద్రప్రభుత్వము బలిష్ఠముగ నుండవలెనని చెప్పినవారి వాదము మొత్తముమీద గెలువగలిగెను. దేశరక్షణ, విదేశవ్యవహారములు, రాకపోకలు మాత్రమేగాక, అనేకములైన ఇతరవిషయములుకూడ కేంద్రప్రభుత్వముక్రిందనే ఉండగలవు. రాష్ట్రముల అధికారములు సంకుచితములు చేయబడినవి. ఈ మార్పులు జరుగుటలో చాలవరకు రాజ్యాంగపరిషత్తు ౧౯౩౫ సంవత్సరపు ఇండియాప్రభుత్వచట్టమును అనుసరించినది. అల్పసంఖ్యాకుల విషయములో మాత్రము పరిషత్తు బ్రిటిషు పాలనలోని విధానమును పూర్తిగ మార్పు చేసెను. ప్రత్యేక నియోజకవర్గములను రద్దుచేసి సంయుక్త నియోజకవర్గములను ఏర్పరచెను. హిందూఓటర్ల వోట్లు లేక మహమ్మదీయుడుగాని, మహమ్మదీయఓటర్ల వోట్లు లేక హిందువుగాని ఏశాసనసభకు ఇకమీదట సభ్యుడు కాజాలడు. అన్ని మతములవారు పరస్పర సహాయముతో రాజకీయములందు ప్రవర్తించుట తప్పదు. ఇదిగాక అల్పసంఖ్యాకు లిదివరకు అనుభవించుచున్న అత్యధిక ప్రాతినిధ్యము రద్దుచేయబడెను. వారి జనసంఖ్యనుబట్టి శాసనసభలలో వారికి గల స్థానములు నిర్ణయమగును. ఈ విషయము చర్చలోకి వచ్చినప్పుడు పటేలుగారు చేసిన ఉపన్యాసము, మహమ్మదీయులకు అతడు చేసిన హితబోధ మరువతగినది కాదు. ప్రత్యేకహక్కులకై పోరాడు మహమ్మదీయులకు ఇండియాలో స్థానము లేదనియు, అట్టివారు పాకిస్థానమునకు వలసపోవుటయే ఉత్తమమార్గమనియు అతడు నిర్మొగమాటముగ చెప్పెను. దేశమందు ఇట్టి తెగువగల నాయకు లుండుట అత్యావశ్యకము.

## మదరాసు రాష్ట్రము

ఆగష్టుమాసమున మద్రాసురాష్ట్రములో ఆహార సమస్య ఎక్కువ ప్రాధాన్యమును వహించెను. ప్రస్తుతము ప్రభుత్వమువారి ఆధీనమునందుండు ఆహారపదార్థములు చాలవనియు, వెంటనే రైతులు, భూస్వాములు వారికడ్డనుండు ధాన్యములను విడుదలచేసి ప్రభుత్వమువారికి ఒప్పగించినగాని ఘోరమైన క్షామపరిస్థితులు తప్పవనియు ఆహారమంత్రియగు రాజన్ గారును, ప్రధా

# కనపడని గాయం

[ కథానిక ]



— శ్రీ ఈరంకి వెంకటరావు —

మూర్తికి ఎవర్నూ అనుకోకుండా, నలుగురూ రకుండానే పెళ్ళి అయిపోయింది. అసలు మూర్తే అనుకోలేదు, ఆసంవత్సరంలో, అందులో ఆ నెల్లో పెళ్ళి అవుతుందనిగాని, ఆసంబంధం అవుతుందనిగాని.

“మొత్తానికి ఇన్నాళ్ళూ ఆగి పచ్చలో కాలు వేశాడు” అంది లోకం. “ఏదో బి. ఏ. పాసైన పేటలన్నీ ఏమయిపోయాయి, ఆసంబంధం ఎంచుకోవడంలో” అని ఆగ్రహపడ్డారు అతని సన్నిహితబంధువర్గం. మూర్తి స్నేహితులు అతని పెళ్ళాన్ని చూసి మూతివిరుచుకున్నారు. అతని ఆదర్శాభిప్రాయాలన్నీ అతనే మంటగలిపేశాడన్నారు అతని తలిదండ్రులు. “వాడి ప్రారబ్ధం—అనుభవించాలిసిందే బతికివున్నన్నాళ్ళూ” అన్నారు.

మూర్తిమాత్రం ఇంతమందికి ఇష్టంలేని ఆపిల్లను—ఆకురూపిపిల్లను ఎందుకు చేసుకున్నాడో ఎవరికీ అర్థం గాదు. అసలు మూర్తికే తెలియదేమోగూడా, ఎందుకు ఆపిల్లను పెళ్ళి చేసుకున్నాడో.

మూర్తి పూర్తిపేరు శివరామమూర్తి. అయితే అతన్ని అందరూ మూర్తి అనే పిలవటం వాడుక. పూర్తిపేరు చాలామందికి తెలియదేమోగూడా. మూర్తి మంచి స్ఫురద్రూపి. అతను చురుకైనవాడని చెప్పలేంగాని, విద్యావిషయంలో మాత్రం ఎక్కడా లోట్లు కొట్టకుండా వచ్చి, తనూ ఒక బి. ఏ. అనిపించుకున్నాడు. మూర్తికి ఏమీ లోటురాకుండా అతని దత్తత తండ్రి చాలా జాగ్రత్తగా చూశాడు. కన్నతండ్రి దగ్గరే వుంటే అతని కీపాటి చదువు రాకనూ పోను, ఆయన చెప్పించాలేడు. మొత్తానికి మూర్తికి ఇరవై రెండేళ్ళు వచ్చేదాకా అతని అదృష్టాని కేమీ లోటులేకపోయింది. అతను ఆడిందల్లా ఆటగానూ, పాడిందల్లా పాటగానూ సాగింది.

మూర్తికి జరుగకూడని లోటంతా అతని పెళ్ళి విషయంలోనే జరిగింది. అతను యీ సంబంధం చేసుకునేముందు అనేకమంది పెళ్ళికూతుళ్ళను చూశాడు. కొంతమంది అతనికి బాగా నచ్చినా, కొన్ని విషయాలు కుదరక అతను ఎవ్వరికీ మాట ఇవ్వలేకపోయాడు. కొన్ని లోటుపాట్లు ఇతను సర్దుకున్నా వాళ్ళ నాన్న ఒప్పుకోక మరికొన్ని సంబంధాలు తేలిపోయాయి. చివరకు మూర్తి తనకు పెళ్ళి కాదేమో నని భయపడి చేసుకున్నట్లుగా యీ అష్టవంకర సంబంధాన్నే ఎంచుకున్నాడు.

మూర్తికి ఆదర్శాలు లేకపోలేదు. అతను తనకు కాబోయే భార్య ఇలాగ వుండాలి, అలాగ ఉండాలి అని మనోవీథిలో చిత్రించుకోకపోలేదు. ఆమెకోసం అతను విరహవేదన ననుభవించకపోలేదు. చివరకు తనకు కాబోయే భార్య ఫలానా ఫలానా రీతిగా వుండాలని అతను స్నేహితులతోగూడా అప్పుడప్పుడు చెప్పుకొనే వాడు. ఏమయితేనేం, అతని ఆశలన్నీ చివరకు వృథా అయినాయి.

అతనికి యీ పెళ్ళివిషయంలో సహాయపడుతున్నట్లుగా నటించి గోతిలో దింపిన సంధాయకుడు

లేకపోలేదు. అతను మూర్తికి ఒక వేలువిడిచిన మేనమామకొడుకు. పేరు సుబ్బారావు. అసలు రెండేళ్ళ క్రిందట సుబ్బారావుచెల్లెలును మూర్తికి ఇస్తామన్నారు. కాని మూర్తి తన చదువు పూర్తయితే గాని పెళ్ళివిషయం తలపెట్టనన్నాడు. కాని, సుబ్బారావు యీ మాటనే మరోవిధంగా అర్థంచేసుకున్నాడు. "మీ అమ్మాయి నాకు నచ్చలేదు" అని చెప్పడానికి ఇది డొంకతిరుగుడనుకున్నాడు. సుబ్బారావుచెల్లెలిని శానిటరీ ఇనస్పెక్టరు ఉద్యోగంలోవున్న ఒక ఉబ్బసపుమనిషికిచ్చి పెళ్ళిచేశారు.

సుబ్బారావుచెల్లెలికి పెళ్ళయిపోయిందిగాని, సుబ్బారావుకుమాత్రం మూర్తి తన బావగారు కాలేదే అనే వ్యథ పోలేదు. మూర్తికి ఎలాగైనా ఒక కోతిని తీసుకొచ్చి అంటగట్టాలని అతను ప్రతింపట్టాడు. మూర్తి మీద పగతీర్చుకోవాలనే పట్టుదల తీవ్రంగా వుందతనికి. అయితే తను పట్టుదల తగ్గించుకోవాలంటే మూర్తితో స్నేహం చేస్తే ప్రయోజనముంటుందిగాని, వైరంమీద పగ సాధించలేనని సుబ్బారావు తెలుసుకున్నాడు. సుబ్బారావుచెల్లెలి పెళ్ళికి మూర్తివెళ్ళాడు. సుబ్బారావుకు లోపల ఎలాగ వున్నా పైకిమాత్రం మూర్తిని చాలా ఆదరించాడు. ఆవేళనుంచీ మూర్తీ, సుబ్బారావుల స్నేహం చాలా గాఢమయిపోయింది. అదే యీ నాడు మూర్తిజీవితంలో విషపు నవ్వు నవ్వింది.

తను సుబ్బారావుచెల్లెల్ని పెళ్ళిచేసుకోకపోయినా సుబ్బారావు కించిత్తయినా మనసులో బాధపడకుండా తనను పెళ్ళిలో ఆదరించడమే గాకుండా, యిన్నాళ్ళూ యిలా స్నేహం చెయ్యడం తనలో ఏదో మహత్తరగుణం వుండడంవల్లనే గాని, సుబ్బారావు హృదయంలో ఏదో దురభిప్రాయం వుందని మూర్తి యీనాటివరకూ గమనించలేదు. మూర్తీ సుబ్బారావుల స్నేహం మూలాన్ని మూర్తి నిజంగా సుబ్బారావు చేతిలో కీలుబొమ్మ అయినాడు. కాని తనే సుబ్బారావును లోబరుచుకుంటున్నాననీ, అతనిలో ఏదయినా వైరభావముంటే తన చమత్కారం వల్లనే పోగొడుతున్నాననీ మూర్తి లోలోపల గర్వించకపోలేదు.

మూర్తికి ఇంతకుముందు అనేక మంచి సంబంధాలు వచ్చాయి. ఆపిల్లలు మంచి అందమయినవాళ్ళు, బాగా చదువుకున్నవాళ్ళు గొప్ప వంశంలోవారు కోరిన కట్నం ఇస్తామని వచ్చారు. వాళ్ళ నాన్న, అమ్మ ఒప్పుకున్నాగాని, మూర్తి ఆ సంబంధాలన్నిటినీ తోసిపారేశాడంటే అందులో సుబ్బారావు తంత్రాంగం ఏమాత్రమూ లేకపోలేదు. ఎంత మంచి సంబంధం వచ్చినా "మూర్తీ, ఇదేం సంబంధంరా, నీకు దీనిని తలదన్నిన సంబంధాలు వస్తాయి. కొన్నాళ్ళు ఓపికపట్టు" అనేవాడు సుబ్బారావు. మూర్తి ఆ మాటను శిరసావహించేవాడు.

ఒకవేళ మూర్తి సుబ్బారావుమాటకు లొంగక ఏ సంబంధానికైనా చేసుకుతీరుతానని పట్టుపడితే, ప్రధానం చేసుకుందుకు బయలుదేరివచ్చేవాళ్ళుకూడా కారణంలేకుండా ఆగిపోయేవారు. అందులోగూడా సుబ్బారావుదే కనుకట్టు, హస్తలాఘవం.

మూర్తిప్రాణం విసిగింది. తనుగూడా త్వరలో ఒక సంసారి అవాలి. ఈ సారి పిల్ల ఏ మాత్రం బాగున్నా తన ఆదర్శాభిప్రాయాల గోడల్ని ఏమాత్రం రాసుకు పోయే ముఖకవళికలు, అంగసౌష్ఠవం వున్న పిల్ల వచ్చినా పెళ్ళి చేసుకుందామనుకున్నాడు. అతనలా అనుకోవడమేమిటి! అతనలా అనుకునేటట్లు చేశాడు సుబ్బారావు. చివరకు "నాకు ఆదర్శాలే లేవు. నేను నిరాదర్శపురుషుణ్ణి. స్త్రీ అనే వ్యక్తి ఎవరు నాకేసి జాలిగా చూసినా నేను పెళ్ళిచేసుకుందుకు సిద్ధంగా వున్నాను." అనేటట్లుగూడా సుబ్బారావు మూర్తిని మార్చగలడు.

పార్వతి సుబ్బారావుకు బావమరది కూతురు. పద్దెనిమిది ఏళ్ళుంటాయి. ఆ అమ్మాయితండ్రి ఆపిల్లకు పెళ్ళి చేదామని అయిదుసంవత్సరాలుగా దేశమంతా వెదేసి తిరుగుతున్నాడు. పిల్ల బాగుండదని అందరూ పెదిమ విరిచి చక్కా పోతున్నారు. ఎక్కడైనా మంచి సంబంధం చూసిపెట్టమని ఆయన సుబ్బారావును కోరాడు. సుబ్బారావుకు సరైన అదనులో సరియైన సంబంధం దొరికింది, మూర్తికి ముడిపెట్టడానికి.

మూర్తికి పార్వతినిచ్చి పెళ్ళిచేస్తే ఒకవైపున మూర్తి మీద కసితీర్చుకోవచ్చు; మరోవైపున బావమరిదికి గొప్ప సహాయం చేసినవాడవుతాడు. సుబ్బారావు తన మానప్రాణాలు అమ్మకోకయినాసరే యీ పెళ్ళి చేసితీరాలనుకున్నాడు. ఏమైనా, పెళ్ళిళ్ళలో అసలు వాళ్ళకన్న మధ్యవర్తులు ఎక్కువ బాధపడతారు. వీళ్ళ ఆశలు సిద్ధి చేసాకా నిద్రపోరు, అన్నం ముట్టరు. పని దెబ్బలాటలూ, కంద దొమ్మీలూ అయినాసరే వాళ్ళు అనుకున్నది జరిగితీరాలంటారు. సుబ్బారావు యిప్పుడు రెండు వ్యూహాలతో వున్నాడు గాబట్టి అతని కెక్కువ పంతం వుంటుందంటే ఆశ్చర్యం లేదు.

మూర్తి పార్వతిని చూడ్డానికి వెళ్ళినపుడు సుబ్బారావుమాత్రం మూర్తితో కలిసివున్నా, లోపాయకారీగా ఆడపిల్లతరఫు మనిషే. చీకటిపడే వేళ పెళ్ళిచూపులయినాయి. ఏదో మసిపూసి మారేడుకాయ చేశారు. ఫలహారాలతోను, మర్యాదలతోను మూర్తికి ఊపిరాడకుండా చేశారు. పార్వతి ఓరగా కూర్చుని వీణమీద దీనంగా, జాలిగొల్పేటట్లు రెండు పాటలు పాడింది. ఎంత అనాకారైనా పార్వతిలో రెండు మంచిలక్షణాలున్నాయి. ఒకటి—మంచి నిడుపాటి, దట్టమైన, నల్లని జడ. రెండు—చక్కటి, శ్రావ్యమైన గొంతుక. ఈ రెండింటిగురించే సుబ్బారావు ఇదివరకు చాలా పొగిడిచెప్పాడు మూర్తితో. ఇప్పుడు మూర్తి కూడా తన దృష్టిని వాటిమీదే కేంద్రీకరించాడు. ఇక మిగతా విషయాలు ఆలోచించడానికి తావేదీ? మరి మనిషి అసహ్యంగా కనపించిందా, అందంగా కనపించిందా అంటే ఆ ప్రశ్నకు మూర్తికి సమాధానం దొరకడంలేదు. అతను ఆమె అసహ్యంగా వుందనిగాని, అందంగా వుందనిగాని అనే స్థితిలో లేడు. అందంగా వుంది అనడానికి తనకు పరిస్థితులు ఎంత నిరాధారంగా వున్నాయో, అసహ్యంగా వుంది అనడానికికూడా అంత నిరాధారంగానే వున్నాయి. మూర్తి ఆ అవస్థలోనే వున్నాడు. మూర్తెవరు? వుండడానికి, వుండకపోవడానికీను! సుబ్బారావు అతన్నలా వుంచాడు. మూర్తి ఏమన్నా అయిష్టత కనపరిస్తే "ఇల్లు ఇరకటం, ఆలి మర్కటంగా వుంటేనే, జీవితంలో పొదుపూ, హాయీ వుంటా"యని చెప్పడానికి కూడా సుబ్బారావు సిద్ధపడేవున్నాడు.

మూర్తికీ, పార్వతికీ పెళ్ళయిపోయింది. పార్వతి ఎప్పుడూ అనుకోలేదు తాను మూర్తివంటి అందగాణ్ణి పొందుతానని. ఆమె యీ దైవఘటనకు చాలా సంతోషించింది.

నాలుగు వేలరూపాయల కట్నంతో మరి మూర్తి తండ్రి మాట్లాడలేదు. కోడల్ని మాత్రం ఏమంటాడు? ఏమనగలడు? "వాడికివచ్చింది. చేసుకున్నాడు. వాడి ప్రారబ్ధం—అనుభవించాలిసిందే బతికివున్నన్నాళ్ళూ" అన్నాడు.

ఇక మూర్తివిషయం ఆలోచిస్తే అతను భార్యను ద్వేషించటమూ లేదు; ప్రేమించడమూ లేదు. ఒకవేళ యీ రెండిటిలో ఏదైనా చేస్తూవుంటే అది అతనికి తెలియకుండానే చేస్తూవుండివుండాలి. మూర్తి ఆశయాలన్నీ ఎప్పుడో గంగలో కలిసిపోయాయి. అయితే అతని జీవితంలోమాత్రం పెద్ద వెలితి ఏర్పడింది. అది అతను గ్రహించాడు. ఈ వెలితికి కారణం తన దౌర్బల్యమా, లేక సుబ్బారావా? ఈ సంగతి ఇంకా అతనికి తేలలేదు. బహుశా రెండూనేమో.

సుబ్బారావు ఇప్పటికీ మూర్తికి స్నేహితుడే. అయితే సుబ్బారావుతోమాత్రం మూర్తి ఇదివరకటంత ఉత్సాహంగా లేడు. అతని హృదయంలో కనపడని గాయం ఏర్పడింది. ఆ గాయం ఇప్పుడప్పుడే మానదు. మానే సూచనలు ఏవీ లేవు. బహుశా అతని జీవితాంతం వరకూ వుంటుందేమో. పైగా తన పెళ్ళిగురించి ఇంకా విమర్శించేవాళ్ళూ, సానుభూతి చూపేవాళ్ళూ వాళ్ళమాటలు ఆ గాయాన్ని రెచ్చగొడుతున్నాయి. అయితే మూర్తి ఆ బాధంతా కిక్కురుమనకుండా భరించవలసిందే!

---

# కలగూరగంప

## గడ్డిమహిమ

మన దృష్టిలో అతికనీసమైన వస్తువులుగా కనబడే వానిలో గడ్డి యొకటి. అదంటే చాలా మదింపు తక్కువైనదని మన మనోదభిప్రాయం. ఏ గొప్పవస్తువైనా గడ్డి రకతో సమంగా పోల్చినామంటే, సదరు వస్తువును మనం చాలా నీచత్వం ఆపాదించినామన్న మాట. దాని గొప్పదనాన్ని మనం గుర్తించడం లేదన్న అర్థం. "వాడు గడ్డి తింటున్నాడు" అంటే, తిండికి గతి లేక, కష్టాల పాలై పడి, అతినీచమైన జీవనం గడుపుతున్నాడన్న భావం. "బుద్ధి గడ్డితినిందా" అంటే, "ఫలానా సమయంలో నీ మెదడు రెండూ పనిచేయలేదు! నీ తెలివితేటలు కొల్లవారిపోయి వుంది" అన్నంతలో సమానం. "కడుపుకు అన్నం తింటావా! గడ్డి తింటావా!" అంటే, "సిగ్గు, మానం, మర్యాద, ఆత్మగౌరవం లేనివాడవురా" అని కొట్టినంత తీవ్రత.

అయితే నిజంగా—అంటే అక్షరాలా గడ్డి తినకున్నా 'గడ్డితినడం' అన్న ప్రయోగాన్ని పరులపట్ల వాడడం అసత్యం, అక్రమం. గడ్డితినడం దోషంగా భావించి, ఆ పాపం యితరుల కాపాదించడం కానిపని ఏమంటారా!—

పవిత్రగోక్షీరం గడ్డి యొక్క సారమే. ఆవుపాల కన్న అత్యుత్తమమైనదీ, సత్తువనిచ్చేదీ అంత ఆహారము మరేదీ! సాధువగు గోమాత పచ్చికమేసి యీ పవిత్ర క్షీరధారచేత మనలను పోషించుచున్నది. లేతగడ్డి తిని జీవించే లేడిచర్మమే శాంతికాములగు మునులు కూర్చుండి తపస్సుచేయుటకు కృష్ణాజిన మగుచున్నది. ఇంకా, గుఱ్ఱము, గాడిద, మేక మొదలగు గడ్డితినే జంతువులు మన కెంత ఉపయోగకారులో అంత శాంత స్వభావము కలవి. అత్యగత్యసమయాల్లో తప్ప తక్కిన సమయాలలో అవి తమ శాంతగుణమును విడనాడనే విడనాడవు. గాంధీగారి అహింసాసిద్ధాంతాని కవే ప్రత్యక్ష ప్రబలనిదర్శనాలు.

హైందవులగు మనం ఏ శుభకార్యం తలపెట్టినా "శుక్లాంబరధరం" అని వినాయకప్రార్థన చేయకతప్పదు. ఆ వినాయకుని కత్యంతప్రీతికరమైనది గరిక (గడ్డి)యే కదా! వ్రతకల్పంలో వినాయకపూజా క్రమం చూస్తే, 'దూర్వాయుగ్మపూజా'అని ప్రత్యేకంగా వుంటుంది. గణేశచతుర్థినాడు గరికపూజ అత్యావశ్యం చేస్తారు. సృష్టిలోని ప్రతివస్తువుకూ సమానగౌరవం కద్దని చాటడానికి లంబోదరుడు, మహాకాయుడు అయి నప్పటికీ మూషికవాహనుడైనాడు విఘ్నవినాయక మూర్తి. వివిధవర్ణములు కలిగి, సుగంధయుక్తములగు పుష్పరాజముల నెన్నింటినీ కాదని, గడ్డిపూజతో తృప్తిపడి "కొండంత దేవునికి గోరంత పత్రి"అన్న సామెతకు లక్ష్యపురుషుడై, చిన్నా, పెద్దా తారతమ్యము లుండ రాదని ప్రత్యక్షంగా చూపుతున్నాడు. కాని ఆయనను పూజించే మనం అతని తత్వాన్ని గుర్తించక, గడ్డి పోచను తుచ్ఛంగా భావిస్తాము.

మనము పరమపవిత్రముగా భావించి, సమస్త వైదికకార్యములందును వాడే దర్భకూడా గడ్డియేకదా! మనలో అతిసూక్ష్మబుద్ధిగల మహామేధావుల నందరినీ 'కుశాగ్రబుద్ధి'అని వాడి, వారి తెలివితేటలను గడ్డి మొనకొనతో పోలుస్తాము! ఆర్యఋషులు దర్భాసనం మీద కూర్చుండియే తపస్సుచేసెడివారు. శ్రీరాముని కవలపిల్లలలో ఒకడగు కుశుడు దర్భలనుండియే జన్మించి

నాడు. దేవతలను జయించి గరుత్మంతుడు అమృతము తెచ్చి దర్భాసనమున ఉంచినందువల్లనే, ఆ దర్భలను నాకిన పాములకు రెండు నాలుకలైనవి. ఉపనయనం నాటి మౌంజీబంధనమున్నా దర్భతోనే జరుగుతుంది. కాకాసురునిమీద రాములవారు ప్రయోగించిందన్న దర్భబాణమే. ఆ కాకిమీద కటువైన బాణం ప్రయోగించి ఉంటే "పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేసినాడు" అని అయ్యన్న పిచ్చివానిక్రింద కట్టివేసేవారు. అది తెలిసియే శ్రీరాములు పిచ్చుకగదా యని దర్భబాణం వదిలినారు. అదే ఆ కాకిని కడుపుట్టించేటంత తీవ్ర రూపం దాల్చింది. దర్భకు తాకించిన తీర్థం పవిత్రమగు చున్నదని మన అభిప్రాయం. అందుకే వైదిక కార్యాలలో దర్భతో ముంచిన నీటిని ప్రోక్షిస్తాము. వాక్శుద్ధి లేక, ఉచ్చారణలో వంకరగా మాట్లాడేవారిని "నీనోట దర్భ వేసి కాల్చా"లని తిడతాము. ఇంకా యీ దర్భ కట్టమాహాత్మ్యం యెంతైనా చెప్పవచ్చు ప్రస్తుతం కావలసిన విషయం యేదంటే-దర్భ మనం తక్కువగా తలిచే గడ్డి-తెగలోదే అన్న విషయం. ఇంతేకాదు. మహారాజగు నలుడు-పాకశాస్త్రప్రవీణుడగు నలుడు నాలుగు దర్భముక్కలనుమంత్రించివైచి రొట్టెల అవి వంటపూర్తి యగుటకును మండించిరట. గ్రహణంనాడు ప్రతి ఆహార వస్తువులోనూ దర్భముక్క పడవేస్తాము.

గడ్డిజాతిలోనే నిమ్మగడ్డి యని యింకొకజాతి యున్నది. దీని తైలమే మనం మందులలో వాడే Lemon Grass oil. ఉట్కావైద్యచికిత్సలలోనూ, గోసాయి చిట్కలలోనూ గడ్డి గలుస్తుంది. కొంతవరకు కాగితంపరి శ్రమలోనూ గడ్డి ప్రయోజనపడుతున్నది.

పూర్వము మధ్యఆసియానుండి కొందరు పశువులుమేపుకొంటూ, వాని యాహారార్థమై, గడ్డి సమృద్ధిగా పెరిగిన ప్రదేశాలు వెతుక్కొనుచువచ్చి మన దేశంలో విడిసి స్థిరనివాసులై పోయినారు. వారే ఆర్యులు. వారి సంతతివారమే మనం. మధ్యఆసియాలో లేని గడ్డి మన దేశంలో ఆకాలంలో వుండబట్టే మన పూర్వులకు ఆర్యులు వచ్చి దేశమును గొప్పస్థితికి తేగలిగుట. అంతటిదేశాలు అజ్ఞానాంధకారంలో నున్నప్పుడు గొప్పదశలో నుండిన ఆర్యుల ప్రాచీననాగరకతకు గడ్డి పునాది. గడ్డిం వెదుక్కొని వారిచ్చటికి వచ్చినారు. గడ్డితో వారిచ్చట నిలిచిపోయినారు. గడ్డి తినే పశువులు వారి యాస్తి. గడ్డి తినే గోవు వారికి పవిత్ర ప్రాణి. గడ్డిసారమగు గోక్షీరం త్రాగే అందులోని సాత్త్వికభావం వారికి పట్టుబడింది. ఆ గడ్డిసారమే వేదాలన్నీ.



తిరువావడుదురై మఠాధిపతులైన శ్రీ అంబలవాణ పండార సన్నిధివారు స్వాతంత్ర్యోత్సవ సందర్భంలో భారత ప్రధాని పండిత జవహర్‌లాలు నెహ్రూ గారికి ఆశీర్వచనపురస్సరముగా సమర్పించిన బంగారు రాజదండము.

---

ఇదిగాక ఆంధ్రుల చరిత్ర చూస్తే, పలనాటి యుద్ధంకూడా పశువుల గడ్డిగాదాల మూలంగానే ప్రారంభమైనట్లు తెలుస్తుంది. కాబట్టి గడ్డికి చారిత్రక ప్రసిద్ధికూడా కద్దని తేలుతుంది.

మన మంతా ముఖ్యంగా గమనింపవలసిన మరొక్క గొప్పవిషయం యేమంటే-గడ్డియొక్క గొప్పదనం గుర్తింపబడే రోజులు రాబోవుచున్నవన్నదే. గడ్డి మానవులకు మంచి ఆహారయోగ్యమా, కాదా అన్న విషయాన్ని గురించి పడమటి దేశాలలో పరిశోధనలు జరుగుచున్నవన్న వార్తలు విన్నాము. అవి ఫలిస్తే గడ్డికి విల పెరిగిపోయి, వరిపంటకు బదులు గడ్డిపంటనే పండించ

వచ్చు. ప్రతివారూ పత్రిక తినడానికి యెగబడితే దానికిగూడ కేవలం కష్టం రావచ్చు. దేశంలో దుర్భిక్షం ప్రబలి గడ్డికూడా కరువు కలిగితే! విదేశాలనుండి వచ్చే నానాగడ్డీ తినవలసివచ్చును. అప్పుడు "అన్నం తింటావా గడ్డి తింటావా—నానా గడ్డీ తింటాడు—బుద్ధి గడ్డి తినిందా" ఇత్యాదిప్రయోగాలు పనికిరావు.

"పుట్టించిన దేవుడు పూరి మేపకపోతాడా?" అన్న సామెత మనలో ఉండనే ఉన్నది. ఈ యాహార పదార్థాల అభావం యిలాగే వుంటే—యింకలో పై దేశాల పరిశోధనలు ఫలిస్తే, యీ సామెత అక్షరాలా నిజమై తీరుతుంది. పుట్టుకచే నరులైనా, మన చేష్టలలో పశుత్వం ప్రబలిపోతూ వున్నది. పశుబలప్రాధాన్యత మరల తోచింది. పశుబలప్రయోగంలో పైకి రావడానికి ప్రయత్నించే మానవ పశువుల యాహారమును గడ్డినే తినే గతి పట్టించి శిక్షిస్తాడేమో భగవంతుడు. పుట్టించిన భగవంతుడు పూరి అక్షరాలా మేపి తీరుతాడేమో!

ఇంతకూ నేను మనవిచేయునదేమనగా, గడ్డి తక్కువ వస్తువు కాదన్నదే. "అణో రణీయాన్—మహతో మహీయాన్," అని ప్రతిచిన్నవస్తువులోనూ భగవదంశ కద్దు.

చె. (శ్రీ). వెంకటరామయ్య



న్యూఢిల్లీలోని ‘లాల్ ఖిల్లా’







సరిహద్దు నిర్ణయసంఘంవారి తీర్పు ప్రకారం విభక్తమైన పంజాబు బెంగాలు రాష్ట్రాలు.



# విమర్శనము



## Further Sources of Vijayanagara History

రచయితలు : ప్రొఫెసర్ కె. ఏ. నీలకంఠశాస్త్రి, డాక్టరు యన్. వెంకటరమణయ్య గార్లు.

ఈ గ్రంథము మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే ౧౯౪౬ సంవత్సరమునందు ప్రకటింపబడినది. మూడు సంపుటములుగ నున్న దీ గ్రంథము. వెల సంపుట మొక్కంటికి ఏడు రూపాయలు.

౧౯౧౯ వ సంవత్సరములో మద్రాసు విశ్వవిద్యాలయము వారు Sources of Vijayanagara History (విజయనగర చరిత్రకు ఆధారములు) అను నొక గ్రంథమును ప్రకటించిరి. ఆధారము లన్నింటిని సేకరించినవారు స్వర్గీయులైన ఆ. రంగస్వామి సరస్వతి గారు. వాటిని విపులవ్యాఖ్యానములతో, పీఠికతో సంతరించి ప్రకటించినవారు దివంగతులైన డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు. ఆ పుస్తకము యొక్క ఉపయోగమును చరిత్రకారులు చిరకాలము క్రిందటనే గుర్తించియుండిరి. ఆ గ్రంథమునందు కూర్చిన 'ఆధారములు' గాక ఎన్నో ఇతరములు, ముఖ్యములయినవి మిగిలిపోయిన వనియూ, వాటి నన్నింటిని కూడ సేకరించి, ఏర్చి, కూర్చి మరియొక గ్రంథముగా ప్రకటించుట అవసరమనియు అనేక సంవత్సరముల యూనివర్సిటీ చరిత్రపరిశోధన శాఖవారికే గాక ఇతర పరిశోధకులకును తోచెను. కాని ఆ కార్యమును యూనివర్సిటీ వారు తప్ప అన్యులు తలపెట్టుటకు గాని, సాధించుటకు గాని వీలు గాని పని. డాక్టరు వెంకటరమణయ్య గారు విజయనగరచరిత్రయందు అత్యధికమైన అభిమానము గలవారు. వారు మొదటినుండియు విజయనగర చరిత్రయందు విశేషపరిశోధనలను అభిమానముతో జరుపుచు వచ్చిరి. ఆ కారణమున విజయనగర చరిత్రకు సంబంధించిన ఆధారములకొరకు ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట భాషలనేగాక పారసీభాషనుగూడ పఠించి, అందందు గల చరిత్రాంశ విశేషములను బహు పరిశ్రమ చేసి సంపాదించి యుండిరి. స్థానికులగుటచేత పారసీభాషలో వ్రాయబడిన చరిత్ర గ్రంథములలోని అంశముల సత్యాసత్యములను ఎక్కువ నిశితమైన చారిత్రక, విమర్శక బుద్ధితో, నిష్పక్షపాతముగ పరిశీలించి యుండిరి. అట్టి పరిశోధనాసక్తిగల వారికి 'లోకల్ రికార్డులు' అను ప్రాచీన గ్రంథము పరిశీలించు అవకాశము గలిగెను. కర్నలు కాలిన్ మెకంజీ దొర కావలి బొర్రయ్య గారి సహాయమున సంపాదించిన ప్రాచీన శాసనములు, కైఫీయతులు, చారిత్రకములయిన గాథలు మొదలయిన వాటిని (Mackenzie Manuscripts) మెకంజీ దొర సంపాదించిన లిఖితములను చార్లెస్ ఫిలిప్స్ బ్రౌను దొర సంస్కరించి తిరిగి శ్రద్ధతో వ్రాయించి 'లోకల్ రికార్డ్సు' అను పేరుతో రమారమి డెబ్బది సంపుటముల క్రింద సంపాదించియుంచెను. అవి మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో నున్నవి. వాటిని పరిశీలించి, చరిత్రాధారములను నిరుపయోగకరమైన ఒక్కటి పుటలనుండి విడదీసి, ప్రకటించు సంకల్పము మద్రాసు యూనివర్సిటీ వారికి అదృష్టవశమున గలిగెను. బహుభాషాకోవిదులైన డాక్టరు వెంకటరమణయ్య గారికి ఆ లోకల్ రికార్డులను పరిశీలించు భాగ్యము లభించెను. ఏతత్కారణముగ డాక్టరు గారు ముఖ్యముగా విజయనగర చరిత్రకు సంబంధించిన విషయములను శ్రద్ధతో ఏర్చి సంపాదించుటకు అవకాశము కలిగెను. ఆ యవకాశముగలన ఈ మహా గ్రంథమును డాక్టరు వెంకటరమణయ్యగారు సమకూర్చ గలిగినారు. విజయనగర చరిత్రకు వారి కిప్పటివరకు లోకలు రికార్డులను తిరువగా లభించిన ఆధారముల నన్నింటిని Further Sources of

స్థాపితలోకఖ్యాతముగ, విజయనగర చరిత్రము మకుటమై ప్రదర్శించుచున్నది.

ఇంచుమించుగా నొక్క కాలమున స్థాపింపబడిన విజయనగర బహమనీ రాజ్యములలో, విజయనగర రాజ్యము భిన్నముగాకుండగను, భిన్నమైన బహమనీ రాజ్యమును పదునేడవ శతాబ్దమున మరల నించుమించుగా నొకకాలమున అంతరించిపోయెను. విజయనగర రాజ్యము ౧౬౫౦ నాటికి మూడవ శ్రీరంగ రాయల కాలమున సంపూర్ణముగ నశించిపోయెను. బహమనీ రాజ్యము క్షీణించగా ఏర్పడిన నాలుగైదు మహమ్మదీయ రాజ్యములలో మిగిలిన బీజాపురం, గోల్కొండరాజ్యములు, [illegible] మహోన్నతములైనను, ఔరంగజేబుధాటికి ౧౬౮౭ లో కూలిపోయెను. దక్షిణాపథ, దక్షిణ హిందూదేశ చరిత్రలు అయిదారు శతాబ్దములకాలము ఈ హిందూమహమ్మదీయ రాజ్యముల చరిత్రలై యున్నవి. హిందూదేశ చరిత్ర దృష్టిలో పెట్టుకొని డాక్టరు వెంకటరమణయ్యగారు పీఠికలో ఆ ఆరు శతాబ్దములనాటి దేశచరిత్రను కరతలామలకముగ విశదీకరించిరి.

మొత్తముమీద, చరిత్ర పరిశోధకులు, పరిశోధనాతత్పరులకు ఈ "ఆధారములు" ఎంతేని తోడ్పడగలవు. ఈ గ్రంథమునందు మున్నూరు ఆధారములు శకలములుగా మూలగ్రంథ, శాసనములనుండి యెత్తి ప్రకటింపబడినవి. సంస్కృతము, తెలుగు, అరబ్బు, కన్నడము, మళయాళము, ఫారసీభాషలలో మూలగ్రంథములను, లేఖ్యములను చదివి పరిశోధనావిమర్శ చేయలేనివారలకు మూడవ సంపుటమున నివ్వబడిన ఆంగ్లానువాదములు విశేషముగ తోడ్పడగలవు. ఆచార్య నీలకంఠశాస్త్రిగారును, డాక్టరు వెంకటరమణయ్యగారును కడుశ్రద్ధతో, ప్రమాణబుద్ధితో, కొన్నింటిని యథామాతృకముగను, కొన్నింటిని సంగ్రహముగను భాషాంతరీకరించినారు. ఇది మిక్కిలి శ్లాఘనీయమైన కార్యము.

డాక్టరు వెంకటరమణయ్యగారు ఈ గ్రంథమును కృష్ణదేవరాయలకు అంకిత మిచ్చినారు. 'కృష్ణదేవరాయ స్మృతికి' అనుటలో కన్పడు ఔచిత్యము ప్రస్తుతపు అంకితమందు కానరాదు. ఆ చక్రవర్తి కీర్తికాయమున కిచ్చినట్లు భావించుకొనవలయును కాబోలు!

ఈ "ఆధారముల"ను ప్రచురించిన మద్రాసు విశ్వవిద్యాలయమువారు చరిత్ర పరిశోధకులకు చేసిన యుపకారము అనిర్వచనీయము. వారందరి కృతజ్ఞతకును అత్యధికముగ పాత్రులు.

భావరాజు వెంకటకృష్ణరావు.

---

## ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

గ్రంథకర్త: శ్రీ [illegible] రంగాచార్యులుగారు, ఉస్మానియా యూనివర్సిటీ లైబ్రరీ ప్రాచ్యలిఖిత పుస్తకశాఖా సంరక్షకులు. ప్రాప్తిస్థానము: విజ్ఞానవర్ధినీ పరిషత్, హైదరాబాద్. మూల్యము. ౫ రూ.

సాహిత్యవికాసానికి సాహిత్యతత్త్వ విమర్శ ప్రధాన దోహదం. సంస్కృతసాహిత్యం ఉత్తమ శిఖరాలను అందుకో గలిగిందంటే ఎప్పటి కప్పుడు తత్త్వ విమర్శ ఉన్నతస్థాయిలో సాగడంవల్లనే సంభవమైంది. సంస్కృతాన్ని అనుసరించుకోవడంతో ప్రారంభమైన ఆంధ్రసాహిత్యం దురదృష్టవశాత్తూ ఈ విమర్శనాలను విస్తరించి పొందవలసినంత గౌరవం పొందలేకపోయింది.

సాహిత్యతత్త్వ విమర్శను అలంకార శాస్త్రమనడం లోకంలో పరిపాటి. అలంకార శాస్త్రమంటే ఉపమోత్ప్రేక్షాది అర్థాలంకారాలనూ, యమకవృత్త్యను ప్రాసాది శబ్దాలంకారాలనూ నిర్వచించేది మాత్రమే కాదు. రసభావ నిరూపణ చేసి కావ్యలక్షణము తెల్పి ఆదర్శ కావ్యనిర్మాణసామగ్రిని సవిమర్శంగా నిరూపించేది అలంకార శాస్త్రం. ఏతచ్ఛాస్త్రాభివృద్ధికి ఆంధ్ర ప్రతిభ బహుధా వినియుక్తమయింది. ఆంధ్రులు సంస్కృతంలో కావ్యనిర్మాణంతో తనివిచెందక శాస్త్ర విషయకంగాకూడా ప్రశంసనీయమైన కృషి చేశారు. పండితరాయ, విద్యానాథాది ఉద్దండవిమర్శకులనూ, మల్లినాథసూరి వంటి ప్రఖ్యాత వ్యాఖ్యాతలనూ ప్రసా

తించి ఆంధ్రభాషాభిధన్యమైంది. అయినప్పటికీ ఈ నాడు కూడా ఆంధ్రవాఙ్మయం బెంగాలీనో, హిందీనో, ఆంగ్లాన్నో అనుసరించుకోవడంతోనే కాలక్షేపం చేస్తోందంటే ప్రతిభాశూన్యత కాదు కారణం. కావ్యనిర్మాతలకు లోకం ఇచ్చే ఆదరణతోపాటు కావ్యవిమర్శ శాస్త్రపద్ధతులతో సాగుతూ ఉంటేనే కవిప్రతిభ ఉద్దీప్తమవుతూ ఉంటుంది. ఇప్పుడిప్పుడు కావ్యవిమర్శ ప్రారంభిస్తున్నప్పటికీ అది తాడూబొంగరమూ లేని పద్ధతిలో ఉంటోంది. ఇటు మన వాఙ్మయంపై ఆధునాతన కాలంలో అత్యధిక ప్రాభవం చూపిన ఆంగ్లభాషలోని విమర్శపద్ధతినీ అవలంబించక, సంప్రదాయానుగతమైన సంస్కృత సాహిత్య విమర్శ పద్ధతినీ అవలంబించక ఏదో చిత్తంవచ్చిన రీతిని సాగుతోంది.

విమర్శ చెయ్యడానికి కూడా ఒక క్రమమూ, పద్ధతీ ఉండాలి. దాన్ని అనుసరించి చేస్తేనే లోకం ఇతోధిక విజ్ఞానం సంపాదించుకోగలుగుతుంది. గ్రంథవిమర్శ అత్యల్పంగా ఉన్న ఆంగ్లలోకంలో విమర్శ ఒక శాస్త్రంగా వ్యాప్తికి రాకపోవడం ఆశ్చర్యహేతువు కాదుగాని ఆంధ్రపండితులు సంస్కృతంలో రచించిన విమర్శశాస్త్ర గ్రంథాలనైనా అనుసరించుకోలేకపోవడం పరమాశ్చర్య హేతువు.

జగన్నాథ పండితరాయల రసగంగాధరాన్నీ, విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణాన్నీ ఇటీవల కొందరు అనువదించారు. కాని వారి అనువాదాలు మూలంకంటే క్లిష్టంగా ఉన్నాయంటే అతిశయోక్తి కాదు. అలాంటి అనువాదం వ్రాసిన వారికి కూడా ఉపయోగించదు.

ప్రస్తుత గ్రంథం విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణానికి అనువాదం. ఈ గ్రంథానికి ప్రతాపరుద్రీయమన్నది వాడుకలో ఉన్న పేరు. దీన్ని భట్టుమూర్తి నరసభూపాలీయంగా చేశాడని అంటారుగాని లోతుగా చూస్తే అది సత్యదూరం అనిపిస్తుంది. ఏమైనా అందులో అతి ముఖ్యమైన నాటక ప్రకరణం లేనేలేదు.

శాస్త్రగ్రంథం అనువదించడం సామాన్యమైన పని గాదు. లక్షణం చెప్పవచ్చుగాని లక్ష్యశ్లోకాలను అనువదించడానికి లక్షణాన్ని లక్షించుకొని తదనుగుణంగా రచించగల వ్యుత్పన్నుడే పూనుకోవాలి. లక్ష్యశ్లోకంలో నిబద్ధమైన వృత్తిరీతి శయ్యాపాకాదులు తెలుగు పద్యంలో కూడా యథారీతిగా వచ్చేటట్లు చెయ్యడం చాలా కష్టమైన పని. అసలు తాము చెప్పిన లక్షణం ప్రకారం సంస్కృతంలో శ్లోకం రచించడమే కష్టమని తోచి సుప్రసిద్ధకవుల శ్లోకాలను లక్ష్యాలుగా ఉదహరించిన శాస్త్రకారు లనేకు లున్నారు. ఈ విషయంలో ఈ గ్రంథకర్త మహాసాహసం చేసి కృతకృత్యులయ్యారనే చెప్పాలి. అయినా శాస్త్రప్రకాశనమే వీరి పరమలక్ష్యమయితే ప్రసిద్ధకవుల పద్యాలు ఉదహరిస్తే చాలా బాగుండేది. ప్రతాపరుద్ర చక్రవర్తి యశస్సు వర్ణించడం మూలగ్రంథకారుని ఆదర్శంగాని అనువాదకుని ఆదర్శం కాదుగదా! ఆ పుస్తకాన్ని తెలుగుచేస్తున్నప్పుడు మరొకరి పద్యాలు ఎందుకనుకుంటే శ్లోకాలను అనువదిస్తూ పఠితల ఉపయోగంకోసమైనా ఇతర కవుల పద్యాలు నుదహరిస్తే మరింత ఉపకారక మయ్యేది.

ఈ గ్రంథకర్తకు తమపుస్తకం చదివేది సంస్కృతం తెలియని ఆంధ్రసాహిత్య విద్యార్థులన్న జ్ఞానం బాగా ఉన్నది. శాస్త్రగ్రంథం ఎటువంటి రచనశైలిలో ఉండాలో బాగా ఆలోచించి దాన్ని వ్రాయగలిగినందుకు వీరు నిజంగా ధన్యులు.

ఈ పుస్తకం ఆంధ్రులకెంతో బాగా ఉపయోగించగలదు. ఇందులోనే మూలశ్లోకాలనుకూడా ఇచ్చినట్లయితే అర్థం చేసుకున్న తర్వాత కంఠస్థం చేసుకోవడానికి వీలుగా ఉండేది. ఏ విధంగానైనా ఆంధ్రవిద్యార్థిలోకానికి సంస్కృతభాషాజ్ఞాన సంపాదనాకుతూహలం ఏర్పడుతుందేమో అని ఆశ. శ్రీ ఆచార్యులవారు ఈ ధోరణిలో తదితర విమర్శ గ్రంథాలను కూడా అనువదించి ప్రచురిస్తే ఆంధ్రలోకానికి చిరస్మరణీయమైన సేవ చేసినవా రవుతారు.

'శిఖ'

---

# గ్రంథ స్వీకారము

## వీరభారతము : అలుగురాజు

రచయిత: కవిబ్రహ్మ వీటుకూరి వెంకట నరసింహశర్మగారు. ప్రకాశకులు: మోడరన్ పబ్లిషర్స్, తెనాలి. వెల రూ. ౨-౧౨-౦

## విప్లవం, లేక వేనరాజు

వీరరసంగాల నాటకము. రచయిత: ధనేకుల బుచ్చి వెంకటకృష్ణచౌదరిగారు. వెల రూ. ౦-౧౨-౦

## విధవ

ఆత్మకథ. రచయిత్రి: శ్రీమంకరాదేవిగారు. అనువాదం: కాశీవిశ్వనాథంగారు. వెల రూ. ౨-౮-౦

పై రెండూ బెజవాడ-లాల్ పబ్లికేషన్సువారి ప్రచురణలు.

## గద్యరత్న మంజూష

రచయిత: శేర్ల సాంబశివరావుగారు, దేవాంగపేట, చీరాల. వెల రూ. ౧.

## సాహితీసమితి రజతోత్సవ సంచిక

రజతోత్సవమునాటి కార్యకలాపవృత్తాంత నివేదికతోను, మరికొన్ని గద్యపద్య కృతులు సాహిత్యరచనలతోను చూపొను, చదువను ముచ్చటగానున్నది. కార్యస్థానం రేపల్లెలో.

## జయప్రకాశ్ లేఖలు

అనువాదము: ముదివర్తి సత్యనారాయణగారు. ప్రాప్తిస్థానము: దుర్గామోడరన్ బుక్ డిపో, బెజవాడ. వెల రూ. ౧.

౧. క్రమూనివేదిక, ౨. గ్రీసులో విప్లవోద్యమం, ౩. హైదరాబాదు సంస్థానంలో వెట్టిచాకిరీ, ౪. నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటం.

ఈ అన్నీ బెజవాడలోని ప్రజాశక్తి ప్రచురణాలయంవారి ప్రచురణలు.

## శ్రీ కృష్ణభావనము

పద్యకావ్యము. కృతికర్త: దంటు శ్రీనివాసశర్మగారు. ప్రకాశకులు: జీవకళామండలి, బెజవాడ. వెల రూ. ౧-౪-౦

## శాంతిమయి

నాటిక. రచయిత: కొట్టిపాటి గంగాధరరావుగారు, బాపట్ల. వెల ౧౦ అ.

## లోభి

నాటకము. మోలియర్ రచన. అనువాదకులు: పి. వి. యస్. మూర్తిరాజుగారు, బి. ఏ., బి. ఇ.డి., మెక్లారిన్ హైస్కూలు, కాకినాడ. వెల ౧౨ అ.

## జీవకారుణ్య ఆచరణ

రచయిత: చిదంబరం శ్రీ రామలింగస్వాములవారు. అనువాదకుడు: టి. వి. మునుస్వామిగారు. ప్రకాశకులు: పి.టి. రంగనాథంగారు, c/o అమృత్ కోయిల్ వీథి, కొండితోపు, మదరాసు. వెల రూ. ౧

## అపశ్రుతి

ఖండకావ్యము. కవి: కొల్లూరి శ్రీనివాసమూర్తిగారు, కలమర్ల, అనంతపురం జిల్లా.

## సరిహద్దు గాంధి

జీవితచరిత్ర. రచయిత: ఆరవల్లి సత్యనారాయణాచార్యులుగారు, భీమవరపుకోట, తూ. గోదావరి జిల్లా. వెల ౧౨ అ.

## Soudamini and other Poems

పురిపండా అప్పలస్వామిగారి కవితారచనలకు అనువాదము. అనువాదకుడు: శ్రీ శ్రీ. ప్రకాశకులు: జయానికేతనం, మద్రాసు ౩.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.